# సూర్యుడు తలెత్తాడు

(కథానికా సంకలనం)



## ఆచార్య కొలకలూరి ఇనాక్

జ్యోతి గ్రంథమాల
129 తపోవనం నగర్
అనంతపురం - 515004

'Suryudu Talettadu' a Collection Short of Stories in Telugu by Prof. KOLAKALURI ENOCH, Professor of Telugu, S. K. University, Anantapur 515003. A. P. India.





వెల : రూ. 30/-

ప్రతులకు :
జ్యోతి గ్రంథమాల
129 తపోవనం నగర్
అనంతపురం - 515004.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు - 500 029.

# అభివాదం

'సూర్యుడు తలెత్తాడు' సంకలనంలోని కథానికలు కథాహారం, కవిసమ్మేళనాలతో చదివించి, ప్రసారంచేసి, వాణిలో ప్రచురించిన ఆకాశవాణి కడప, హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం కేంద్రాధికారులకూ,

ఈ కథానికలు ప్రచురించిన ఆంధ్రజ్యోతి, దిన, వార పత్రిక, ఆంధ్ర ప్రభ దిన పత్రిక, స్వాతి, అనామిక, షోలికేక, ప్రభవ, శోభ పత్రికా సంపాదకులకూ, సాదరంగా స్వీకరించిన సహృదయ పాఠక, పండిత, విమర్శక, విజ్ఞరస లోకాలకూ,

ఈ సంకలనం ఈ రూపం పొందటానికి తోడ్పడిన, ప్రోత్సహించిన శ్రీమతికీ, చిరంజీవులకూ, బంధు మిత్రులకూ, పరిశోధక విద్యార్థులకూ, సాహితీ మూర్తులకూ, కళా ప్రియులకూ, సాహితీ పోషకులకూ, ఆత్మీయులకూ, అభిమానులకూ, పద్మావతీ ముద్రాక్షరాలకూ, చంద్రాక్షరాలకూ,

అభివాదం.

అనంతపురం
18-4-1988

కొలకలూరి ఇనాక్

# కథానికా సూచిక

# ఇదేం న్యాయం!?

అది నగరం కాదు.

ప్రక్క ఇంట్లో ఎవరున్నారో తెలుసుకోకుండా వుండే వీలులేదు.

అది పల్లె కాదు.

ఊళ్ళోకి వచ్చిన కొత్త మనిషి పుట్టు మచ్చలతోసహా అంతా అంతు పట్టించుకొనే అవకాశం లేదు.

చిన్న నగరం. పెద్దపల్లె, ఒక మాదిరి బస్తీ. తిరుపతి అనొచ్చు.

ఆ ఊళ్ళో న్యూ కాలనీ నిజంగా కొత్తగా కట్టింది. న్యూఢిల్లీ లాగా పాతది కాదు.

ఇంటికీ ఇంటికీ దూరం వున్నా కూర వండితే వాసన వస్తుంది. పిలిస్తే వినిపిస్తుంది. అంత దగ్గర. పోనీ అంత దూరం.

న్యూ కాలనీలో రామశాస్త్రి పేరు వినని వాళ్ళు ఉండరు.

అతడికి అంత ప్రసిద్ధి. దానికి కారణం లేకపోలేదు. ఆయన అంత చండ శాసనుడు. హెడ్మాస్టరుగా మునుపు జిల్లా బోర్డులో, ఇప్పుడు జిల్లా పరిషత్తులో.

అతడి ప్రసిద్ధికి ఇంకో కారణం వుంది. ఆ కారణం అతడి కొడుకు ప్రభాకర శాస్త్రి. ఒక్కడే కొడుకు. అయితే ఏం ఫర్వాలేదు.

తండ్రి పేంటు వేసుకొని సిగరెట్ తాగుతున్న ఈ కాలంలో ప్రభాకర శాస్త్రి ఆకారం బి.ఏ. చదివే అబ్బాయికి తగినట్లుగా వుండదు.

పేంటు వేసుకోడు, పంచ కట్టుకొంటాడు. అదీ మూడు మూరలది.

చొక్కా వేసుకోడు. బనీను వేసుకొంటాడు. అది బనీనూ కాదు. పొట్టి చొక్కా, పొడుగు బనీను.

తలమీద పొడుగు పిలక. ముడి వేసుకొంటాడు. పొట్టిదై కూర్చుంటుంది.

ముఖాన ఇంత బొట్టు.

ఏం పూజో పూజ! వీడివి ఈ కాలం పిల్లల బుద్ధులు కావు అని తండ్రి వాపోతూ వుంటాడు.

రామశాస్త్రి ప్రసిద్ధికి మరో కారణం భార్య.

లక్ష్మీదేవి లాగా వుంటుంది. పేరు కూడా లక్ష్మి.

పవిత్రతకు పెట్టిన పేరుగా, పుట్టిన రూపంగా వుంటుంది లక్ష్మి. ఉప వాసాలు, వారాలు, ఒక్కపొద్దులు, ఉండీ ఉండీ ఆమె వూపిరి లేని వెలుతురుగా మారిపోయింది.

ఆమె బయట కనిపించేది అబ్బురం. ఉదయం తులసి కోట సాయంత్రం ఎప్పుడైనా వరండా. అంతే.

రామశాస్త్రి ప్రసిద్ధి ఇవన్నీ స్వల్ప కారణాలు. అయితే ప్రబల కారణం మరొకటి వుంది.

అది ప్రక్క యిల్లు.

అందులో డేనియల్ వుంటున్నాడు. అంటే ఒక్కడే ఉండటం లేదు. కుటుంబంతోనే. చేసేది పోలీస్ సబ్ ఇన్స్పెక్టర్ ఉద్యోగం. అతడిది ఏం నోరో తెరిస్తే బూతుల పుట్ట.

'ఏం శాస్త్రీ! నా వుద్యోగంలో విశేషం చెప్పనా! నేనెంత పెద్దగా, మాంచి రంజుగా, క్లాస్‌గా బూతులు తిడితే నేనంత గొప్ప!'

రోడ్డుమీద పదినిమిషాలు నిలబడి ప్రాణప్రదంగా సిగరెట్లు కాల్చుకొని కబుర్లుచెప్పుకొని కదలి పోతూండడం వాళ్ళ రివాజు. శాస్త్రి కనబడకపోతే డేనియల్, డేనియల్ కన్పించక పోతే శాస్త్రి, యింటికి పోయి పలకరించి రావటం ఎప్పుడైనా వుంటే వుండవచ్చు.

న్యూకాలనీలో నీళ్ళమైత్రికి కారణం ఏమిటో ఎవరికీ తెలియదు. పోనీ, వాళ్ళకూ తెలియదు.

డేనియల్ భార్య టీచరు. ఉదయం పోతుంది. సాయంకాలం వస్తుంది. ఎప్పుడూ ఎండలోనూ వానలోనూ ఏమున్నా లేకున్నా ఆమె వుంటే చేతిలో

గొడుగుఉంటుంది. ముడిచిన గొడుగు చేతిలో వుంటుంది. ముడిచిన గొడుగు లాగ ఆమె వుంటుంది. ఆమె వస్తుంటే రెండు గొడుగులు వస్తున్నట్లు.

డేనియల్ కూతురు పేరు లత బి. ఏ., చదువుతూవుండె. డేనియల్‌కి ఏమనిపించిందో ఏమో! అంతటితో ఫుల్‌స్టాప్ పెట్టించేశాడు. అంతే సంసారం. అత్తెసరు సంసారం. ఆ అమ్మాయికి తలకాయ వుందో లేదో కాని ముఖం పైకెత్తడంతెలీదు.

ఆదివారం వస్తే ఒక చక్కని సన్యాసినిలా తయారై ఏం చర్చోఏమో పోయిందే పోవటం. సన్యాసిని అంటే కాషాయంబర ధారికాదు. వెన్నెల అంబర ధారి.

వీళ్ళు గుడికి పోతారు.

వాళ్ళు చర్చికి పోతారు.

వీళ్ళు కూరగాయలు వండు కొంటారు.

వాళ్ళు మాంసం వండు కొంటారు.

వీళ్ళు మంత్రాలు.

వాళ్ళు కీర్తనలు.

వాళ్ళకూ వీళ్ళకూ మధ్య ఏ సంబంధమూలేదు.

అయితే స్నేహం!

ఏమిటా స్నేహం?

"ఏం లక్ష్మమ్మా" అంటూ మేరివస్తుంది.

"ఏం మేరమ్మా" అంటూ లక్ష్మమ్మ పోతుంది.

కబుర్లాడు కొంటారు. కాలక్షేపం అవుతుంది.

ఈ యిద్దరు ఆడవాళ్ళు, ఆ యిద్దరు మగవాళ్ళనీ "ఏం అన్నయ్యా వదిన లేదా?"" అంటే "లేకేం వుందమ్మా" అనే సమాధానం వస్తుంది.

వాళ్ళ స్నేహానికి పెద్దకారణమూ లేదు.

వాళ్ళు విరోధంగా వుండటానికి పెద్ద అవసరమూ లేదు.

"కోణ్ణి కోసినట్లున్నారు" అంటే "అబ్బేలేదు ఉల్లిపాయలు కోసింది" అంటాడు డేనియల్. నవ్వుకొంటారు.

లక్ష్మితోటలో కాసిన చిక్కుడు గాయలు పంపితే, మేరి టొమాటోలు పంపుతుంది.

వాళ్ళకూ వీళ్ళకూ పాలవాడు ఒక్కడే!

వంట పనిచేసే ఆడవాళ్ళు ఒక తల్లిపిల్లలే.

పేపరువాడు అటునుంచివస్తే అక్కడ వేసి ఇక్కడికి. ఇటునుంచి పోతే ఇక్కణ్ణుంచి అక్కడికి.

పేపరు రాకపోయినా, పాలు రాకపోయినా బియ్యం పప్పు అవసరమైనా రెండిళ్ళ మధ్యా సరఫరా సజావుగానే సాగుతుంది. కానీ——

వాళ్ళు వీళ్ళ ఇంటిలో అన్నం తినలేదు. వీళ్ళు వాళ్ళ ఇంటిలో కాఫీ తాగ లేదు. అయితే——

వీళ్ళు వాళ్ళ నేమీ అనలేదు. అనరు, అనవలసిన అవసరం రాదు.

వాళ్ళు వీళ్ళతో పేచీ పడే పనిలేదు. పూచీ పడే రాజీ లేదు. మామూలుగా వుంటుంది.

కానీ——

ఈ ఉద్యోగులిద్దరూ ఒక అగ్గి పుల్లతో రెండు సిగరెట్లు ముట్టించుకోవటం వీధి చూచింది.

డేనియర్ మోటర్ సైకిల్ మీద వెనుక కూర్చొని రామ శాస్త్రి స్కూల్‌కి పోవటం న్యూకాలనీ చూచింది.

'భలేవాళ్ళే' అంటే 'భలేవాళ్ళే' అనుకొంటూ షేక్‌హాండు లిచ్చుకోవటం ఊరు చూచింది.

డేనియల్ కుక్కను పెంచు కొంటున్నాడు. అది బొచ్చు కుక్క. అది అరుస్తుంది. కాని కరవదు. కరవ కూడదని దానికి తెలుసు. అది అవసరమైతే అరుస్తుందనీ, అసలు కరవనే కరవదని శాస్త్రికి ఇష్టం.

అందువల్లే న్యూకాలనీ మూల మీద వీధి కుక్క ఈనితే బొచ్చున్న కుక్క పిల్లని చూచి, తెచ్చి పెంచు కుంటుంటే, మూడో రోజున దానికి అర్జెంటుగా అరెస్టు వారెంట్ వచ్చి చచ్చి స్వర్గంలో ఉంది.

అది మన కచ్చి రాలేదను కొన్నాడు శాస్త్రి.

మేరికి బాగుందని పించి తులసి మొక్క తెచ్చి, నాటి, నీళ్ళు పోసి, చుట్టూ గోడ కట్టి, ఆవురావురు మని పెంచుతుంటే తులసి మొక్కకు ఏం పొయ్యే కాలం వచ్చిందో వూపిరి పీల్చకుండా ప్రాణాయామం పట్టి కళ్ళు తేలేసి చచ్చి సరదా పడి మట్టిలో కల్సిపోయింది.

ఇదేందో కలిసి రాలేదని మేరి వూరు కొంది.

ఒక రోజు ఇంటిముందు పనివాడు నీళ్ళ చల్లుతున్నాడు. పని పిల్ల ముగ్గుతో సిద్ధం. డేనియల్ "ఓర్నీ దొంగా—ఇదేందిరా రొచ్చు రొచ్చు ఛాలే" అంటూ వెళ్ళాడు.

అది తిట్టటమూ కాదు. నీళ్ళూ ముగ్గూ వద్దనటమూ కాదు. అదంతే. ఏమనందే తనకేమీ తోచదు.

అంతదాకా లక్ష్మి చూచింది. అందులో వింతాలేదు. విడ్డూరమూ లేదు.

అప్పుడు లతవచ్చి పని పిల్ల దగ్గర నుంచి ముగ్గు తీసుకొని అల్లి బిల్లిగా మల్లెతీగలా పిల్లగువ్వలా ఉంగరాలు తిరుగుతూ ముగ్గులు చుడుతూ వుంది.

లక్ష్మి మురిసి పోయింది.

డేనియల్ చూసి "ఏందీ వంకర గీతలు" అని దూక్కుంటూ వెళ్ళి పోయాడు.

తెల్లటి చీర కట్టుకొని, నల్లటి బైబిల్ గుండె కొత్తుకొని లత ఆదివారం చర్చికి పోయింది.

చిన్నప్పట్నుంచి లక్ష్మికి లంగా లత తెలుసుకానీ, చీర లత తెలియదు. ఆమె నిలబడి చూస్తుంటే ప్రభాకర. శాస్త్రి కూడా అదే పనిగా చూస్తూవున్నాడు.

బైబిల్ చూస్తూ ఆ నల్లటిదాంట్లో ఏముందో అని విద్యార్థిలాగా ఆలోచించ సాగాడు.

ఆ రోజు సాయంకాలం ఇంటికొస్తూ బైబిల్ తెచ్చాడు.

"ఏమిటి? అది ఎందుకూ?" అంది లక్షి.

"ఎందుకా? ఇది లత గుండెకు అంతదగ్గరగా వుంటుంది కదా! ఇందులో ఏముందో చూద్దామని" అన్నాడు.

లక్ష్మి తెరిచిన నోరు నొక్కుకోవటం మరచిపోయింది.

ప్రభాకరశాస్త్రి మొలిచిన గడ్డాన్ని మీసాన్ని చులకన చేయటంవల్ల ముఖమంతా వంకర వంకరగా అల్లిబిల్లిగా,అల్లిరిబిల్లరిగా మెలికలు తిరిగి కష్ట పెట్టేశాయి.

వాటి శాపం తగలక ముందు ప్రభాకరశాస్త్రి దృష్టిలో లత ఒకప్రాణి ఇప్పుడు లత ఒక అందమైన అమ్మాయి.

లత కాలేజీకి పోతుంటే గేటులో నిలబడి చూస్తున్న ప్రభాకరశాస్త్రిని లక్ష్మి చూసి "ఎందుకురా అలా చూస్తావు?" అంటే, 'ఎందుకూ!' అంటూ వెళ్ళిపోయాడు.

ఒక రోజు లత వేపపుల్ల కోసం ఎగురుతున్న శాస్త్రిని చూచి నవ్వింది.

'ఎందుకు నవ్వుతావు?' అంది మేరి.

లత చెప్పనూలేదు. నవ్వు ఆపనూ లేదు.

నీళ్ళ బిందెతో వస్తున్న లత కాలు బెణికి మెట్ల మీద కూర్చొబడటం చూచిన శాస్త్రి పగలబడి నవ్వుతున్నాడు.

"ఎందుకురా నవ్వుతున్నావు?" అని లక్ష్మి అడిగితే "పగిలింది బిందె?" అని ఒకటే నవ్వటం.

ఒక రోజు లత మేరిని అడిగింది.

"వాళ్ళు బీదవాళ్ళా"

"కాదు"

"మరి వాళ్ళబ్బాయికి ప్యాంట్లు కుట్టించరేం? కాలేజీలో ఎలా వుంటాడో తెలుసా? అందరూ నవ్వటమే."

"నోరు మూసుకో. నీకెందుకా సంగతి?"

దానితో లత నోరు ఎత్తలేదు. ముఖమెత్త లేదు.

వెళుతున్న లతను చూస్తూ మేరీ అంది.

"శాస్త్రి ఎంత మంచివాడు. ఎంత నిష్ఠ"

లత వింటూ వెళ్ళిపోయింది.

లత అరవై పౌనులున్నప్పుడు శాస్త్రిని చూసిన గుర్తేలేదు. నూటపది పౌనులయ్యేసరికి శాస్త్రి కళ్ళలోనే కాపురం పెట్టుకొన్నాడు.

శాస్త్రి వీధి చివర నిలబడి లతవస్తుంటే చూస్తున్నాడు.

తెల్లటి చీర!

తెల్లటి రవిక! తలలో పూలు లేవు!

నుదుట బొట్టు లేదు!

చేతులకు గాజులు లేవు.

మెళ్ళో తాళి లేదు.

శాస్త్రి మనస్సు చివుక్కుమంది. కలుక్కుమంది. కెవ్వుమంది, కేరుమంది.

ఆ సాయంకాలం ఇంటికి వచ్చి చిక్కుడుగాయలు తరుగుతూవుంటే, సహాయంగా పీచు తీస్తూ "అమ్మా" అన్నాడు.

లక్ష్మి "ఏం?" అన్నట్టు తలూపింది.

తలొంచుకున్న శాస్త్రి మళ్ళీ పిలిచాడు,

"అమ్మా!"

"ఏంరా?"

"మరే"

"ఏరా"

"మరే"

"చెప్పరా"

"లతకు భర్త పోయాడా?"

"ఛీ! ఏం మాటల్రా అవి. పసిది పాపం పెళ్ళే కాలేదు!"

"అది కాదమ్మా"

"ఏమిట్రా"

"మరి అలావుంటుందేం?"

"పాపం! ఆ పిల్లకు భక్తి ఎక్కువ" శాస్త్రి అక్కణ్ణుంచి గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు. రెండోరోజు కాలేజీలో శాస్త్రి లత ఎదురుపడ్డాడు.

"మిమ్మల్నే" ఇద్దరూ అన్నారు.

"ఊ" ఇద్దరూ పలికారు.

"మాట" అన్నారు, ఆగారు.

"మీ వరస నాకేం నచ్చటం లేదు!" అన్నారు.

"నా యిష్టం" అందామనుకొన్నారు. కానీ అలా అనలేదు.

"ఏం?"

"ఇలా వుండరాదు"

"ఎలా వుండాలో"

"ఇలా కాదు"

"ఎలా?"

"చెప్తా"

ఇద్దరూ అనుకొన్నారు.

ఇద్దరూ వెళ్ళిపోయారు.

రెండు విచిత్ర జంతువులు మాట్లాడుకొంటున్నాయని కాలేజీ అంతా విరగబడి చూచింది.

ఆదివారం మధ్యాహ్నం లక్ష్మి పిండారబోసుకుంటుంటే మేరే వచ్చింది. వరండాలో లోకాభిరామాయణంలో రాముడూ వచ్చాడు. సీతా వచ్చింది. ఇద్దరూ వెళ్ళిపోయారు.

ఇంకా ఇద్దరూ మాట్లాడుకొంటుంటే మాటల్లోకి ప్రభాకరశాస్త్రి వచ్చాడు. లతా వచ్చింది.

అంతలో ఇంట్లోకి వాళ్ళిద్దరూ వచ్చారు.

ఒకర్నొకరు చూచుకొని ఇద్దరూ వెళ్ళిపోయారు.

శాస్త్రి పేంటు వేసుకొంటే బాగుంటుంది కదా అని లత అడిగిందని మేరి చెప్పి ఒకటే నవ్వటం!

లక్ష్మి నవ్వింది.

"లతచేత పూలుదండ కుట్టించుకోరాదూ" అని శాస్త్రి అన్నాడని లక్ష్మి చెప్పింది.

ఇద్దరూ నవ్వుకొన్నారు.

లత పుస్తకాలు మోయలేక మోయలేక మోసుకొంటూ పడుతూ లేస్తూ పోతూవుంటుంది.

శాస్త్రి గేటులో నిలబడి 'లతా' అన్నాడు.

లత రోడ్డు మీద ఆగి 'ఏమండీ ?' అంది.

"ఇటురా !"

దగ్గరకు పోయింది.

గేటు తీశాడు.

లోపలికి నడిచాడు.

వెంట నడిచింది.

తన గది లోకి పోయాడు.

లోపలికి పోయింది.

తలుపు వేశాడు.

లత ఎగాదిగా చూసింది.

మత్తు సువాసన వెదజల్లే కమ్మని మల్లెల దండలు దండిగా తలలో తురిమాడు.

నవ్వింది.

పిడికెడు కుంకుమ తీసుకొని నుదురంతా పామిపెట్టాడు.

దేవత నవ్వింది.

గాజులు లూజు లూజుగా జారిపోయేటట్లు చేతులకు తొడిగాడు.

లత చేతులు గల గలలాడించింది.

తలకాయ పట్టుకొని మెడ మీద మూడు ముళ్ళు వేశాడు.

గోడ మీద లక్ష్మి నవ్వుతూవుంది.

తలుపు తీస్తే ఎదురుగా లక్ష్మి నవ్వుతూవుంది.

లత, శాస్త్రి జబ్బ పట్టుకొని ఆవు దూడను లాక్కుపోయినట్లు ఇంటికి తీసుకుపోయింది.

అమ్మ లిద్దరూ గుడ్లు మిటకరించి చూస్తున్నారు.

నాన్న లిద్దరూ ఉద్యోగులు. ఇళ్ళ దగ్గరలేరు.

తన గదిలోకి తీసుకుపోయి తలుపు గడియ వేసింది.

రెండు రోజులకు తలుపులు తీసి చూస్తే శాస్త్రి పేంట్ వేసుకొన్నాడు! టెర్లిన్ షర్ట్ వేసుకొన్నాడు!

కోరమీసాలు!

క్రాఫ్!

బూటు!

ఇప్పుడు లత, శాస్త్రి కోరినట్టుంది.

శాస్త్రి, లత కోరినట్లున్నాడు.

రామశాస్త్రీ, డేనియల్ రోడ్డు మీద ఎదురయ్యారు.

'పిల్లలట' ఇద్దరూ అన్నారు.

ఇష్టపడి'

'ఏదేదో

'సరేసరే' ఒకేసారి అన్నారు.

శాస్త్రి సిగరెట్టు ఇచ్చాడు. డేనియల్ అగ్గిపుల్ల వెలిగించాడు.

ఇద్దరూ పొగ వదిలారు.

డేనియల్ మోటారు సైకిల్ స్టార్టుచేశాడు.

శాస్త్రి వెనుక కూర్చున్నాడు

బండి ఆగితే ఒట్టు!

మోటారు సైకిల్ ఇంజనూ పొగ వదిలింది.

భ్రమరం కీటకాన్ని తెచ్చి, భ్రమరాన్ని చేసి పంపుతుందట. అదో న్యాయం.

కీటకం భ్రమరాన్ని తెచ్చి కీటకంచేసి పంపుతుందా? ఇదేం న్యాయం?

భ్రమరం లాంటి శాస్త్రి కొంచెం కీటకమయ్యాడు.

కీటకం లాంటి లత కొంచెం భ్రమరమయ్యింది.

అంతా బాగానే వుంది.

మీరే చెప్పండి!

ఇదేం న్యాయం?

నిజమేమిటంటే -

శాస్త్రీ, లతా ఇంతకు ముందు పసి పిల్లలు! తర్వాత పడుచు పిల్లలు - ఇప్పుడు మనుషులు.

# కామదహనం

ఎన్నికలూ హోలీ కలిసిరావటం యింతకుముందు నే నెరగను.

ఈసారే ఇలా ఇవి కలిసివచ్చాయి.

ఎన్నికల సంరంభంలో పన్నెండు రాష్ట్రాలు, ఒకటి అటో ఇటో అయితే కావచ్చు, ఉరుకులు పరుగులుతో ఉన్నప్పుడే హోలి హడావిడి మొదలయింది.

ఎన్నికల ప్రచారం తీరు మనకు అందరకూ పరిచయమే. హోలి రంగుల రాసక్రీడ కూడా తెలిసిన సంగతే.

రెండూ కలిస్తే ఎలా వుంటుందో ఇంతకుముందు మనకు తెలియదు.

ఈసారి తెలిసింది.

ఎలక్షన్ల రోజుల్లో ప్రచారం జరుగుతుంది. అభ్యర్థులు బయలుదేరి ప్రాపగాండా చేస్తారు. వాళ్ళను బలపరిచేవాళ్ళూ ప్రచారంలో పాల్గొంటారు. ఇష్టమైన వాళ్ళు వుంటారు. పిల్లలు వుంటారు. మొత్తం హడావిడిగా వుంటుంది. నగరం గుండెపోటులా కొట్టుకొన్నట్లు వుంటుంది. హోలీరోజూ ఇంతే! కామదహనం చేయాలని వాళ్ళ కోర్కె. పప్పుబెల్లాలు పిల్లల ఇష్టాలు. ఇంటింటికీ పోతారు. డబ్బు వసూలు చేస్తారు. కాల్చటానికి పనికివచ్చేవాటిని పట్టుకుపోతారు.

ఎన్నికలవాళ్ళూ తిరుగుతారు. వీళ్ళూ తిరుగుతారు.

తిరిగారు. వీధులంతా రంగురంగుల కాగితాలు కట్టారు.

వీధులనిండా రంగులు చల్లారు.

గోడలమీద రంగురంగుల బొమ్మలు గీశారు. మాటలు రాశారు.

కొత్త రంగులు కొత్తగా మొదలయిన ఎండలకు చిక్కి బిక్కముఖం వేసుకొని గోడలమీద వేలాడుతున్నాయి.

కామదహనం చందాలు అడగటానికి మామూలుగా వచ్చే పిల్లలు ఓట్లు అడగటానికి వచ్చారు.

కాముణ్ణి దహనం చేస్తామని చెప్పలేదు.

ఫలానావాణ్ణి గెలిపించమని అడుగుతున్నారు

ఈ పిల్లలు ఒకే జట్టుగా వచ్చేవాళ్లు. ఇప్పుడు రెండు మూడు జట్లుగా వస్తున్నారు.

ఆ జట్టు గెలిపించమన్నవాళ్ళని ఈ జట్టు ఓడించమంటున్నారు.

ఊరికే రావటంలేదు. ఊరేగుతూ వస్తున్నారు.

దొరికిన వాహనం ఎక్కి సైలెన్సర్లు తీసేసి వీథికి శబ్దబ్రహ్మను అయాచితంగా దానం చేస్తున్నారు.

పుచ్చుకున్న ఓటరు సిద్ధుడు. లేకపోతే ప్రసిద్ధుడు.

పిల్లలొస్తుంటె చందా అడుగుతారని పర్సులోంచి నోటుతీసి నిలబడితే, ఓటు అడిగి, ఓటు వేయమనే నోటు ఇచ్చి వెళ్ళిపోయారు.

ఒకటి పర్సులో, మరొకటి జేబులో పెట్టుకొని బిత్తరపోయి చూడటమే పనయింది.

పార్కులో మూడు నాలుగు పబ్లిక్ మీటింగులు జరిగాయి.

అన్ని మీటింగులకు వెళ్ళాను. అందరూ అది చేస్తాం, ఇది చేస్తాం, ఏదైనా చేసేస్తాం అని చెబుతుంటే, నెలజీతం సర్దిసర్ది వాడుకొనే మధ్యతరగతి మహాత్ముణ్ణయిన నాకు చాలా భయం కలిగింది.

దేశానికో రాష్ట్రానికో ఒక పర్సు వుంటుంది.

అందులోను కొంత జీతం వుంటుంది. అది సర్ది సర్ది వాడుకొంటే సరిపోతుంది. లేకపోతే అప్పులు తేవాలి. వడ్డీ పెరుగుతుంది.

తీర్చటానికి ప్రాణం పుట్రా నగా నట్రా పోతాయి.

బంగారం ఇంట్లోంచి కనపడకుండా పోతుంది. కొంప దివాళా తీస్తుంది.

ఈ వాగ్దానాలు నిలబెట్టటానికి డబ్బు ఎక్కణ్ణుంచి వస్తుంది ?

రాష్ట్రంకాని కేంద్రంకాని ఈ వాగ్దానాలు నిలబెట్టుకోటానికి ఈ నెలలోనే వెలువడే బడ్జెట్లు సామాన్యుణ్ణి మాన్యుణ్ణి చేయటానికి ప్రయత్నిస్తాయి. గొప్ప లోటు

బడ్జెట్లుగా రూపం దిద్దుకొంటాయి. అప్పులు తెచ్చేవిగా మిగులుతాయి. ధరలు పెరుగుతాయి. ఆకలి పెరుగుతుంది.

నాకు భయం పట్టుకొంది. పిల్లలు నాదగ్గర తీసుకోకుండా మిగిల్చిపోయిన నోటును గట్టిగా పట్టుకొని కూర్చున్నాను.

వీధుల్లో ఓటు కేకలు మోగుతున్నాయి. అవి నాకు నోటు కేకలుగా వినబడుతున్నాయి.

ఎన్నికల్లో సామాన్యుల ఓట్లు సంపాదించడానికి చేసే వాగ్దానాలు అన్నీ పాటిస్తే దేశం ఏమౌతుంది ?

ఇప్పుడు వాగ్దానాలు చేస్తూవున్న అన్ని పార్టీల వాళ్ళలోను నీతి నిజాయితీ కనబడుతూ వుంది. అందరూ మాట చెల్లించేటట్లున్నారు. వీళ్ళు అనేమాట తప్పే వాళ్ళయినా మంచిది. లేకపోతే దేశం దివాళా తీయటం ఇన్‌ఫ్లేషన్ విపరీతంగా పెరగటం ఖాయం.

మరి అటువంటి పరిస్థితిలో ఈ జనం సామాన్యులు, మధ్యతరగతి వాళ్ళు, ఉద్యోగస్థులు, బీదాబిక్కీ, సాదాసీదా జనం ఎలా బతుకుతారు ?

నాకు భయంగా వుంది.

పూర్వం కరపత్ర ప్రచారానికి కాలం చెల్లిపోయింది.

ఎవరు చదువుతారు ? అందరూ చదవరు. చదవ లేరు. అందువల్ల ఏం చేయాలి ?

అందరూ చూస్తారు. చదువు రావలసిన పనిలేదు. కళ్ళుంటే చాలు.

ఎవరూ ఎవరికీ తీసి పోలేదు.

కటౌట్‌ల ప్రచారం కొత్త పద్ధతి.

ఆ ప్రచారం చేస్తున్న పిల్లల్లో కొందరికి హోలీ చేసుకుందామని సరదా పుట్టింది.

కాని, వీలుకాకుండా వుంది.

144 సెక్షను విధించారు. అది అమలులో వుండగా ఎన్నికలు జరిగాయి.

ప్రజాస్వామ్యానికి ప్రబల పరీక్ష.

నోరు మూసుకుని, నలుగురు కలవకుండా ఓటు వేసిరావటం బాగానేవుంది.

ప్రజాస్వామ్యం వర్ధిల్లుతూ వుంది.

ఎన్నికలు ముగిశాయి.

రాత్రి వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి.

హోలీ మంటల్లో వేయటం కోసం పిల్లలు కట్టెలు సంపాదించుకొంటారు మోయగలిగిన వాటిని మోసుకుపోతారు.

అర్థరాత్రి పది మందీ పోగయ్యారు. ఒక కటౌట్‌ను పడేశారు.

కట్టెలు లాగారు.

తీసుకుపోలేక పోయారు. కటౌట్‌లు బరువుగా వున్నాయి.

నిప్పు పెట్టారు. కట్టెలు అంటుకొంటున్నాయి.

మంట లేచింది. అరుపులు వినబడ్డాయి.

వీధి అంతా గోల.

కటౌట్ కాళ్ళు కాలిపోయాయి. కడుపు కాలింది. చేతులంటుకున్నాయి. పొగ కమ్మినా ముఖం మాత్రం కనబడుతూ వుంది జనం పోగయ్యారు. అటూ ఇటూ పరుగెత్తారు.

మంటలార్పారు. ఈ కటౌట్ ముఖం మాత్రం మిగిలిపోయింది. కట్టెలు చాలా భాగం కుప్పపడి వున్నాయి.

వీళ్ళు కోపంగా వున్నారు. మంట పెట్టిన వాళ్ళు దొరికితే పెద్ద కొట్లాట అవుతుంది. అందరికీ భయంగా వుంది.

వాళ్ళు దొరకలేదు.

వాళ్ళందరినీ దాచిపెట్టినట్లుగా నిలబడి ఉంది కటౌట్.

దీనికి అదేగతి పడితే బాగుండునని ఎవరో అన్నారు.

ఎవరో సర్దారు.

అందరూ వెళ్ళిపోయారు.

ఆరోజు సాయంకాలానికి ఎన్నికల ఫలితాలు తెలిశాయి.

విజయోత్సాహం ప్రదర్శించటానికి పర్మిషన్ లేక ఊరేగింపు జరుగ లేదు.

కటౌట్‌ల వీధి నిర్మానుష్యంగా ఉంది.

అర్ధరాత్రి నిటారుగా నిలబడ్డ కటౌట్ నేలకొరిగింది.

మంట లేచింది.

ఈ పదిమందీ ఈ పనిలో ఉంటే ఆ పదిమంది కర్రలు ఇనుప ఊచలు తీసుకుని ఉరుకుల పరుగులతో వచ్చేరు.

వాళ్ళను చూచి వీళ్ళు పరుగు లంకించుకున్నారు.

ఆరోజు హోలి.

రంగు నీళ్ళు జల్లుకుంటున్నారు.

రంగు నీళ్ళు జల్లుతున్నారు.

రంగు కాగితాలు ఎగరేస్తున్నారు. రంగు రంగుల రిబ్బన్లు విసురుతున్నారు.

నగరమంతా ఎన్నికల ఆనందం, హోలీ ఆనందం కలిసి అందిస్తూ వుంది.

యువతీ యువకుల ఉత్సాహం పట్టనలవి కాకుండా వుంది.

అది శృంగారం అనాలో, సరదా అనాలో తెలియని సంగతిగా వుంది.

ఎవరంతట వాళ్లు ఎవరినో వెదుకుతూ తిరుగుతూ ఉన్నట్లుగా కనిపించారు.

హోలీ పండుగ సందర్భంగా పిల్లలకు బొరుగులు పంచిపెట్టారు.

మరమరాలు ఎగరేసుకుంటూ శవం వెంట పోయినట్లు పోలోమని పోతున్నారు.

కాముణ్ణి కాల్చబోయేముందు శవవాహకులుగా బయలుదేరారు.

కొంతమంది కామన్న బంధువులు ఏడుస్తున్నారు.

రంగునీళ్లు చల్లుతున్నారు.

రంగులు ఎగురుతున్నాయి. ఎర్రరంగునీళ్లు సింధూరం-చల్లుతూ ఎవరో ఒకడు పరిడుగెతూ వస్తున్నాడు.

వీళ్ళు తమ బట్టలమీద పడకుండా పరిగెడుతున్నారు. దూరంగా జనం.

మసక మసకగా చీకటి పడుతూవుంది.

ఎర్నీళ్ళ మనిషి వస్తుంటే అందరూ పారిపోతున్నారు. అప్పుడు కర్రలు, ఇనపకడ్డీలు పట్టుకొని ఎవరినో వెదుకుతున్న వాళ్ళూవీళ్ళూ ముందుకు వచ్చారు.

ఎర్నీళ్ళ మనిషి వీళ్ళను చూచాడు. ఆగాడు.

వాళ్ళను చూశాడు. తగ్గాడు.

అటుపోబోయాడు. వాళ్ళు ముందుకు వచ్చారు.

ఇటు పరిగెత్త బోయాడు. వీళ్ళు ఉరికారు. వలలోబడ్డ చేవలాగా గిలగిల లాడాడు. పిల్లలు తరుముతున్న ఎలుకలాగా అటూఇటూ తిరిగాడు. పరుగెత్తాడు.

వాళ్ళూ కర్రలెత్తారు.

వీళ్ళూ కట్టెలెత్తారు.

ఇనుప కడ్డీలు ఆకాశంలో అల్లల్లాడుతున్నాయి.

కర్ర పడింది.

కట్టె పడింది.

కడ్డీ పడింది.

తల పగిలింది. రక్తం చిమ్మింది.

ఎర్నీళ్ళు పిచికారి గొట్టంలో నుంచి కొట్టినట్లయింది.

ఫౌంటెన్ లోంచి పొంగి నట్లుంది.

రంగునీళ్ళు చల్లు కుంటున్నారు. రంగు కాగితాలు ఎగరవేస్తున్నారు.

రంగుల హోలీ రంగం హోరెత్తి పోతూ ఉంది.

తల నేలమీద పడింది. తనువు ప్రతి అంగుళంలో కర్రదెబ్బ, కట్టెదెబ్బ, కడ్డీదెబ్బ పడింది.

కటౌట్‌లు బొమ్మలు. అవి కదలవు.

ఈ కదిలే బొమ్మ కదలకుండా పడిపోయింది. పడి ఉంది.

కట్టెలు లేవు.

కర్రలు లేవు.

ఇనుప కడ్డీలు లేవు.

అవి తెచ్చిన మనుషులూ లేరు. పిల్లలు పోలోమని పోతున్నారు.

కటౌటుల కట్టెలు కుప్ప పోశారు. దాని మీద కాలకుండా మిగిలిపోయిన కటౌట్‌ల ముఖాలు పడేశారు.

ఇంతెత్తు గుట్ట తేలింది. దానిమీద రంగునీళ్ళ బొమ్మ, కదలకుండా పడి వున్న బొమ్మ, చేరింది.

కామన్న పండుగ మొదలయింది.

నిప్పు పెట్టారు.

మంట లేచింది.

కాళ్ళు కాలాయి. చేతులు కాలాయి. వళ్ళు కాలింది. మంటలు లేస్తున్నాయి.

దూరంగా ఊరేగింపు వస్తూ ఉంది.

మంటను చూచి ఆగింది. హోలీ మంట అనుకొంటూ సాగింది.

మూడు తలలూ అంటూ కొన్నాయి.

కపాలాలు ప్రేలాయి. కపాల మోక్షమయింది.

కాముడు కాలి పోయాడని పిల్లలంతా చప్పట్లు కొట్టి కేకలు పెడుతున్నారు.

ఊరేగింపు మోత ముమ్మరంగా ఉంది. కామదహనం మంట బూడిద అవుతున్నప్పుడు ఊరేగింపు దూరమవుతూ ఉంది.

# లాటరీ బ్రతుకులు

రంగమ్మ చేతికి సుబ్బయ్య దినపత్రికఇచ్చి "లాటరీ ఫలితాలు వచ్చాయి. మన అదృష్టవంతులు ఇవాళ పేపరు చూడరు. రేపణ్ణుంచి పేప రాసుకొస్తారా, రిజల్ట్సు చూసి ఇస్తాం అంటూ వస్తారు. భద్రంగా ఉంచు" అని లోపలికి పోయి కుర్చీలో కూలబడ్డాడు.

'అట్టాగేలే' అని గబగబా తిప్పుతుంటే 'నీ మొకం నీకెందుకే అది ? ఆడ పడేసి ఇటురా' అనటంతో రంగమ్మ కిక్కురు మనకుండా భర్త దగ్గరకు చేరింది. కాని మనసంతా పేపరనే గుడిలోని రిజల్ట్సు అనే దేవుడి చుట్టూ కొబ్బరి కాయలు కొడుతూ తిరుగుతూ వుంది.

"ఎండను బడి వచ్చేరు మంచి నీళ్ళు ఇవ్వనా, మజ్జిగ ఇవ్వనా ?" అడిగింది పేపరు వైపు చూస్తూ.

"ఏకంగా అన్నమే వడ్డించు" సుబ్బయ్య చెప్పాడు.

రంగమ్మ పేపరనే చాక్లెట్ వైపు పాపాయిలా చూస్తూ పోయింది. సుబ్బయ్య ఉదయమే లేచి వెళతే మధ్యాహ్నం వస్తాడు. అన్నం తిని అరగంట నిద్రపోయి మళ్ళి లేచి వెళతాడు. రాత్రి బాగా పొద్దు పోయిందాకా రాడు.

చేసే పని లాటరీ టిక్కట్లు అమ్మటం. అది ఇష్టమయి చేయటం లేదు. అవసరమయి చేస్తున్నాడు.

ఆరేళ్ళయింది పెళ్ళయి. రంగమ్మ తుమ్మనూ లేదు. సుబ్బయ్య దగ్గనూ లేదు. ఆరోగ్యం హాయిగా ఉంది. పిల్లా జెల్లా లేదు.

ఎస్.ఎల్.సి.కి ఎగనామం పెట్టిన సుబ్బయ్యకి ఏ ఉద్యోగం ఊడి పడ లేదు. ఎనిమిదొ తరగతి ఎన్ని వందల మార్కులతోనో పాసయితే మాత్రం కలెక్టరు ఉద్యోగం వస్తుందా, గవర్నరు ఉద్యోగం వస్తుందా?

అందువల్ల రంగమ్మ ఉద్యోగం ఊసే ఎత్తుకోలేదు. ఇంట్లో అంట్లు తోము కుంటుంటే అరిగిపోయిన పాత్రలూ చేతులూ అందంగా తయారవుతుంటే, ఉద్యోగం కోసం ఊరంతా తిరిగి వచ్చిన సుబ్బయ్య చూడటానికి టైమ్ లేకపోతూ వచ్చింది.

కాలం గడిచి కాపరం వేరయి అంట్లుతోమే పనిలేక చేతులు తీట పుడతుంటే రంగమ్మ నలుపుకోవటం ప్రారంభించింది. ఉద్యోగం కోసం తిరిగిన సుబ్బయ్య చెప్పుల్లేక కాళ్ళు అరిగిపోతే, తునిగిపోతాయేమోనని భయపడి ఇల్లు పావనం చేస్తున్న రోజుల్లో భార్య అందం చూచి బావురుమన్నాడు.

లాటరీ టిక్కెట్లు అమ్మితే వచ్చే కమీషన్ రెండేళ్ళ నుంచి కూటికీ, గుడ్డకీ కొదవ లేకుండా చేస్తూ వుంది.

లాటరీ అంటే మోసం అని సుబ్బయ్య నమ్మకం.

లాటరీ టిక్కెట్లు కొనడం అంటే అత్యాశ పడటమనీ, అప్పనంగా ఎవరి సొమ్మో దోచుకోవడంతో సమానమనీ, అది కక్కుర్తి పని అనీ, ఆశబోతు తన మనీ, స్వశక్తి మీద నమ్మకం లేని వాళ్ళు చేసే చేష్ట అనీ భావం.

భారత దేశంలో ఎన్ని రాష్ట్రాలో, నెలకు అన్ని లాటరీలు. దాదాపు రోజూ లాటరీలే. దేశం బతుకే లాటరీ అయిపోయింది.

సుబ్బయ్యకు కోపం.

ప్రజా సంక్షేమం చూడవలసిన దేశం లాటరీ ప్రోత్సహించటం-తాగుళ్ళా ఘోరం. సుబ్బయ్యకు మంట.

రూపాయి ఉంటే చాలు, కూడు లేకపోయినా సరే టిక్కెట్లు కొనాల్సిందే.

అదృష్టం లేని దేశం దురదృష్టవంతుల్ని మోసగించటం కాకపోతే ఏమిటి లాటరీలు ?

సుబ్బయ్యకు వ్యధ.

పసివాడు, ముసలివాడు, ఆడ, మగ తేడా ఏమీ లేదు. అందరూ లాటరీ టిక్కెట్లు బెల్లం చుట్టూ, మురికి చుట్టూ, చీమలు దోమలు పురుగులు.

సుబ్బయ్య పొరపాటున కూడా తనకో టిక్కెట్టు కొనుక్కోలేదు.

అయితే ఈ పని మాత్రం మానలేదు. లాభసాటిగా ఉంది. లాటరీ టిక్కెట్టు అమ్ముతూనే ఉన్నాడు.

ఉద్యోగమేదీ దొరకని ఈ దేశంలో ఈ పనిలో తప్పులేదు అని తనని తాను సమర్థించుకున్నాడు సుబ్బయ్య, ఈ టిక్కెట్టు అమ్మటం తప్పు అనుకున్న పనిని ప్రోత్సహించటం అవుతుందే అని బాధ కలిగినప్పుడు.

సుబ్బయ్యను ఈ పనిలోకి పురికొల్పింది రంగమ్మ. ఆమెమాట కాదనలేక ఆరంభించిన ఈ ఉద్యోగం సుబ్బయ్య వదులుకోలేక పోతున్నాడు. ఆమె మాట మీద గురో, అవసరమో, అదృష్టం మీద తనకు అర్థంకాని అస్పష్టంగా ఉన్న నమ్మకమో, కారణం ఏమోకాని సుబ్బయ్య లాటరీ వ్యాపారం ముమ్మరంగా సాగిస్తున్నాడు.

రంగమ్మకు అదృష్టం మీద అపరిమితంగా నమ్మకం. ఈ రెండేళ్ళలో కొన్ని వందల టిక్కెట్లు అయినా కొని వుంటుంది. ఆరు లక్షలు కాదు - ఆర్రూపాయలు కాదు - ఆ రూపాయి అయినా తిరిగి రాలేదు.

ఆమె ఏమీ చదువుకోంది, తెలివి లేంది కాదు. భవిష్యత్తు ఉంది. దానిమీద ఆశ ఉంది. ఒకనాడు తనకు మంచి దశరాకపోదు. అమ్మమ్మా రాకుండా ఉండటమే. వీల్లేదు. రంగమ్మ గట్టిగా కోరుకొని యధాశక్తి టిక్కెట్టు కొని, ఫలితాలు చూసి ఏడ్చి, మళ్ళీ తేరుకొని టిక్కెట్లు కొన్ని కొని చూసి, ఏడ్చి, కొని, చూసి, ఏడ్చి, మళ్ళీ.

అందమయిన మేడ, తోట, కార్లు, బొమ్మల్లా పిల్లలూ, సీతాకోక చిలుకలా తాను, తప్పదు. లాటరీ తగులుతుంది. ఆరు లక్షలు తప్పదు. రంగమ్మ ఆశ.

అయిదేళ్ళు నోట్లోకి పోవాలి, అవమానం కాకుండా బట్టలుండాలి, ఎండకి కాలకుండా, వానకి తడవకుండా ఇల్లుండాలి, అని ఆశతో సుబ్బయ్య పదేసి పైసలు పోగు చేస్తుంటే, ఉప్పులోంచి పప్పులోంచి మిగిల్చి తగ్గించి, కూడు సరిగ్గా పెట్టకుండా చంపి, పైసలు పోగుచేసి రూపాయి కాగానే రంగమ్మ లాటరీ టిక్కెట్టు కొని,

'నీకెందుకీ పాడు బుద్ధి, రోత పని? అని సుబ్బయ్య మొదట్లో మందలించాడు. తరువాత తిట్టాడు ఒకసారి చంపుతానని బెదిరించాడు.

అప్పణ్ణుంచి ఆమె అతడికి చెప్పటం మానేసింది. టికెట్లు కొనటం మాత్రం అసలు మానలేదు

పెట్టెలో టిక్కెట్టుంది. రిజల్ట్సు పేపరులో ఉన్నాయి. ఇంట్లో సుబ్బయ్య ఉన్నాడు. రంగమ్మ వంట్లో తేళ్ళు, జెర్రులతోపాటు మంచు ముక్కలా, నిప్పు రవ్వలూ తిరుగుతున్నాయి.

చేయి కడుక్కుంటూ సుబ్బయ్య అడిగాడు. "ఏందే ఎట్టాగో ఉన్నావ్ ?"

'నేనా?'

'నువ్వే!'

'నువ్వే. ఎట్లాగో ఉంది. సరిగ్గా అన్నం కూడా తిన్లేదు,

కొంచెంసేపు పడుకొనిలేచి క్లిప్పులు సరిచేసుకొని కిటికీలో ఉన్న టిక్కెట్లు తీసుకొని సైకిలెక్కి వెళ్ళిపోయాడు సుబ్బయ్య.

ఎక్కడ జనం కూడుతారో అక్కడ చేరతాడు సుబ్బయ్య.

రంగురంగుల కాగితాలు, రకరకాల బొమ్మలు, అందానికి అందం, ఆకర్షణకి ఆకర్షణ, టిక్కెట్టు పిలచి పిలచి అమ్ముతాడు.

ఏజెంటుకి పోయే కమీషన్ కూడా తనకే రావాలంటే పెట్టుబడి ఉండాలని ఆలోచిస్తున్న రోజుల్లో అమ్మకం తగ్గిపోతూవచ్చింది. అందువల్ల ఆ ఆలోచనే మానుకొన్నాడు.

తన దగ్గర కొన్నవాడికెవరికయినా ప్రైజు వస్తే ఏజెంటుతోపాటు తన కింత ముడుతుందని భార్య ఆశ పడింది కాని, తాను దాన్ని పడనీయలేదు. పోనీ అట్లా జరగలేదు.

ఆడపిల్లలు టిక్కెట్లు అమ్మటం మొదలు పెట్టిందగ్గర్నుంచి తన వ్యాపారం తగ్గటమూ మొదలయింది. అప్పుడు తాను ఇళ్ళ చుట్టూ తిరిగి అమ్మటం ఆరంభించాడు. కొంత నయం

లేకుంటే చెడిపోయినట్లే, టిక్కెట్లు కొని చెడిపోయిన వాళ్ళు ఒకళ్ళా ఇద్దరా. ఈ వ్యసనం అన్ని వ్యసనాలు లాగానే మనిషిని సజీవంగా కాల్చిపారేస్తుంది.

ప్రైజులు వచ్చిన వాళ్ళు మాత్రం ఎవరు బాగుపడ్డారు ?

బిచ్చగాడు లక్షాధికారి అయి, పిచ్చివాడు అయి అడుక్కుంటున్నాడు.

గుమస్తా తాగి తిరిగి ఉద్యోగం పోయి ఎటోపోయాడు.

లాటరీ డబ్బు వచ్చి బాగుపడ్డ వాళ్ళు ఎవళ్ళూ కనిపించడం లేదు.

అర్హతకు మించిన డబ్బు అనర్థకంగా పరిణమిస్తుంది. రాకూడని డబ్బు ఎవడికీ రాకూడదు. జరగకూడని కీడు జరక్కూడదు.

కష్టానికి తగ్గ ఫలితం వస్తే అదే పదివేలు. రోజంతా తిరిగినా పద రూపాయల కమిషన్ వచ్చే టిక్కెట్లు అమ్మలేక పోయిన రోజు కష్టానికి ఫలితం లేదు.

ఒక్క రోజే పాతిక రూపాయల కమిషన్ వచ్చినా తప్పేమీ జరిగినట్టు కాదు. ఉన్నట్టుండి ఆకాశం ఊడి పడటం ప్రమాదం. లాటరీ డబ్బు మనిషికి లేని వ్యసనాలు నేర్పుతుంది. పూరి పాకల మీద నిప్పు ఎగిరినట్టే.

ఆ రోజు ఆదివారం. పార్కు నిండా జనం. బాగా టిక్కెట్లు అమ్ముడు పోతున్నాయి. సుబ్బయ్య ఆనందం అవధులు దాటుతూ ఉంది. అట్లాంటి సమయంలో రంగమ్మ మీద ప్రేమ పుడుతుంది సుబ్బయ్యకు.

ఏ రోజు అయినా అదృష్టం వరిస్తుందని ఆమె ఇంత కాలంగా ఎదురు చూస్తూ వచ్చింది. ఎప్పుడూ నిరాశే!

తన చేతులు పాపిష్టి చేతులు. తన చేతులమీదుగా అదృష్టం చూస్తూచూస్తూ రావటమే. ఆయన అదృష్టమే అదృష్టం. ఆయనతో ఒక్క టిక్కెట్టు, ఒక్క టిక్కెట్టు, కొనిపిస్తే.

రంగమ్మకు చలి జ్వరం వచ్చినట్లు అయింది. అది అసాధ్యమని తెల్చుకుంది.

పోనీ, తనే ఆయన దగ్గర ఒక టిక్కెట్టు కొంటే.

ఇంకేమన్నా ఉందా?

అది వీలుకాదని అనుకున్నప్పుడు, రంగమ్మ దొంగతనం చేయడానికి నిశ్చయించుకుంది.

అదీ భర్త దగ్గర.

ఒకే ఒక్క టిక్కెట్టు.

ఒక రోజు - నెల క్రితం - టిక్కెట్ల కట్ట కిటికీలో ఉండగా మజ్జిగ వడ్డించి పరుగు పరుగున వచ్చి చేతికి అందింది ఒకటి లాక్కొని పోయి పెట్టెలో పెట్టింది.

లెక్క తప్పిందని, ఇలా ఎప్పుడూ జరగలేదని, ఒక రూపాయి పొరపాటు అయిందని కమీషన్ పట్టుకొని మిగతా డబ్బు ఏజెంటు ఇచ్చాడనీ చెప్పి - 'ఛీ లాటరీ మీద నాకు ఆశ పుట్టిందో ఏమో' ఈ తప్పు జరిగిందని బాధ పడ్డాడు.

టిక్కెట్లు ఎక్కువగా అమ్మి, బాగా కమీషన్ సంపాదించి హుషారుగా ఇంటికి వచ్చిన భర్తకు ఎదురు నిలబడి భార్య స్వాగతం చెప్పింది.

'ఎన్నడూ లేంది, ఏందిది?' అనుకుంటూ గుమ్మం ఎక్కాడు సుబ్బయ్య.

'ఎప్పుడూ లేంది, ఏందీ మనిషి వాలకం?' అనుకుంది రంగమ్మ.

గుమ్మంలోనే రంగమ్మ, పొద్దుటి దినపత్రిక తీసి రిజల్టు కాగితం తిప్పి, నంబరు చూపి సుబ్బయ్య మెడ వీధిలో జనం చూస్తూండగా వాటేసుకుంది.

'ఏందిది?' అనుకుంటూ ఉండగానే రంగమ్మ లోపలికి పరుగెత్తి పెట్టె తీసి లాటరీ టిక్కెట్టు తీసి, భర్త కెదురుగా వచ్చి, "ఇదుగో" అంటూ చేతిలో ఉంచింది.

# రుచి

పీటమీద కూర్చున్న నారాయణ ముందు ప్లేటు పెట్టింది రావమ్మ.

అన్నం వడ్డించి పచ్చడి వేసింది.

ఆవురావురుమని కలుపుకొని, ముద్ద నోట్లో పెట్టుకొని, రావమ్మ ముఖంలోకి చూసి ముద్ద మింగి నారాయణ అన్నాడు 'ఏవేసి చేస్తావే ఇంత రుచిగా వుంది నీ పచ్చడి.'

ఆమె నవ్వింది. "తినండి, తినండి" అంది అంటుంటే తలలో పూలు తందానతాన అన్నాయి.

ప్లేటులో అన్నం అంతా పచ్చడి కలుపుకొన్నాడు. "ఉండండి వేపుడుంది" అంటూ వంకాయవేపుడు వేసింది.

పచ్చడి అన్నంలో వేపుడు నంజుకుంటూ, "రావీ! వంకాయ కెంతరుచి తెచ్చి పెట్టావే ?"

"నయ్యం, వంకాయలో ఏం పెట్టావే ? అనలేదు" అని రావమ్మ గల గలా నవ్వింది. పళ్ళన్నీ తోమిన గ్లాసుల్లా వరుసగా మెరిసాయి.

అన్నం వడ్డించి రసం వేసింది.

"రసమా ! ఇంకొంచెం వేయి. పుణ్యం వస్తుంది. నీ కడుపున కొడుకు పుడతాడు"

"నిజమా ?" సిలిగి సిలిగి నవ్వింది. రసం మళ్ళా వేసింది.

"బావి నీళ్ళకి రసమని పేరుపెట్టి ఎంత బడాయి నేర్చావే !"

"రసానికి బడాయి" అంటూ వళ్ళంతా వంకర్లు తిరిగేటట్టు నవ్వింది.

"నవ్వూ నవ్వూ, నవ్విన నాప చేనే పండుతుందిలే. నవ్వూ నవ్వూ" అంటూ కడుక్కోబోతుంటే "పెరుగో" అంది.

"ఇహ ఇదొకటా వెయ్యి" అన్నాడు.

అన్నం వడ్డించి పెరుగు వేసింది. ఉప్పు వేసింది.

కలుపుకొని ఒక ముద్ద తిని "రాఁవీ! నువ్వెట్లా ఏస్తావోగానీ సరిగ్గా సరిపోయేంత యేస్తావే, నేనేసుకొంటే యెక్కువో తక్కువో గానీ సమంగా సరిపోదు కదే!"

రావమ్మ నుదిటి మీద బొట్టు పెద్దదిగా అయిపోయింది.

"చేయి కడుక్కోనా? లేకపోతే ఈ ప్లేటులోనే నువ్వూ సిగ్గు పడతావా?!"

"మీ యిష్టం"

ప్లేటు ముందుకు నెట్టి లేచి బయటకుపోయి చేయి కడుక్కొనివచ్చి కూర్చున్నాడు రావమ్మ కెదురుగా నారాయణ.

రావమ్మ అన్నం వడ్డించు కోలేదు.

'ఏం?' అన్నాడు.

'తేలా?' అడిగింది.

'అయ్యో! నామతి' అని లేచిపోయి వరండాలో వున్న బండిమీంచి కట్టిన పొట్లాం తీసుకొచ్చి రావమ్మ కిచ్చాడు. పొట్లాం విప్పింది.

మిరపకాయ బజ్జీలు!

అరటికాయ బజ్జీలు!

పొటాటో బజ్జీలు!

పకోడీలు!

ఉద్ది వడలు!

అలసంద వడలు!

కళ్ళనిండా చూసింది. నోటినిండా నోరూరింది. ముఖమంతా ఉబ్బింది. ముందు పెదాలు కొరుక్కొంది. ఆపైన పొటేటో బజ్జీ సగం కొరుక్కొని 'అబ్బ!' అంది. అదక్కడ పెట్టి అరటికాయ బజ్జీ కొరికి 'అమ్మ!' అంది. అదాడుంచి ఒక అలసంద వడ కొరికి 'అయ్య!' అంది. ఒక వుద్ది వడంతా నోట్లో కుక్కొని వూపిరాడక కళ్ళవెంట నీళ్ళు వచ్చి మింగేసి, అమ్మమ్మ ఎంత బావున్నాయండి, అంది రావమ్మ.

సగం పొట్లం తినేసి అప్పుడడిగింది "ఎందుకండీ యిన్ని తెచ్చారు?"

"నువ్వు నాకేమన్నా మిగులుత్తావో లేదో సూద్దామనీ'' అన్నా రావమ్మ ఏ ఖయాల్లో ఉందో తింటూనే అంది. "మీరూ తింటారా?".

"నాకా? నాకొద్దు'' నారాయణ నీరసంగా చెప్పాడు. "నీకే! తిను'' ప్రోత్సాహపెట్టాడు.

రావమ్మ వంచిన తలెత్తకుండా తింటూనే వుంది.

"అన్నం తినవా?''

''అన్నవా? ఇదా ? నాకొద్దు బాబు!'' అంటూ పచ్చడి కలుపుకొంది. బియ్యంలో రాళ్ళేరినట్టు ఏదేదో ఏరేరి తింది. అన్నమంతా పక్కకి నెట్టింది.

వేపుడు వేసుకొని - ''చీ పాడు" అని చప్పరించి చేయి కడుక్కుంది.

''వంట ఎంతో రుచిగా వుంది. ఎందుకే అట్లా పాడుచేశావు?'' నారాయణ అడిగాడు.

''ఏం వంట. పాడువంట. ఇవి సూడండి ఎంత బావున్నాయో !" అంటూ పొట్లంలో మిగిలిపోయిన మిరపకాయ బజ్జీ తీసి ఎలుక కొరికినట్టు కొరికి, మిరపకాయ వేరు చేసి తింటూ వుంది రావమ్మ.

"రావీ! నీ చేతి కూడు నా కెంతో రుచి!"

రావమ్మ ఎగాదిగా చూసింది.

"మీ వంట నాకు బలే రుచి!"

లేచిపోయి చేయి కడుక్కొని వచ్చి పక్కలేస్తూ వుంది.

వరండాలోకి వచ్చి కూర్చుని బీడీ ముట్టించుకొన్నాడు నారాయణ.

తోపుడు బండి చక్రాలు కాళ్ళ లాగా వరండాలో నిలబడి విశ్రాంతి తీసుకొంటూ వుంది.

రావమ్మ వంట తనకు అమృతంగావుంటే తన తిండి రావమ్మకు అమృతం అబ్బలాగా వుండటం ఆశ్చర్యమే!

నారాయణ ఇన్ని రకాల తిళ్ళు వండుతాడు. కానీ తాను తినలేడు. భార్యకు తీసుకు రాకుండా వుండలేడు. వేడి వేడి అన్నంలో రావి రసం వడ్డిస్తే, తినటం కోసం ఆకలవటం మొదలు పెట్టిందగర్నుంచి కలలు కంటూ వుంటాడు. నారాయణ కెప్పుడూ ఆకలే!

నారాయణ మట్టుకు నారాయణ, నలుగురిలాగా పదో తరగతి నిలువునా అడ్డంగా బద్దలుకొట్టి, ఆ మొండి చదువుతో తలెందుకు బద్ధలుకొట్టుకోవడం అనీ ఉద్యోగం కోసం తిరిగాడు. కండక్టర్ వుద్యోగం నుంచి ప్యూను వుద్యోగం దాకా ఏదైనాసరే, నెల జీతం వచ్చే వుద్యోగం, స్వర్గలోకంలోనుంచి వూడిపడుతుందేమో నని ఆకాశంలోకి చూశాడు. ఒక రూపాయి బలపాలు కొనుక్కొని కాళ్ళకు కట్టుకునీ తిరిగాడు కాళ్ళు నొప్పులుపుట్టాయో, బలపాలన్నీ అరిగిపోయాయో, జారిపోయాయో, ఏమోకాని వుద్యోగమేకాదు, దాని వూసుకూడా ఏదీ ఊడిపడలేదు. దొరికిపోలేదు

ఉద్యోగం, సద్యోగం లేకపోయినా తలకు మాసిన మావ వొకడు దొరికి తాళి చేతికిచ్చి, "మా అమ్మాయి మెళ్ళోకట్టు" అంటే, 'కట్టేదా?' అని తండ్రి నడిగినట్టుగా చూస్తే. ఆయన తలూపితే కట్టేయటం తడువుగా ఇంటికివచ్చి కూర్చొంది రావమ్మ.

చిన్నప్పుడు ఏమన్నాచేసి పెట్టమంటే అమ్మ వడలు చేసేది. చేసే పనంతా, చదువుకు సున్నాచుట్టిన నారాయణ, చూసి అమ్మ దగ్గరచేరి వడలు చుట్టటంలో సుళువూ, సూత్రం అన్నరొచ్చినంత కరెక్టుగా లెక్క ప్రకారం నేర్చు కొన్నాడు.

పెళ్ళాం దగ్గర తన విద్య ప్రదర్శిద్దామని ఒక రోజు వడలు చేసి పెడితే ఒక్కటి కూడా మిగల్చకుండా తిని, రేపూ చేసిపెట్టమని కూర్చొంది.

ఆమె తినగా మిగిలితే, అమ్ముతుంటే, అసలు తేలటం ప్రారంభమై, లాభం రావటం మొదలై పెద్ద వ్యాపారమైపోయింది.

మొదట్లో ఇంటి ముందే కూర్చొని అమ్మటం, ఆపైన వీథిలోకి పోవటం, ఇప్పుడు నాలుగు చక్రాలబండి స్టౌ, పాత్రలు, పదార్థాలూ, అన్నీ బండీ మీదే.

సాయంకాలం నాలుగ్గంటలు దాకా, తనూ, రావమ్మా కలిసి రుబ్బుకొన్న, కలుపుకొన్న, తరుక్కొన్న, వస్తువులన్నీ తీసుకొని బండి ఆగితే ఒట్టు. ఆఘమేఘాల మీద వెళ్ళి ఓవర్‌క్లాక్ దగ్గర అయిదున్నరదాకా ఆగీ, ఘుమఘుమలు నాలుగు రోడ్లకూ రుచి చూపి బయలుదేరితే బండి ఆర్.టి.సి. డీలక్సే. రఘువీర, వెంకటేశ్వరా, శ్రీకంఠం చుట్టీ, సినిమా హాళ్ళ జనానికి వడల వాసన ప్రసాదించి విమానం ఆగితే ఒట్టు. టవరక్లాక్ దగ్గరికివచ్చి, తాపీగా గాలి పీల్చుకొంటుంది, తొమ్మిది గంటలదాకా నారాయణ బండి. తక్షణం బయలుదేరి కొత్తగా రిలీజు అయిన సినిమా ఆడే హాలు దగ్గర సడన్ బ్రేక్ వేసుకొని వూళ్ళో వాళ్ళకు వడలిచ్చి హాల్లోకి పంపించి, హాల్లోంచి వచ్చే వాళ్ళకు బజ్జీలిచ్చి యింటికి పంపించి, పదిన్నరకల్లా రావమ్మ కళ్ళలో పడటం నారాయణ దిన చర్య.

నారాయణ బండి ఎక్కడెక్కడ వుంటుందో అతని కంటే, అతని భార్య కంటే ఆ వూళ్ళోజనానికి బాగా తెలుసు. అతని చిరుతిళ్ళకు అంతడిమాండు. ఒక రోజు కొత్త దంపతులు రోడ్డుమీద అదేపనిగా నారాయణ వండుతూవుంటే తింటూ వున్నారు. నమిలిన మిరపకాయలు నాలుకకు నాజూకు తనం నేర్పితే నృత్యం చేయటం ఆరంభించి కళ్ళవెంటా, ముక్కుల వెంటా నీరువస్తూ కొత్తపెళ్ళి కూతురంది. "ఇందులో నారాయణ ఏం కలుపుకొచ్చాడో గానీ ఎంతరుచి" అని, "ఏం కలుపుతాడా? పెళ్ళాంమీద ప్రేమ!" అని మిరపకాయల కారానికీ, ఎదో సంతోషానికి ఆగలేక కూర్చుని, నిలబడి, వంగి, లేచి, సాగి, నవ్వుతూనే వున్నాడు కుర్ర భర్త.

వతనగా పాతిక ఇళ్ళకైనా రోజూ ఈ పదార్థాలు రూపాయికో, రెంటికో పొట్లాలు పంపాలి. వాళ్ళు వేపుళ్ళు లాంటివి చేసుకోవడం లేదనీ, అన్నంలో ఇవే వడ్డించు కొంటున్నారనీ నారాయణకు తెలిసిపోయింది.

మొత్తంమీద నారాయణకు వాళ్ళకూ ఈ పని లాభసాటిగానే వుంది. బాగా జరిగితే పాతికరూపాయలకు ఢోకా లేకుండా లాభం.

కొత్త ఊళ్ళోతనకేం అవమానం లేదులే అనుకొంటూ ఈ వ్యాపారం ప్రారంభించిన నారాయణ సొంతఊళ్ళో అయినా ఇదే వ్యాపారం ఇలాగే చేసుకో గలిగే ఆత్మ విశ్వాసం పెంచుకొన్నాడు.

పక్కవేసి వచ్చిన రావమ్మ వరండాలో భర్త పక్కనే కూర్చొంది.

ఆకాశంలో చందమామ నాసొమ్మేం పోయిందని వెన్నెల పారబోసు కొంటున్నాడు. నాసొమ్ము మాత్రం ఏమైనా పోతుందా అని మల్లెపూలు మత్తు సువాసన విరజిమ్ముతుంటే రెండు ముక్కులూ పూరికే వుండటం ఎందుకులే అని పీలుస్తున్నాయి.

"కాళ్ళొత్తేదా?" రావమ్మ అడిగింది.

నారాయణ "ఒద్దులే" అంటే "ఏం?" అని రెట్టించింది. "నొప్పి లేదు" అంటే "ఎందుకులేదు?" అని నిలదీసింది. "అయితే ఒత్తు" అంటే రావమ్మ కాళ్ళ దగ్గరకు చేరింది.

నారాయణ బండి తోలుకుపోయి తోసుకు వస్తున్న మొదటి రోజుల్లో విప రీతంగా కాళ్ళుపీకటం నడుంలాగటం. అప్పుడు రావమ్మని అడిగి ప్రతిమాలి రేపు బజ్జీలు ఎక్కువ తెస్తానని ఒట్టేసి కాళ్ళుపట్టించు కొనేవాడు. ఇప్పుడు నొప్పులుం డటం లేదు. అయినా ఆమె కాళ్ళు వదలదు.

పెళ్ళై రెండేళ్లు అయినా యింతవరకు పిల్లలు కలుగలేదు. ఒకగది, ఒక వరండా వాళ్ళ అద్దెఇల్లు. వరండాలో దొరలాగా సైకిల్ చక్రాల తోపుడుబండి ఆక్రమించుకొని, కాళ్ళు చేతులు ఆరజాపుకొని పోకిళ్ళు పోతూవుంది. మిగతా గదిలో సామానంతా సర్దుకొని యిమిడి పోయింది. పిల్లలుంటే యిల్లుచాలదు కాబట్టి యిద్దరూ ఇప్పుడే వద్దను కుంటున్నారు. నారాయణ బండే వుంటే ఇల్లు యిరుకు లేకపోతే దిక్కుమాలినంత విశాలం. అందువల్ల ఇరుకుగా వుంటే రావమ్మకు యిష్టం.లేకపోతే కష్టం.

రెండేళ్ళ క్రితం ఈ పని మొదలు పెట్టినప్పుడు ఇంత మంది పోటీ లేదు. ఇప్పుడు ఆడామగా తేడా లేకుండా అందరూ మొదలు పెట్టారు. అన్నపూర్ణలూ తయారయ్యారు, నలుడూ, భీముడూ సిద్ధపడ్డారు. అంతా బాగానే వుంది. అయితే మాత్రం ముందు ముందు ఈ వ్యాపారం ఎంతకాలం ఇలాగే సాగుతుందో నారాయణకు అంతుపట్టడం లేదు. ఎలా సాగుతుందో తెలియటం లేదు. అందుకే రోజుకో రుచి, రోజుకో రకం, కొత్త కొత్త వంటలు, జనం విరగబడుతున్నారు. వ్యాపారం పెరుగుతూవుంది. కొత్త రుచి పుడుతూనే వుంది. డబ్బుకూడబెడుతూనే వున్నాడు.

అయితే మాత్రం ఎంతకాలం?

ఆరోగ్యం విషయం, భవిష్యత్తు విషయం, వ్యాపారం పెరుగుదల, పోటీలు చూస్తుంటే నారాయణకేదో భయంగా ఉంటుంది.

అయితే మాత్రం ఇప్పటికేం ఫర్వాలేదు.

ఆ ఊళ్ళో నారాయణ ఒక ప్రముఖ భాగం అయిపోయాడు. ఆ వేళ నారాయణ బండి కనబడకపోతే బాధపడేవాళ్ళు రోజు రోజుకీ పెరుగుతున్నారు. ఒంట్లో బాగోకో, ఇంట్లో బాగోకో బండి రోడ్డు మీదకు రాకపోతే యోగక్షేమాలు విచారించే జనం ఇంటికి రావటమే కాదు కూర్చుండటమో మొదలైంది.

ఈ పని మానేసి ఉన్న డబ్బుతో ఇంకోపని చేస్తామంటే అందరికంటే ముందు రావమ్మ ఏడుస్తుంది. ఆ పైన ఊరుగోల పెడుతుంది.

ఏమిటో ఈ తిళ్ళు! ఊళ్ళో అందరికీ ఈ తిళ్ళు యింత ఇష్టమా! నారాయణకు మాత్రం ఈ తిళ్ళు ఏమీ నచ్చవు. సహించవు. రావమ్మరసం దానికి తిరుగులేదు. రావమ్మకో.... ఈ చిరుతిళ్ళు. ఏమిటో రుచులు!

నిజానికి తనకో సంతోషం ఉంది. తను వండిపెట్టింది నలుగురూ తింటుంటే చూచే తల్లి హృదయం ఇదే కాబోలు.

ఈ పని తాను చేయటం కోసం దేవుడు సృష్టించాడు కాబోలు అనుకొని గూళ్ళు తడుముకొన్నాడు నారాయణ.

రావమ్మ భర్తను చూచి లేపుతూ "చలిగా వుంది. లోపలికి పోదాం" అంది.

"పద" ఇద్దరూ లోపలికి పోయారు. వరండా తలుపు తాళం వేసి వుంది. గది తలుపు దగ్గరకు వేళారు. దీపం తగ్గించారు. మసక వెన్నెల! మూగసుగంధం!!

శబ్దం లేదు.

ఎప్పుడో అర్ధరాత్రి నారాయణ వండేవి గుర్తుకువచ్చి నోరు చప్పరిస్తూ, రావమ్మ అంది" ఎంత బాగా చేస్తారండి మీరు. ఏం రుచో రుచి".

"ఇంకా నయం" నారాయణ నవ్వాడు.

చందమామ మత్తుగా, మగతగా, నెమ్మదిగా, చల్లగా, హాయిగా ఆవులించాడు.

మల్లెచెండు దూరంగా సన్నగా లీలగా సువాసన వెదజల్లింది.

రేపటికోసం సైకిల్ చక్రాల బండి కాళ్ళు చేతులూ విదిలించుకొంది.

సన్నటి లేతగాలి కిటికీ ఊచలకు సంగీతం నేర్పుతూ వుంది.

నారాయణ రావమ్మ పసిపిల్లల్లాగ తెల్లారినా నవ్వుతూ నిద్రపోతున్నారు.

# రెండు వికసించిన పుష్పాలు

పెళ్ళికి వచ్చిన వాళ్ళంతా వధూవరులను చిలకా గోరింకలు లాగా వున్నారని మెచ్చుకొన్నారు. వాళ్ళు చిలకా గోరింకలు లాగా చిన్న చిన్నగా ఏం లేరు.

సుధ నిండుగా వుంది. చీరెకు శరీరం చాలకపోయినా కొదవేం లేదు. రవి వంగి పోనిదే వాకిలి తగులుతుంది. పెళ్ళికి వచ్చిన కూరగాయలమ్మి పెళ్ళి కూతుర్ని తోట కూర కాడలాగా వుందని, పెళ్ళి కొడుకును ములక్కాడ లాగ వున్నాడని చెప్పింది. అంతేకాదు వాళ్ళవి దొండ పళ్ళు లాంటి ముఖాలంది. టొమాటోల్లాంటి శరీరాలని వివరించింది.

ముసలాయన ఈడూ జోడు అంటే ఇలా వుండాలి. ముక్కు మీద వేలేసు కొని కళ్ళ జోడుకు అడ్డం వస్తుంటే వేలు జరుపుకొని ఊపిరి ఆడటం లేదని వేలిని ప్రక్కకు లాక్కున్నాడు.

'కళ్ళ పండగ అంటే ఇట్లాంటి జంటను చూడటమే' కొత్తగా పెళ్ళయిన యువకుడు అంటుంటే ప్రక్కనున్న భార్య మూతి మూడు వంకర్లు తిప్పింది.

ఆచార్లు పోతూ పోతూ నూరేళ్ళు బ్రతకమని ఆశీర్వదించాడు. 'రేషన్ బియ్యం' అని చమత్కరించాడు గుమాస్తా.

'దీర్ఘసుమంగళీభవ' అని దీవించాడు పెద్ద మనిషి.

పూజారి వెళుతుంటే రవి తండ్రి పిలిచి కొడుకును కోడల్ని దీవించమని అడిగాడు. రవి మిత్రుడు అడ్డుపడి మీ దీవెన ఇందాకే అందింది అనటంతో అవునవు ననుకొని పూజారి వెళ్ళి పోయాడు.

రవి మిత్రుడు కవి. రవి కాంచనిచో కవి కాంచునే కదా! కవి బహు మతులేం తేలేదు. కారణం బహుమతులు వద్దు అని పెళ్ళికి పంపిన ఆహ్వానంలో

ఉండటం కాదు. కవులు దరిద్రులు కదా! అయితే కవి వట్టి చేతులతో రాలేదు. గట్టి చేతులతో వచ్చాడు. చేతులైతే గట్టివే! అందులోనివి అతి మెత్తనివి.

అవి రెండు వికసించిన పుష్పాలు. అసలు సిసలైన గులాబి పూలు. ఎంత ఎరుపు! ఎంత అందం! ఎంత వయ్యారం! కవి పూలు మాత్రమే తేలేదు. వాటితో పాటు వాటి కాడలు తెచ్చాడు. అల్లాటప్పా ముళ్ళు కావు. వీలు తప్పి పట్టు కొంటే వేళ్ళోకి దిగుతాయి. నొప్పి పెడతాయి. దురద పెడతాయి. నెత్తురు గూడు కడతాయి.

కవి రవికి తన చేతుల్లోని గులాబీలు రెండు అందించాడు. 'ఏమిటిరా ఇది' అన్నాడు రవి. అనాలనుకొని అనలేదు. ఏదో అనవలసి వచ్చి అన్నాడు. 'ఎందుకురా ఇవి' అన్నట్లు అనిపించ. కవి సమాధానం చెప్పాడు. 'మీకే' రవి ఏదో అన్నాడే కాని ఎంతో ఆనందం కలిగించి. ఎందుకంటే గులాబీలు సుధకు వల్లమాలినంత ఇష్టం.

సుధ వాటి వైపు చాక్లెట్ల కోసం నోరూరుతూ చూసే పసి పిల్లలాగా చూస్తూ వుంది. ఎంత పెద్ద పూలు! ఎంత చక్కని రంగు. 'నీ కోసమే' అన్నాడు రవి. అవునన్నట్లు తలూపాడు కవి. తలలో పెట్టమని అందరూ సతాయించటంతో రవి సుధ తలలో గులాబీ తురిమాడు అంతటితో పూరుకొంటే వాళ్ళు పెళ్ళికి వచ్చిన వాళ్ళెందుకు అవుతారు. సుధను మరో పువ్వు పుచ్చుకొని రవి కోటుకు పెట్టమన్నారు. తప్పుతుందా మరి అదేమో పెళ్ళి. దాని కెన్ని తంతులు! ఎవరి వేడుకలు వాళ్ళవి! హేమంతా పట్టుబట్టి గులాబీ పూవు కోటుకు గుచ్చేటట్టు చేశామని పెళ్ళికి వచ్చిన వాళ్ళకు ఆనందం.

నేను గనక కోటులో పూవు గుచ్చ గలిగానని సుధకు వంగిస తల లేచటంలో అతిశయం. నేను కాబట్టి కోటులో పూవు పెట్టించుకొన్నానని కాలరు ఎగురుతూ వుండగా రవికి సంతోషం! అయితే పెళ్ళికి వచ్చిన వాళ్ళు చప్పట్లు కొట్టారు. కాని సుధారవులు మాత్రం మౌనంగా ఉన్నారు.

మౌనంలో ఎన్ని మాటలో! ఎన్ని ధ్వనులో! ఎన్ని భాషలో! పెళ్ళిబాగా జరిగిందని అందరూ అనుకొన్నారు.

పిల్ల తండ్రి బాగా కట్నం కానుకలు ముట్ట చెప్పాడని చెవులున్న వాళ్ళు కొరుక్కుంటున్నారు. నొప్పి పుడితే వూరుకొంటున్నారు లేకపోతే కొరుకులాట కొనసాగుతూ ఉంది. 'ఏం ఉన్న ఆస్తి అంతా ఏం చేసుకొంటాడు?' అన్నాడొక గొడుగు యజమాని, ఉందని ఊపుకొంటూ.

డబ్బు ఎవరికన్నా చేదా! అక్కడ ఉన్నవాళ్ళు చిన్నవాళ్ళు అనుకొంటూ వుండవచ్చు. ఎవరూ ఏమీ అడగలేదు. గొడుగు ఉందని ఊపకుండా ఉండలేని యజమాని నోరును ఊరకే ఉండనిస్తాడా!? చెప్పేశాడు (ఒక్కగానొక్క కూతురు.)

ఎవరో అన్నారు 'అయితే మాత్రం?'

యజమాని చెప్పేశాడు. 'లక్షల ఆస్తి ఏడుతరాలు కాలుమీద కాలేసుకొని కూర్చుని తిన్నా తరగదు.'

'కొడుకుల్లేరా ?'

'సుధే కొడుకయినా కూతురయినా'

'సరిపోయే ! - పిల్లలు గలగలేదా? వద్దనుకొన్నారా?'

'అది మనకు తెలియదు'. ఉన్న గొడుగు ఊపుకొంటూ యజమాని వెళ్ళిపోయాడు.

సుధ తల్లి ఈ మాటలు చూచాయగా వింది.

గతం కళ్ళముందు తిరిగింది. పెళ్ళయిన పదేళ్ళదాకా పిల్లలు కలగకపోతే అత్తవోరు భరించలేక పోయింది. పైకి ఏమీ అనలేదు కాని లోలోపల పిల్లలు లేకపోతే నష్టమేమీ కనిపించటం లేదు. పైకి 'ఇదే బాగుంది', అనుకోవటమేమో అనుకొంది. కాని పిల్లల్లేకపోతే ఎలా అని పదేళ్ళయ్యే సరికి కుమిలి పోసాగింది. నోములు నోచింది. యాత్రలు చేసింది. పుణ్యస్థలాలు చూచింది పుణ్యతీర్థాలలో మునిగింది. పసుపు కుంకాలు తెచ్చుకొంది. పవిత్రతను తెచ్చుకొంది. ప్రయోజనం లేదు. ఏడుస్తూ భర్త ఎదురొమ్ము మీద పడి విలవిలలాడింది. గిలగిల కొట్టుకొంది.

నెంతప్పిందని, నిల్చిందని తెల్సిన రోజుల్లో ఆమె ఆనందం పట్టరానిది. హద్దులులేనిది. అంతంలేనిది. అయ్యో అది ఆనందం. ఈ సంగతి అంతావిన్న ఆమె భర్త ఎగిరి గంతేశాడంటే నమ్మలేం కాని, కూర్చొన్న చోట కూర్చోలేదు. ఉన్నచోట ఉండలేదు. ఏం అంటున్నాడో ఏం వింటున్నాడో తెలియటం లేదు. పిల్లికి కాలుకాలితే ఏం చేస్తుందో తెలియదు కానీ, ఈయన మాత్రం వొళ్ళు కాలినట్లు తిరిగాడు. నవ్వాడు. భార్యదగ్గరకు పోతాడు. చూస్తాడు. నవ్వుతాడు. తిరిగి వస్తాడు. 'ఎటుపోతాడో తలియదు' అదీ ఆయన ఆనందం.

భార్యను పరీక్షించిన డాక్టరు కానుపు కష్టమవుతుందని చెప్పి జాగ్రత్తలన్నీ ఏకరువు పెట్టింది. అన్ని జాగ్రత్తలు తీసుకోవటానికి ఏమీ, అభ్యంతరం లేదు. కాని కష్టం గట్టెక్కుతుందని హామీలేదు.

గండం గడిచి పిండం బయట పడితె చాలురా భగవంతుడా! అని ఎదురైన గుడికి, కనపడ్డ దేవుడికి, విగ్రహాలకు మొక్కుతూ కాలం గడిపారు. ఈ కానుపుకు ఎలాగో అవస్థ పడవచ్చు కాని రెండవ కాన్పు చేయవలసి వస్తే పెద్ద ప్రాణానికే ముప్పు అని డాక్టరు చెప్పినపుడు భార్యాభర్తలేం మాట్లాడలేదు.

అవునలాగే చేద్దాం అంటే మాట తప్పరాదు.

అలా విల్లేదంటే డాక్టరు తిట్లకు తలఒగ్గాలి. అందుకని ఏమీ అనకుండా కూర్చున్నారు. అట్లా చేద్దాంలే అనే మనస్సులో అనుకొన్నారు.

కూతురు పుట్టింది. ఆ అమ్మాయే సుధ. తల్లీ బిడ్డా క్షేమంగా వున్నారు.

ఎంతో కష్టం అంది, కాని ఏమీ కష్టం లేదని తండ్రి తలక్రిందులవుతున్నప్పుడే డాక్టరు వచ్చి చల్లగా చెప్పింది. ఆమెకింక పిల్లలు కలగరు. బిడ్డసంచి తీసివేయవలసి వచ్చింది.

అదేందో అర్థం కాకపోయినా బాధకలిగింది.

పూర్తిగా తెల్సిం తర్వాత తల తిరిగిపోయింది.

అయితే ఒకటే ఓదార్పు! తల్లీపిల్లా బావున్నారు.

కొడుకు పుడితే బాగుండును కాని, ఎందుకో ఊరికే ఊరుకొన్నాడు.

మళ్ళీ పెళ్ళిమాట అనుకొన్నాడు. ఎందరో అన్నారు. భార్య కూడా అంది కాని 'పోనిద్దూ' అని వూరుకున్నాడు.

పెళ్ళిపందిట్లో నలుగురూ పోగై చెప్పుకొన్న మాటలు విన్న సుధ తల్లి 'ఆయన మంచితనం వీళ్ళకేం తెలుసు' అని అస్పష్టంగా గొణుక్కొంది.

సుధారవుల చుట్టూ జనం గుమిగూడివున్నారు.

పట్టపగలు పన్నెండు గంటలు ఆకాశంలో అరుంధతి నక్షత్రం.

పట్టుబట్టి పదిమంది చూపిస్తున్నారు. ఇద్దరు చూస్తున్నారు.

'అటు' అన్నారొకరు!

'అటు అటు' అన్నారింకోరు!

'అదుగో అక్కడే' అన్నారు మరొకరు!

మొత్తంమీద అందరూ కలిసి అరుంధతి నక్షత్రాన్ని చూపించారు. కనిపించటం లేదని మొత్తుకొని, మొండికెత్తి, మొరాయించి సుధారవులు చెప్పిచూశారు. శత్రు పరాజయం బాధ్యతగా భావించే వీరుల్లా వాళ్ళు కనిపించిందని చెప్పకపోతే వూరుకోనేటట్లు లేరు జనం.

అప్పుడే జనం గోల ప్రారంభమయింది. 'పెళ్ళి కూతురికి కళ్ళు సరిగా కనిపించవా ?'

'రవీ! కళ్ళజోడు పెట్టుకొని చూడు!' ఇదీ తంతు.

ఎందుకొచ్చిన గోలని ఇద్దరూ పట్టపగలు అరుంధతి నక్షత్రం దివ్యంగా కనిపించిందని ఒప్పేసుకొన్నారు. ఎవరయినా ఎలావుందని అడిగితే పెట్రోమాక్స్ లైటులాగావుందని కూడా చెప్పేవాళ్ళు.

లోపలికి వస్తున్న కొడుకును కోడల్ని చూస్తూ నెరిసిన మీసాల మాటున నవ్వును సీలుచేసి కనురెప్పలకి, నవ్వు నేర్పి సుతారం చేశాడు తండ్రి.

ప్రక్కనే చేరిన మనిషి 'ఏం బావా ?' అంటే 'ఏం బావా?' అని పలికాడు రవి తండ్రి.

'ఏమాత్రం సంపాదించావ్ ఈ వ్యవహారంలో' అని అడిగాడు. రవి తండ్రి నవ్వలేదు. కళ్ళు నవ్వేశాయి.

ఆ బావ ఇక్కళ్ళేడు. ఊహల్లోకి తమ వూళ్ళోకి వెళ్ళిపోయాడు

తన తండ్రికి తాను ఎనిమిదో సంతానం, తండ్రి పెంచిందే పుణ్యం. పంచి యిచ్చింది ఏమాత్రం? పెళ్ళిచేసి, ఒక ఇంటివాణ్ణిచేసి, పొట్టపోసుకోనటానికి ఇంత ఆస్తి ఇచ్చిందే ఘనం. తనేం చదువుకోలేదు. అక్షరాలు రావనికాదు. డిగ్రీలులేవు. చదువుకోలేదంటే ఈ చదువులు చదువలేదు. పెద్ద బాలశిక్షవచ్చు. లోకం కంఠోపాఠంగా చదివాడు. దానితో మెలగటంలో రవి తండ్రి ప్రవీణుడు. పెళ్ళయి సంవత్సరం తిరక్క ముందే తండ్రి అయ్యాడు.

అంతా 'తండ్రి చాలు' అన్నారు. తను తండ్రి అయితే అయ్యాడు కానీ కొడుకు మాత్రం పోయాడు. వాడికేం పనివుందో పుట్టీ పుట్టక ముందే పాసు పోర్ట్ వున్న వాడిలా వెళ్ళిపోయాడు. రెండోవాడు రెండో ఏటికి హాజరుపలికాడు. పలికిన నోటికేమయిందో మళ్ళీ పలకలేదు. నలుగురు పుట్టి నాలుగు దిక్కులను పాలించ టానికి తరలి వెళ్ళింతర్వాత పుట్టిన రవి దిక్కు లేనివాడిలా బ్రతికాడు. ఆ తర్వాత కొడుకు పుడతాడేమోనని చూశాడు. పుడితే ఒట్టు! పుట్టలేదంటే పాపం! పుట్టారు. పుట్టింది మగపిల్లలు కాదు ఆడపిల్లలు బ్రతికారంటే అన్యాయం, పోయారు. గెరిగీసినట్టు నలుగురు పోయింతర్వాత పుట్టిన కూతురు బ్రతుకుతుందని తండ్రి అనుకొన్నట్లు బ్రతికింది. బట్ట కట్టింది. చీర కట్టింది. అన్నకంటే ముందే అత్తవారిల్లు చూచింది. కన్న కొడుకుతో అన్న పెళ్ళికి వచ్చింది. పసి పిల్ల తల్లి.

కూతుర్ని ప్రేమించానని వచ్చిన వాడిని వూరడగలేదు, పేరడగలేదు, ఆస్తడగలేదు.

'నిజమేనా?' అన్నాడు

కూతురు 'నిజమే' అంది

'రైట్' అన్నాడు.

బస్సు బయలుదేరింది, ఖర్చులేదు, కట్నంలేదు, కానుకాలులేవు. అంతగొప్ప ఉద్యోగి అల్లుడు కావాలంటే ఈయన ఎన్ని సంవత్సరాలు తపస్సుచేసి ఉండవలసి ఉంటుందో అని అంచనా వేసిన వాళ్ళకు బదులులేదు. అంచనాకు అందలేదు.

తండ్రి దగ్గర పంచుకొన్నది అంతంత మాత్రం, ఆస్తిని ఇంతగా ఎలా పెంచాడో అని ఎవరయినా అడిగితే 'తినలేదు' అని జవాబు వింటారు. కాని అది నిజంకాదు. తినందే బతకలేరు. పిల్లల్ని పెంచలేరు. అంత అందంగా, పోసీ షోకుగా, పోసీ విలువగా పెంచలేరు. అందువల్ల బాగానే ఖర్చుపెట్టాడు. అయితే దుబారా చేయలేదు.

రవి తండ్రి విషయంలో కాసుకు కాసు ముడి వేస్తాడనే ఖ్యాతి వుంది. అది తప్పని ఎవరూ అనలేదు. కాని నిందగా మాత్రం అంటారు. బావలు మరీను! అవకాశం దొరికితే ఆవకాయ తిన్నట్టే. రవి తండ్రికి జీవితమంతా రాబడే! పెళ్ళి పెద్దరాబడి. దానికాయన పొంగిపోయాడు. పొగరులేదు. నిరాడంబరంగా జీవించాడు. కాబట్టే కూడబెట్టాడు నలుగురికి కూడు బెట్టాడు. ఈ ఆస్తి నాదా అనుకొంటాడు కానీ రెండు ఇళ్ళ ఆస్తికీ తన కొడుకు వారసుడైతే అంతకంటే తనకేం కావాలి.

రెండు గులాబి పూలను చూశాడు. ఒకటి తలలో! ఒకటి కోటులో! అవి పూలుగా స్త్రీ పురుషులుగా కనిపించటం లేదు, అవి ఆస్తులు!

శోభనం గదిలో ప్రవేశించిన సుధ తనతో రెండు గులాబీలను తెచ్చింది. లవకుశులు రాముడి యజ్ఞాశ్వాన్ని పట్టుకొని నిలబడ్డ పటం ముందు పెట్టింది. పగలు వడగాలి. రాత్రి హాయిగా వుంది. వెన్నెల కాలంతో నిమిత్తం లేకుండా కాస్తూ వుంది. గదిలో మల్లెపూలు మత్తువాసనలు వెదజల్లుతున్నాయి. విశాలమయిన గదిలో విశాలమయిన మంచం. మల్లెపూల మాలలు చేతులు పట్టుకొని నాట్యమాడుతున్నాయి. నవ్వుకొంటున్నాయి. చల్లనిగాలి రివటవచ్చి పూవుల్ని వెనక్కు నెట్టింది. పెనుగాలి పూలను ముందుకు నెట్టింది. పూలు అటూ ఇటూ అవుతున్నాయి. చివరికి ఒకటి అయ్యాయి. అవి ఇప్పుడు రెండు వికసించిన పుష్పాలు.

# మీకో నమస్కారం

రాయలసీమలోని క్షామ పరిస్థితుల ప్రభావం మీద ప్రపంచ ప్రఖ్యాత వ్యక్తులతో కేంద్ర బృందం పర్యటించి వెళ్ళింది అని పేపర్లలో చదివాను. రేడియో నివేదిక విన్నాను.

ఆరోజున బస్సులో ప్రయాణం చేస్తుంటే వినిపించిన మాట గుర్తుకు వచ్చినప్పుడల్లా గుండె కలుక్కుమనేటట్లుగా అయింది.

కేంద్ర బృందం పర్యటనకీ, ఈ బస్సులో మాటకీ, సంబంధం ఉంది.

ఈ మాట ఆ బృందంలోని గొప్ప విద్యావేత్త అన్నాడని ప్రచారం అయింది.

ఆ మాట మీతో చెబితో మీకు బాధకలగవచ్చు. కాని నా గుండె బరువు కొంత తీరవచ్చు. ఆత్మీయులతో ఆత్మవేదన చెప్పుకొంటే కొంత ఉపశమనం కలగడం తథ్యం.

నా బాధ నేను పడితే సరిపోతుంది, కాని మిమ్మల్ని బాధ పెట్టడం ఏం బాగుంటుంది, అని నేను ఆలోచించలేకపోలేదు.

నొవ్వ గీరుకుంటే పోతుంది. మీరంతా చూస్తున్నారుకదా అని గీరుకోకపోతే ఎక్కువవుతుంది.

ఇదీ అంతే, మీకు చెబితే బాధకదా అని చెప్పలేకపోతే దీని బరువుకు గుండె చెరువు అవుతుంది. శరీరం భరించలేకపోతుంది.

కానీ తప్పదు.

ప్రియం చెప్పమన్నారు.

ఇది ప్రియం కాదు కాబట్టి చెప్పరాదు.

సత్యం చెప్పమన్నారు.

ఇది సత్యమే! కాబట్టి చెప్పవచ్చు.

సత్యమయినా ప్రియం కాకపోతే చెప్పవద్దు అన్నారు.

ఇది సత్యమేకాని ప్రియంకాదు.

కాబట్టి చెప్పకుండా ఊరుకోవాలి.

నిజం మాట్లాడితే ఇదిపురాణ కాలంకాదు.

ఆకాలంలో అమాట వేదవాక్కు అయితే అవుగాక, మహాకవి మాట అయితే కావచ్చు.

అది చలామణి కావచ్చు.

కానీ ఈ కాలం వేరు. ఇది ప్రజారాజ్యం. ప్రజాశ్రేయస్సు దృష్టితో అప్రియమయినా సత్యమయితే చెప్పితీరక తప్పదు.

ఇది సత్యమేనా?

సత్యమే ఎందుకంటే అంత పెద్ద విద్యావేత్తలు, బాధ్యతాయుతమయిన సందర్భంలో చేసిన ప్రకటన సత్యం కాదనుకోవడం సాధ్యంకాదు.

నేను నిర్ణయించటం దేనికి! అది సత్యమో, అసత్యమో మీరే నిర్ణయించ వచ్చు.

ఆ మాటమీతో అంటే నా గుండె బరువూ తగ్గుతుంది. నేనే నిర్ణయించే బాధ్యతా తప్పుతుంది.

వచ్చే పాతికేళ్ళలో రాయలసీమలో ముఖ్యంగా అనంతపురం ప్రాంతం ఈ పరిస్థితులు ఇలాగే కొనసాగితే 'ఎడారి'గా మారుతుంది.

ఇదీ వాళ్ళన్నమాట.

వాళ్లు సత్యం చెప్పటానికే ఈ మాట అని ఉండవచ్చు.

కానిదాని ప్రభావం ఎంత భయంకరంగా ఉంటుందో ఊహించటం కష్టం. ఆ కష్టం శాస్త్రవేత్తలకు ఉండక పోవచ్చు, కాని సామాన్యుల సంగతి ఏమిటి?

నావరకు నాకు తల తిరిగిపోయింది పిచ్చిపట్టినట్లు అయింది.

దాని తీవ్రత తలుచుకొని ఎంత మంది కుమిలిపోయారో కదా!

ఎడారి అయితే ఏమవుతుంది?

మనుషులుండరు.

ఏమవుతారు?

ఎక్కడికో పోతారు.

నమ్ముకొన్న నేలతల్లి ఒడిలో సుఖశాంతులు పొందిన అసంఖ్యాక ప్రజా కోటి ఎటోపోతుంది

నేలన్నమ్ముకున్న జనం నేల లేనివాళ్లు అవుతారు.

పంటను బట్టి ప్రజాజీవనం రూపొందుతుంది. ప్రాంతం ప్రభావంతో నాగరి కత విలసిల్లుతుంది.

నాగరికత సాంద్రీభవించి సంస్కృతిగా రూపొందుతుంది

ఇన్నివేల సంవత్సరాల ప్రాచీన సంస్కృతి ఏం కావాలి? ఇంత ఏమయి పోతుంది?

దాని సంగతి కంటే ప్రజల అస్తిత్వానికి అర్థం ఏమిటి?

వీళ్ళంతా ఏమయిపోతారు?

ఇన్ని మానవ సంబంధాలు, సుఖాలు, దుఃఖాలు, ఆనందాలు, ప్రేమలు, వాత్సల్యాలు, బంధుత్వాలు, మిత్రత్వాలు, అన్నీ - అన్నీ ఏమయిపోతాయి?

వాటివిలువలు తారుమారు అవుతాయా?

మారిపోతాయా?

వేరేచోట్ల వేరేరూపాలు పొందుతాయా?

ఉన్న ఊరు వదలలేని వాళ్ళ మనుగడఎలా సాగుతుంది?

పుట్టిన ఇల్లు, పెరిగిన ఊరు, చదువుకొన్న స్కూలు, తిరిగిన చెరువుగట్టు, పూజించిన దేవాలయం, దర్శించినబళ్ళు, ప్రేమ పంచినవాళ్ళు దేశంలోని అనంత మైన అన్నలు, తమ్ముళ్ళు, అక్కలు, చెల్లెళ్ళు, అమ్మలు, నాన్నలు, కొడుకులు, కూతుళ్ళు అంతా అందరూ ఎవరూ ఎవరికీ ఏమీకాకుండా, విడిపోయి దూరంగా పడి, తెగిన గాలిపటాలయి, చెట్టుకొకరు, పుట్టకొకరు, దేశానికొకరు, రాష్ట్రాని కొకరుగా దూరమయి, వేరయి, ఊహించరాని జీవితం జీవించవలసివస్తే ఎంత ఘోరం.

ఈ ఘోరం జరగరాదు.

ఇంత పెద్ద ప్రాచీన సంస్కృతి శిథిలావశేషం కారాదు.

మనిషి పరాజితుడు కారాదు.

ఇంత విజ్ఞానశాస్త్రం అభివృద్ధి అయిన కాలంలో దేశంలో ఇటువంటి ఆపద సంభవించరాదు.

అందుకు ఏం చేయాలి?

వర్షాలు రావాలి! వర్షం వస్తే పంటలు పండుతాయి. జనం కడుపులు నిండుతాయి.

వాటికేం కోపమో, మేఘాలు నీరు మోసుకొని మా జిల్లా రావు.

ఒకవేళ గుడ్డిమేఘమో, కుంటిమేఘమో వచ్చినా వానపడదు.

వరదమాట మేమెరగం.

తుఫాను సంగతి మాకు తెలియదు.

మంచి వాన పడితే మాకు పరమానందం.

వానరాదు.

కాలువలు పారవు.

ఆనకట్టలు ఉన్నాయి. నీళ్ళుండవు. అంతే!

ఎప్పుడయినా వర్షం రాకపోతుందా. వస్తే నీళ్ల నిలవకపోతాయా అని మేం ఎదురు చూడ్డానికి గుర్తుగా మా జిల్లా నిండా ఉన్న ఆనకట్టలు ఋజువు చేస్తుంటాయి.

అందువల్ల వర్షంవల్ల పండే పంటలూ లేవు.

కాలవలవల్ల పండే పంటలూ లేవు.

ఇది ఏడాది పొడుగునా సంవత్సరాలతరబడీ జరుగుతున్న చర్విత చర్వణ చరిత్ర.

వర్షం రావటానికి మనిషి చేయగలిగిందేమీ లేదా?

లేకేం ఉంది.

అరణ్యపర్వం చదివితే వర్షం వస్తుంది. అరణ్యపర్వం అట్టలు చిరిగి, కాగితాలు చిరిగి గాలిలో ఎగిరి, మేఘాలమీదకు ప్రేమలేఖలు పట్టుకుపోయినా, వాన వచ్చే జాడయినాలేదు, రావటం మాట అటుంచి.

ఆడవాళ్ళు బట్టలు విప్పి కాలవలవెంటే పరుగెడితే వాన వస్తుంది. వరుణ దేవుడు కరుణిస్తాడు. ఏదీ అలా పరుగెత్తి పరుగెత్తి అలసిపోయి సొలసిపోయి ఆడవాళ్ళు దిసెమొలల్తో పడిపోయినా వరుణదేవుడు కరుణ కరిగిపోయిందో ఏమో కన్నీరయినా వదలటంలేదు.

యజ్ఞంచేస్తే వాన వస్తుంది. అందుకనే యజ్ఞాలు చేశారు. అయితే వాన రాలేదు. అందుకోసం ఖర్చుచేసి నోటికాడి కూడు పోగొట్టుకొన్నారు.

కప్పల పెళ్ళిళ్ళు చేస్తే వాన పడుతుందని నమ్మకం. నమ్మకం వమ్ము కాకుండా కప్పల పెళ్ళిళ్ళు చేశారు కానీ, వాన మాత్రం రాలేదు. పెళ్ళయినా వినోదం కూడా లేకుండా కప్పలు నోళ్ళెళ్ళబెట్టి నీటి తడిలేక నేలకు అతుక్కు-పోయి ఎండి మండిపోయాయి.

వర్షం రావటానికి మనిషి ఏమీ చేయలేడా? ఇంతకంటే చేయగలిగింది ఏమీ లేదా?

లేకేం ఉంది.

అయితే ఏమిటది?

చెట్లు పెంచటం.

ఇదే నా కర్థం కాలేదు.

చెట్లు పెరిగినంత మాత్రాన వాన ఎలా వస్తుంది.

వస్తుంది. అంతే! అంతే!

అదెలా ?

అదొక వశీకరణ విద్య. చెట్లు గాలి తాకితే మేఘం ఎగిరి గింగిరాలు తిరిగివచ్చి చెట్ల వళ్ళో వాలిపోతుంది.

యువతి కొనకంటి మెరుపుచూచి యువకుని హృదయం ద్రవీభవించినట్లు.

అదొక ప్రేమ వ్యవహారం.

వానకీ చెట్టుకూ అదొక లంకె !

చెట్లు గాలి సోకితే మేఘం వానై పడిపోతుంది.

కాబట్టి చెట్టు కొట్ట రాదు.

నా కోడలే కోప్పడింది.

చెట్టు కొట్టకపోతే పొయ్యిలోకి కట్టె లెలా వస్తాయి? అని.

పుత్రరత్నాలు చెట్లు తెగనరక్కి తెచ్చి కోడళ్ళకు ఆనందం కలిగిస్తున్నారు

ఉన్నది వండుకు తినటానికి లేనిది తెచ్చుకోవటానికి చాలా తేడా వుంది.

వండుకు తినటానికి ఏమీ ఉండని పరిస్థితిని గూర్చి వీళ్ళు ఆలోచించటం లేదని మరిచిపోతే చాలా మందికి ఈ దుఃఖం అర్థం కావచ్చు.

కాని చెట్లు పెంచితే? ఎంత పెంచితే అంత ఎక్కువగా వర్షం వస్తుంది.

ప్రతి సంవత్సరం అదనులో వర్షాలు పడ్డాయా అనంతపురం ఏడారి కావటం కాదు రత్నాలు పండుతాయి, రాయలసీమ నిజంగా రత్నాల సీమ అవుతుంది.

ఇబ్బడిముబ్బడిగా వానలు కురవాలంటే చిక్కి రొక్కిరుగా చెట్లు పెరగాలి.

చెట్లు!

అలవిగానంతగా కాకులు దూరని కారడవులుగా, చీమలు దూరని చిట్టడవులుగా చెట్లు పెంచితే సమస్య పరిష్కారం అవుతుంది.

అంతే! ఏముంది? చెట్లు పెంచితే సరి.

నేటి మొక్కే రేపటి చెట్టు. అయిదేళ్ళలో అలవి కాని చెట్టు, పదేళ్ళలో పెద్దమాను.

పాతికేళ్ళకు రాబోయే ఏడారి పదేళ్ళకు శాశ్వతంగా మారిపోతుంది.

మరింకేం? బాగుంది కదా! మేమంతా చెట్లు పెంచేస్తే సరిపోతుంది కదా!

నిజమే!

ఆ జాగ్రత్త తెలిసిన వాళ్ళు చెప్పారు.

పత్రికలు ప్రకటించాయి.

రేడియోలు వినిపించాయి.

పదేళ్ళలో రాయలసీమ అంతా పచ్చగా, అనంతపురం అంతా అడవిగా అవుతుందని ఆశించారు. నేనేమో నా వంతుకు పాతిక చెట్లు పెంచాను. అలాగే పెరుగుతుందని అనుకున్నాను. అనుకోవటం తప్పుకాదు కాని అనుకున్నందుకు బాధ మిగిలింది. చెట్లు కొత్తగా పెరగటం లేదు సరికదా, ఉన్నవే నేల పాలవుతున్నాయి.

మేంకొంచెం బేఫర్వాగా వున్నా ప్రభుత్వం ఊరుకోదు.

మీరు ఎప్పుడో ఒకప్పుడు అనంతపురం వచ్చేవుంటారు.

బస్సులలో ప్రయాణం చేస్తూ రోడ్ల ప్రక్క జరిగిన, జరుగుతున్న. జరగబోయే కార్యక్రమాలు చూచే వుంటారు.

పదేళ్ళనుంచి ఇటువంటి ప్రయత్నాలు గమనించే వుంటారు.

ఇదంతా చెట్ల పెంపకం కార్యక్రమమే;

జూన్, జులై నెలల్లో రోడ్లు పొడుగునా గుంటలు తవ్వుతారు.

ఆగస్టు, సెప్టెంబరుల లోపుగా మొక్కలు నాటుతారు.

అక్టోబరు నవంబరు నెలల్లో తలలూపుతూ బస్సుల్లో వచ్చే పోయేవాళ్ళకు మొక్కలు టాటా చెబుతుంటాయి.

తరువాత అవి ఏబస్సుఎక్కి ఏఊరోపోకపోయినా ఎలాగో చచ్చిపోక తప్పదు.

కావలసింది నీళ్లు!

ఎన్నిచెట్లకు! ఎన్నిచోట్ల? ఎలాపోయడం? పోని పశువులున్నాయి. వాటికి మేతకావాలి. పచ్చని మొక్కవుంటే పశువు ప్రాణం ఊరుకో నిస్తుందా!

బడికి వెళుతూ పిల్లలు చేతులు ఊరికే ఉంచుకోగలరా?

కంచె వేయాలి.

వేయకుండా ఊరుకుంటారా?' వేశారు. లారీలతో నీళ్ళు తోలిపోయించారు. మొక్క బతికింది. రోడ్డుబారునా నవ్వుతూ నిలబడ్డాయి మొక్కలు.

చుట్టూపాతిన ముళ్ళకంపలు ఎండిపోయాయి.

అవి పొయ్యిలో పెట్టుకోటానికి పనికొస్తాయి.

అంతే! నెలరోజుల్లో అన్ని మొక్కలు చుట్టూవున్న ఎండు ముళ్ళకంప వెళ్ళిపోయింది.

బట్టల్లేకుండా ఉన్న పసిపిల్లల్లాగా మొక్కలు సిగ్గుపడుతూ నిలబడ్డాయి.

వాటి సిగ్గుచితకా వారంపదిరోజులలో వీధిలో కనపడకుండా పోయి దాక్కున్నాయి.

మళ్ళి రోడ్డు పూర్వరూపం.

ఈ సారి ఇలాకాదు.

మొక్కలు నాటారు. సరివికట్టెలు కొన్ని ఎకరాల మేరకు పాతారు. కట్టెల కణపుల్లో ఇనప తీగలల్లారు.

నాకు పట్టరాని ఆనందం కలిగింది.

బడిపిల్లలు మొక్కలజోలికి పోరు పోలేరు.

పశువులు మళ్ళి తీగల్లోంచి దూరలేవు.

ఎక్కడ తలదాచుకుంటాయో కానీ మళ్ళికంటికి కనిపించవు మొక్కలు.

మళ్ళి సంవత్సరం మొదలు, వానలు వస్తాయనే ఆశలు ఆరంభం. మళ్ళి గుంటలు, మొక్కలు తలదాచుకోవటం, ఇవీ అంతర్ధానం కావటం. ఇదీప్రతి ఏటి కార్యక్రమం అయిపోయింది. మొక్కలూలేవు - చెట్లూలేవు.

ఏయేరోడ్లో ఎవరెవరు తిరుగుతారో ఆయా మొక్కలకథ వాళ్ళకు తెలుస్తుంది.

అంతా కలిసి ఊక ఉమ్మడిగా చెప్పటానికి ఎందుకు? మారోడ్డు రామాయణం మీకు విన్నవిస్తే రాముడికి సీత ఏమవుతుందో మీరే చెబుతారు.

అనంతపురం ప్రక్కగా, అన్ని ఊళ్ళ మాదిరిగానే, బైపాస్‌రోడ్డు ఈ మధ్యనే వేశారు.

ఒక పక్క బైపాస్ రోడ్డు మీద సందడి నాకు బాగా తెలుసు.

నాకు అప్పుడప్పుడు అనిపించేది, వానలొస్తే చెట్లుంటాయి, చెట్లుంటే వాన వస్తుంది.

ఇందులో ఏది ముందు ?

విత్తుముందా? చెట్టు ముందా? అది వేదాంత సమస్య ముందు. మునుపు.

ఇప్పుడు వానముందా? చెట్టు ముందా? ఇది సమస్య

మొక్క నాటటం తేలికే. అది చెట్టుకావటం కష్టం.

వాన రావాలి.

రాకపోతే నీళ్ళుపోయాలి.

వానలు రాకపోతే నీళ్ళెక్కడ నుంచి వస్తాయి.

మొక్కలకేం ఫర్వాలేదు.

రోజూ లారీలు నీళ్ళు మోసి తెస్తున్నాయి. పోసిపోతున్నాయి.

మొక్కలు కళకళలాడుతున్నాయి. ఎంత బాగున్నాయని, పిల్లల్లాగ నవ్వుతున్నాయి. చేతులు చాస్తున్నాయి. ఆనందంగా పిలుస్తున్నాయి. కాని ఆ ఆనందం నిలిస్తేనా?

సరివి కట్టెలు కొట్టం కట్టుకోవడానికి పనికివస్తాయి. పైగా వాటి మీద కాపలా కాయటం లేదు ఇంటికి వాడుకొంటే వాటంగా ఉంటుంది.

ఒకరోజు ఒకకట్టె వంగిపోయింది. తర్వాత పడిపోయింది. ఆ పైన లేదు.

రెండో రోజు మరో కట్టె తీసుకుపోతున్న మనిషి కనిపించాడు.

ఆపాను. అడిగాను. తిట్టాను.

అక్కడే పడేసి వెళ్ళిపోయాడు. ఆ పెద్దాయనకోపం ఎక్కువ అని నసిగాడు. నలుగురితో అన్నాడు.

అంతే అన్నాడులే అనుకున్నాను. కానీ నాలుగు వారాలలో ఒక్క కట్టె కూడా లేకుండాపోయింది.

ఇనప తీగె ఉంగరాలు తిరిగి దొర్లుతూ ఉంది.

నెలల తరబడీ అది అలాగే వుంది.

అదీ ఏదో ఒకరోజుకు ఎవరికోఒకరికి ఉపయోగపడుతుందని నాకు తెలుసు.

నాకు ఏం తెలిస్తే ఏం లాభం ?

మొక్కలు ఒక్కొక్కటి ముఖం ముడుచుకున్నాయి. తలవంచుకున్నాయి.

నేల చూపులు చూశాయి. నేలలోకి కూరుకుపోయాయి. అయినా మనిషి ప్రయత్నం ఆగలేదు.

మళ్ళీ సంవత్సరం గుంటలు, మొక్కలు, లారీలు, నీళ్ళు, వాటిచుట్టూ బండలు పాతి ఇనుపతీగెలు అల్లారు.

మళ్ళీ మొక్కలు పెరుగుతున్నాయి. ఈసారి అవి నవ్వినా నాకు ఆనందం లేదు. అవి పిలిచినా నేను పలకటం లేదు. అవి నాకు ఉత్సాహం కలిగించటం లేదు.

నవ్వే వాటిని చూస్తుంటే చావబోయే వాటిని చూస్తున్నట్లే ఉంటుంది.

నవ్వుతున్న మనుషుల్ని చూస్తుంటే వల్లకాడు గుర్తుకు వస్తూంది.

పరిమళ భరితంగా వున్న నగరం చూస్తుంటే, ఆ చలనం తిలకిస్తుంటే, ఆ ఉత్సాహం పరికిస్తుంటే, నాకు ఎడారి కనబడుతూఉంది.

ఏరోజైనా చచ్చిపోయే మొక్క కనబడుతూ వుంటుంది.

నా బంధువులు, మిత్రులు, శిష్యులు, మా ఊరివాళ్ళు, మా జిల్లా వాళ్ళు, అందరూ నీళ్లులేని ఎడారి కాబోయే రోడ్డు ప్రక్క నాటిన పసి, లేత, అమాయకపు మొక్కల్లాగ కనబడుతున్నారు.

నా నాగరికతా! నా సంస్కృతీ! నా ప్రాచీనతా! నా అభ్యుదయమా! నా భవిష్యత్తా! నా మొక్కల్ని, ఈ మొక్కల్ని పెంచండి! పుణ్యం కట్టుకోండి! మీకో నమస్కారం.

# పిడికిలి

ప్లేటు నిండా అన్నం
చుట్టూ కూరలు
ఆరేళ్ళవాడు ఏరేరి తింటున్నాడు.
రోడ్డూడ్చిన దుమ్ములాంటి
పసివాడు బిచ్చగాడు.
కడుపులో ఆకలి
కళ్ళల్లో నీళ్ళు
నుదుట పెద్దమ్మ
చుట్టూ చిన్నమ్మ.
'అమ్మా ఆకలి'
'అమ్మా అన్నం'
ఎవరూ వినలేదు
ఏమీ పెట్టలేదు
ఏదీ అనలేదు.
కడుపులో మంట.
కూరల కూడు
తింటున్నాడువాడు.
ఆకలైన పీడు
అడుక్కొంటున్నవాడు.
ఇంట్లో కూడున్న పిల్లాడు
వీధిలో ఆకలున్న పిల్లాడు
అక్షరాలలో
లోపంలా జనం లేరు

వీధిలో మనుష్యులు లేరు
వీధి పిల్లాడు
ఇంట్లోకి పోయాడు,
ప్లేటు అన్నం
పిడికెడు పట్టుకొన్నాడు.
ప్లేటు కేక పెట్టింది
పిడికిలి బిగిసింది
ఇంటిలో వీధి ఏకమయ్యింది.
పిడికిలి పట్టుకొంది
పిడికిలి కదల్లేదు
వదల్లేదు సడల్లేదు
నోటికి చేరలేదు
మెతుకులు రాలలేదు.
అమ్మకాదు, నాన్నకాదు,
వాడకాదు, ఊరుకాదు
దేశమంతా కలిసి వచ్చింది.
పిడికిలి బిగిసింది
పోలీసు వచ్చాడు
చేయి పట్టుకొన్నాడు
పిడికిలి! కొడవలి
ఉలి! బలి!
మెతుకులు రాలలేదు.
పిడికిలి సడల్లేదు.
న్యాయవాది వృత్తి ధర్మం నిలబెట్టాడు.
పిడికిలి చూశాడు
బిగిసింది, బలిసింది

అరిసింది, ఆక్రోశించింది,
కటకటాల్లో పిడికిలి,
రాయి అయింది.
కాలం కాలి పిడికిలి
ఇనుమయింది.
కడుపు నిండుతూ వుంది
ఆకలి మండుతూ వుంది.
కటకటాలు కాలుతూ వున్నాయి.
పిడికిలి కలి
పిడికిలి చలి
పిడికిలి పోలి
పిడికిలి చుట్టూ కళ్ళూ గోళ్ళూ
అరిచేతి మీద నిలువుటద్దం
ఎగుడూ దిగుడూ
పైకీ కిందికీ గీతలు
రేఖలు ఒకటా రెండా?
వందలు, వేలు.
అన్నీ వున్నాయి
అందులో మెతుకుల్లేవు
వేళ్ళ సందుల్లోంచి
ముందు వెనుకల్నుంచి,
వేళ్ళనుంచి,
బ్రతుకు నుంచి,
పోయాయి, పారిపోయాయి.
పరారయ్యాయి,
పరాభవమయ్యాయి.

పసివాడి కళ్ళల్లో
మంచు కరిగింది
హిమాలయం కరిగింది
ఎవరెస్టు కరిగింది
నీతుల శిఖరాలు కూలాయి.
నియమాల పర్వతాలు పగిలాయి.
ధర్మాల పునాదులు చీలాయి.
పాప పుణ్యాల అరణ్యాలు కాలాయి.

పిడికిలి బిగిసేవుంది.
కడుపు నిండుతూ వుంది
కటకటాల్లో తిండి
వెలుపలా తిండి
కడుపుకేం భయంలేదు.
తిండికేం కొదవలేదు.
అయితే పిడికిలి పులి, బెబ్బులి.

చిరుగు నిక్కరు
స్ట్రెచ్‌లాన్ పాంటు.
చెప్పుల్లేని కాళ్ళు
బూట్ల జోళ్ళు.
నడక కాళ్ళు
కారు కాళ్ళు.
కాలం లాగా కారు,
నగరం గొంతులో గరళం,
ఊరిచుట్టూ కారు.
ఉరి కొయ్యనేడు,
ఉన్నచోట వుండని కారు.

ఊపి రాదని ఊరు.
ఇళ్ళ తాళాలు
బీరువాల బీగాలు
బేంకు లాకర్లు
కుబేరుడి అగచాట్లు.
ఉన్నచోట ఉండని కారు,
ఊరికి కంగారు.
పిడికిలి బిగిసే ఉంది
పిడికిలి గిలి
గుండె నెత్తురు తాగి
చీకి ఉమ్మి వేస్తూ ఉంది
గొంతు ప్రాణం లాగి
లేడి ఆడుతూ వుంది.
తల కత్తిరించి
కత్తి చిందులు వేస్తుంది.
వంట్లో దూరుకుపోయి
తూటాలు అరుస్తున్నాయి.
పిడికిలి బిగిసే వుంది.
పిడికిలి చలి
దొంగ కోసం గాలింపు
గజదొంగ కోసం బందోబస్తు
హంతకుడి కోసం అన్వేషణ
కాలాంతకుడి కోసం వెదకులాట.
దేశం పెనం మీద
భయం అట్టు కాలి మాడి బూడిద.
దేశం గుండె మీద

భ్రాంతి అగ్ని పర్వతం పగలి, రగిలి
దేశం నలుమూలల
నిద్రపట్టని లోకం కేకలు.
దేశం నలుమూలల్లో
కలిపులి పిడికిలి
పిడికిలి బిగిసే ఉంది.
పిడికిలి ఆకలి.
పిడికిలి బిగిసి దొరికినా
చచ్చి దొరికినా
తల దొరికినా
ప్రాణం దొరికినా
అప్పగిస్తే
బహుమతి.
పిడికిలి ఒక్కటా ?
దేశం నిండా.
పిడికిలి ఇక్కడా ?
దేశం నిండా.

పిడికిలి ఎత్తే
దేశమంతా,
పిడికిలి
దేశమంటే
పిడికిలే
దేశం.
పిడికిలే దేశం
దేశం పిడికిలి
పిడికిలి పీడకల

దేశం పీడకల
పీడకల దేశం పిడికిలి
దేశం పీడకల పిడికిలి
ఆరేళ్ళ ప్లేటు పసివాడు
అరవయ్యేళ్ళ ముసలివాడై
తిన్న అన్నం అరక్క
తీరికగా చచ్చిపోయాడు.

ఆరేళ్ళ వీధి పని బిచ్చగాడు
అరవయ్యేళ్ళ కోట్లకెత్తినపడగవాడు
పట్టుకునే ప్రబుద్ధుడు దొరక్క
తీరుబడిగా సుఖంగా - సంతోషంగా.

సొమ్ముపోయి
జనం కన్నీరు.
జనం పోయి
ఉన్న వాళ్ళ కన్నీరు.

కత్తి కన్నీరు
నెత్తి కన్నీరు
కారు కన్నీరు
ఊరు కన్నీరు
వల్లకాడు కన్నీరు.

పసిబిడ్డ బిచ్చగాడు
ఆకలయిన పిడికిట కన్నీరు.
ముసలివాడి ముఖంలా కన్నీరు.
ఆనాటి, నేటి, రేపటి కన్నీరు.

బాధగా, భయంగా
జాలిగా, పీడగా
ఏడుపుగా, గోడుగా
దుఃఖంగా, రోదనగా
కన్నీరు, కన్నీరు, కన్నీరు.

ఆ కన్నీరు
ఈ కన్నీరు
మన మున్నీరు
కృష్ణ గోదావరి
గంగా కావేరి
సరస్వతీ యమున
బ్రహ్మపుత్రా సింధు
నర్మదా తపతి
అరేబియా బంగాళాఖాతం
హిందూ మహాసముద్రం.

# విష్ యు హేపీ క్రిస్మస్

"రక్షకుండుదయించినాడట

మన కొరకు పరమ రక్షకుండుదయించినాడట"

చర్చిలోంచి పాట వినబడుతూవుంది. క్రీస్తు జన్మకదీ గానం. క్రిస్మస్ సంగీతం

ఈ పాట చర్చి గుండెలోంచి సుడులు తిరుగుతూ వెలువడుతూ ఉంది. ఈ చర్చి పట్టణం గుండెగా వుంది. ఈ పట్టణం ఆంధ్ర రాష్ట్రానికి గుండె.

చర్చిలో ఉత్సాహంలో వెలుతురులో సంగీతంలో సుగంధంలో ధ్యానంలో క్రైస్తవులు. రంగు కాగితాలు అలంకారాలతో, అలంకరించుచున్న మనుషులతో, చర్చి ఉత్సాహంగా ఉత్సవంగా ఊపిరి పీలుస్తూ వుంది.

ఫాదర్ ప్రసంగం ప్రారంభించాడు. యేసు క్రీస్తు పుట్టడం, ఆ పుట్టుకను గూర్చి ముందుగానే ప్రవక్తలు తెలియజేయడం. దేవదూతలు గొర్రెల కాపరుల గురించి ప్రతి సంవత్సరం క్రిస్మస్ రోజు చెప్పేదే వివరిస్తున్నారు.

అవి ఎన్నోసార్లు విన్న వాళ్ళు చాలా మంది. వాళ్ళే దాన్ని చాలాసార్లు చదివారు. ఎప్పుడూ వినని వాళ్ళు ఇంకా అ ఆ లు రానివాళ్లు ఇప్పుడు వింటు న్నారు. అయితే అర్థం కాదు. అర్థమయిన వాళ్ళకు ప్రతి సంవత్సరం కొత్త అర్థం, కొత్త జీవితం, కొత్త సమన్వయం. మరీ కొత్తగా క్రీస్తు జీవితం వినిపి స్తుంది. మనస్సుకు అనిపిస్తుంది.

వృద్ధులు భక్తితో పరవశించి పోతుంటే, పెద్దలు పదిమందిని చూసి పరమా నందం పొందుతుంటే, యువత చుట్టూవున్న జీవితం పులుంకొనే రంగుల మీద కలల సామ్రాజ్యం నిర్మించు కొంటుంటే, పసివాళ్లు కొత్తబట్టల మైకంతో స్వర్గం పరిపాలించే డ్యూటీ పుచ్చుకొన్నట్టు పొంగి పోతున్నారు.

చర్చిలో వున్నవాళ్లు ఎవరెవరు ఏయేదశల్లో మనస్థితుల్లో వున్నారో చెప్ప వచ్చు గానీ రత్నం మణి మాత్రం ఎవరి ఊహలనూ అందే మనుషులుకారు. వాళ్ళిద్దర్నీ చూసినవాళ్లు ముక్కుమీద వేలు వేసుకోలేదు. మూతి ముడుచుకోలేదు. కాని బిత్తర పోయారు.

సూర్యుడు పగలు, చంద్రుడు రాత్రి వుండటం మామూలే కాని ఇద్దరూ ఎప్పుడైనా ఒకేసారి వుండటం విడ్డూరం. అదే జరిగింది. చర్చిలో గంట నుంచి ఇద్దరూ వున్నారు.

వాళ్ళు పసివాళ్ళూ కారు; పడుచువాళ్ళూకారు, ప్రాణం పోయే వాళ్ళూ కారు; ప్రాణం తీసే వాళ్ళు. అందుకే చర్చికి భయం.

రత్నం మణిరత్నాలూ కారు, మణులూ కారు. ఒకాయన జీవరత్నం మరొక మనిషి శిఖామణి

వాళ్ళు పేర్లు చెబితే మాయల ఫకీరును చూసిన ఆడవాళ్ళు భయపడినట్లు, సర్వాయి పాపడి పేరు విన్న పసివాళ్ళు జడుసుకొన్నట్లు, ఎవరూ ఏమీ కారు కాని, వాళ్ళకెవరూ ఎదురుపోరు. కొడతారని కాదు, చంపుతారని కాదు, భయం. అంతే!

అలా అని వాళ్ళు రౌడీలు కారు. పోకిరీ వాళ్ళు కారు. చదువు సంగతి చెప్పే డిగ్రీలలో ఎం. ఎ. పెద్దదైతే అది వున్నవాళ్ళు. డిగ్రీ వుండి వూరుకున్న వాళ్ళు కారు. ఉద్యోగాలు చేస్తున్నవాళ్లు. ఉద్యోగాలు సామాన్యమయినవీ కాదు.

జీవరత్నం జూనియర్ కాలేజీకి, శిఖామణి డిగ్రీ కాలేజీకి ప్రిన్సిపాల్సు. ఇంత మంచి వాళ్ళను, పోని గొప్పవాళ్ళను,కాకపోతే ఉద్యోగుల్ని,చూచి ఎందుకు చర్చిలో వున్న జనం బెదిరినట్లు కనిపించింది? కారణం వుంది.

నాలుగేళ్ళ పూర్వం చర్చికి క్రిస్మస్ రోజున వాళ్ళిద్దరు బంధుమిత్ర సపరివార సమేతంగా వచ్చారు. బంధుమిత్రులు రంగంలోకి దూకలేదు. కాని పరివారాలు మాత్రం సరదాగా తలపడి, తలకాయలు పగిలి ఆసుపత్రిని పవిత్రం చేసి, ఆపైన సెషన్స్‌కోర్టు చుట్టూ, మేజిస్ట్రేట్ కోర్టునూ, హైకోర్టు చుట్టూ సెషన్స్‌కోర్టునూ తిప్పి, తిప్పలుపడి మూడు చెరువులు కాదు, మూడు పంపులు కాదు, మూడు ఊర్ల నీరు త్రాగి, ఉప్పుగా వుందని చప్పరించేశారు.

ఇప్పుడు ఇద్దరూ మళ్ళీ చర్చిలో కూర్చునివున్నారు. బంధువులు,మిత్రులు పరివారాలు బారులుతీరి వున్నారు. ప్రమాదం కలగబోతూవుందని పడుచువాళ్లకే ఏమిటి పసివాళ్ళకే తెలిసిపోతూవుంది.

పసివాళ్లు బెలూన్లు ఎగరవేసుకుంటున్నారు.

సిలువ ఆకారంలో వున్న చర్చిచుట్టూ చతురస్రంగా వున్న కాంపౌండులో ఇసుక వేస్తే రాలితే రాలవచ్చు కాని జనం రద్దీగా వున్నారు.

లోపల ఫాదర్ ప్రసంగం ముగిసిపోలేదు. వీరావేశంతో శివం తొక్కుతూ పూనకం వచ్చినట్టు ప్రసంగిస్తున్నాడు. పెళ్ళిలేక, పిల్లలులేక, ఆస్తిపాస్తులు లేక బైబిల్‌ని నమ్ముకుని ఏం తిన్నాడో తినలేదో తెలియకుండా ఏమీ కొదువలేకుండా జీవించే నెమ్మది మనిషి ఫాదర్. కాని ఆయన బైబిల్ తాకాడా జ్వరం రాదుగాని, అంతపని అవుతుంది. ప్రసంగం మొదలు పెట్టాడా వెర్రెక్కిపోతాడు. కాదు అలా వుంటుంది.

ప్రతిరోజూ క్రైస్తవు లెవరయినా దేవుణ్ణి ప్రార్థించ వచ్చు. ఆదివారం తప్పనిసరిగా చర్చికి రావచ్చు. మామూలుగా సాధ్యంకాకపోయినా క్రిస్మస్‌రోజు అందరూ చర్చికి రావడం మామూలు. అందుకే చర్చి నిండా క్రైస్తవులు. కాంపౌండు నిండా క్రైస్తవులు. కాంపౌండులో వున్నవాళ్ళు క్రైస్తవ పరిభాషలో పండగ క్రైస్తవులు.

వీళ్ళు కాంపౌండ్‌లో లోకాభిరామాయణంలో ఎలెక్షన్ల సంగతి, గెలిచే పార్టీ సంగతి మాట్లాడుకొంటున్నారు.

చర్చిలో వున్న క్రైస్తవులకు రాజకీయాలు తెలియవు. తెలుసుకోరు. ఈ రాజ్యం ప్రజాస్వామ్యమా, పారతంత్ర్యమా అక్కరలేదు. దేవుడి రాజ్యం లభిస్తే చాలు!!! అందుకోసం ప్రార్థన, ప్రయత్నం, జీవితం.

చర్చిని తమ భుజస్కంధాల మీద పెట్టుకొని దాని బరువు మోస్తూ తమ జీవితం అంకితం చేసేవాళ్ళు. ఆ ప్రయత్నంలో శుభమయ జీవితం అనుభవించే వాళ్ళు చర్చిలోపలే వున్నారు.

మణి రత్నాల తల్లి దండ్రులు కటిక దారిద్ర్యం నుంచి జీవితం ప్రారంభించి క్రైస్తవ మతం స్వీకరించి, యేసు క్రీస్తు జీవితం ప్రచారం చేయడంలో జీవితం చాలించారు.

అయితే వాళ్ళ పిల్లలు బాగా చదువుకొన్నారు. మంచి ఉద్యోగాలు సంపాదించుకొన్నారు వీళ్ళిద్దరూ ప్రిన్సిపాల్స్ కావడం ఈ అభివృద్ధినే తెలుపుతుంది.

మిషన్ విద్యా సంస్థలు వదిలి దేశంలోని విద్యా సంస్థలో వాళ్ళు మొదట్లోనే చేరివుంటే ఈ పాటికి ఇంతకంటే మంచి ఉద్యోగాలు చేస్తూవుండే వాళ్ళు.

కాని వాళ్ళలా చేయలేదు. దైవ సేవలో జీవించి గతించిన తల్లి తండ్రుల కొడుకులు వీళ్లు. మిషన్ సేవే మాధవ సేవ.

వీళ్ళ తల్లి తండ్రులు వాళ్ళ కాలంలో ఆప్తులు, బంధువులు. మణి రత్నాలు తమ కాలంలో విరోధులు, పరాయివాళ్ళు.

ఇద్దరికీ పెళ్ళిళ్ళు అయ్యాయి. పిల్లలు కూడా కలిగారు. వాళ్ళు బాగా చదువుకొన్నారు ఉద్యోగాలు చేస్తున్నారు. మిషన్‌లోనూ, ప్రభుత్వంలోనూ. దాదాపు పిల్లలందరికీ పెళ్ళిళ్లు అయ్యాయి. వాళ్ళు సుఖంగా ఉన్నారు. మణి రత్నాలు ఉద్యోగాలనుంచి రిటైరు అయ్యే కాలం ఎంతో దూరంలో లేదు ఇద్దరూ సుఖంగానేవున్నారు, మిషనరీలు ఉండిపోయిన బంగాళాలలో ! !

మరి ? ఎవరికయినా కలిగే ప్రశ్నే ఇది. వాళ్ళకేసమాధానం లేకుండా పోయింది.

తెలుగుదేశంలో ఏ విశ్వవిద్యాలయంలోనూ లేనంత మంది "డాక్టర్లు" ఉన్న కాలేజీకి ఏ స్కూలుకి రానన్ని రాంకులు వచ్చే స్కూలుకు ప్రిన్సిపాల్‌గా హెడ్ మాష్టారుగా ఉన్న వాళ్ళిద్దరూ ప్రిన్సిపాల్స్ అయ్యేసరికి కాలేజీ మామూలు కాలేజీ అయిపోయింది. స్కూలు తుక్కు దూగర జూనియర్ కాలేజీ అయింది.

చర్చిలో చందా పడుతున్నారు. చర్చిలో క్రిస్మస్ పండుగ ఆయిపో వచ్చింది.

ఇక ఇళ్ళలో విందు. బంధువులతో గడపడం, దాన ధర్మాలు చేయడం. దూరం నుంచి వచ్చిన కొడుకులు, కూతుళ్ళు, మనుమలు, మనుమరాళ్ళతో అంతా కలిసి గడపడం, క్రిస్మస్ ఎంత మంచి రోజు!

చర్చి సెక్రటరీ రిపోర్టు చదువు తున్నాడు. కేరల్ పార్టీలో, చర్చిలో వసూలైన మొత్తం; ఆయిన ఖర్చు, చేసిన దానం, వగైరా వివరాలు; ఎవరికక్కా-వాలి? మణి రత్నాలు వింటున్నారు.

పిల్లలంతా క్రిస్మస్ చెట్టు చుట్టూ చేరారు. క్రిస్మస్ తాత వాళ్ళ కోసం అక్కడ చాక్‌లెట్లు పెట్టి వుంచాడు. తింటున్నారు. ఆ తాతే చర్చి వెలుపల కాంపౌండులోపల బిచ్చగాళ్ళు లేని కాళ్ళ, ఒళ్ళు ముందు బట్టలు పరిచి వుంచారు. దాన ధర్మాలకేం కొరవ! పైసలు! పావలాలు!! అర్ధలు! రూపాయలు!!

చర్చి కాంపౌండు వెలుపల విశాలమైన బయలు. అంతా దున్ని వుంచారు. ఏమో పంట పెట్టే ప్రయత్నంగా వుంది. ఎవరున్నారో, ఎవరు పంట పెడతారో ఎవరు తింటారో!

ఆ స్థలం ఎంత లేదన్నా పాతిక ఎకరాలుంటుంది. అదెక్కడో అడవుల్లో వున్న స్థలమూ కాదు. ఊసర క్షేత్రమూ కాదు. వందేళ్ళ పూర్వం ఎక్కడెక్క-ణ్ణుంచో గరిక తెచ్చి వేసి పెంచి చక్కగా చేసిన బయలు అది. ఒక పక్కగా మూడు కాలేజీ హాస్టళ్ళు. మరొక పక్కగా లెక్చరర్లుండే ఇళ్ళు ఈ మూలకుంది చర్చి. అదంతా బయలు.

శతాబ్దం పూర్వం ఇది ఊరికి దూరంగా ఉన్న చోటు. ఇప్పుడు ఊరికి నడిబొడ్డు. మనిషి వున్న చోటే మిత్రుడైనా శత్రువైనా వుంటాడని నమ్మవచ్చు. క్రైస్తవులు అయిన వాళ్ళు కానివాళ్ళు ఈ చుట్టూ ఇళ్ళు కట్టుకోవటం వల్లే ఈ ప్రదేశం పట్టణం గుండె అయింది.

క్రైస్తవ మతం ప్రచారం చేస్తున్న రోజుల్లో తెల్లవాళ్ళు ఊరికి దూరంగానే వున్నారు. అందుకే ఊరికి దూరంగా వున్నవాళ్ళు క్రైస్తవులయ్యారు.

విద్యకోసం, వైద్యం కోసం, ఉద్యోగాల కోసం హిందువులు కొందరు క్రైస్తవులయ్యారని మామూలుగా అనిపిస్తుంది. కాని నిజానికి కారణం సమానత్వం మీద ఆశ! ప్రేమ! భక్తి!

ఎందుకో మనిషి ఏమిలేని రోజుల్లో కష్టాల్లో, బాధల్లో ఇతరులతో కలిసి వుంటాడు. అన్నీ వున్న రోజుల్లో సుఖాల్లో సంతోషాలలో విడిపోతాడు. ఇది మానవ నైజం! క్రైస్తవుడూ మనిషే! అందుకే క్రైస్తవుడూ తనలో తాను నేడు విడిపోతున్నాడు. వేరవుతున్నాడు.

చర్చిలో ఎంత మౌనం! వెలుపలకి రాబోయే ముందు చేసుకొనే ప్రార్థన!

నిరంతరం శ్రమించే మనిషికి చర్చి విశ్రాంతి

ఎప్పుడూ శబ్దించే మానవ యంత్రానికి చర్చి విరామం.

నిశ్శబ్దత నుంచి మానసిక ప్రశాంతిని పొందటానికి చర్చి క్రైస్తవులకు దేవుడిచ్చిన వరం.

మైక్ శబ్దంతో కాంపౌండు జనం గోలలతో, ఫాదర్ ప్రసంగంతో ప్రతిధ్వనించిన ప్రదేశం ప్రశాంతంగా వుంది.

ఈ ప్రశాంతి పశువుల పాకలోంచి, బెత్లహేంలోంచి ఆసియా అంతటా, ప్రపంచమంతటా ప్రవహించి వున్న కాలం ఇది.

తల వంచుకోవటం తెలియని మణి రత్నాలు, తలలు వంచుకొన్నారు. మౌనంగా ఉండలేని వాళ్ళు మౌనంగావున్నారు. ఒక్క చోట ఉండకూడని వాళ్ళు ఒకే చర్చిలో ఉన్నారు. ఇదేం ప్రమాదమో! క్రిస్మస్ జరిగి పోతూవుంది.

ఈ ప్రదేశం అంతా భారత దేశంలో భాగమే! తెల్లవాళ్ళు పరిపాలించిన రోజుల్లో క్రైస్తవ మిషనరీల కోసం ఈ భూభాగం దత్తం అయింది. ఆ రోజుల్లో దీనికేం పెద్ద విలువలేదు

ఇప్పుడు సెంటు నేల అయిదువేలు ఇస్తామన్న అమ్మేవాళ్ళు ఈ ప్రాంతంలో దొరకరు. అలాంటిది పాతిక ఎకరాల నిక్షేపం లాంటిది స్థలం. ఇది ఏ వ్యక్తి సొంతమూ కాదు; మతం ఆస్తి; ఇంత ఆస్తి వుండీ, ఎవరికీ ఉపయోగ పడదు. లంకెల బిందెల్ని రాక్షసులు, నాగుబాములు, దెయ్యాలు కాపాడినట్లు ఈ ఆస్తిని మతం కాపాడుతూ వుంది. అది తినా తినదు, ఇతరుల్ని తినానివ్వదు.

తెల్ల దొరలు వెళ్ళిపోతూ వదిలిపెట్టిన బంగళాలలో అప్పుడు మత ప్రచారకులుగా ఉన్నవాళ్ళు చేరుకున్నారు, సొంతం చేసుకున్నారు. వంశ పారంపర్యంగా అనుభవిస్తున్నారు.

ఆ తల్లిదండ్రుల వారసులుగా మణి రత్నాలు ఈ బంగాళాలలో స్వగృహా లలో లాగా నివసిస్తున్నారు, పోనీ జీవిస్తున్నారు.

అంతటితో సంతోషిస్తే ఆపదలే లేవు. బంగళా చుట్టున్న స్థలమంతా నాదంటే నాదంటూ రెండు బంగళాల వాళ్ళు పోటీ పడి చర్చి, క్వార్టర్స్, హాస్టల్స్, నావంటే నావంటూ మణి రత్నాల రూపంలో కోర్టుల చుట్టూ తిరిగారు. మొత్తం మీద చర్చి ఆస్తిఅంతా నాది నాది అని కొట్లాడుకున్నారు. తిట్లాట, పోట్లాటగా, అది మర్దర్లాటగా మారి పోయింది.

శిక్షలు పడ్డవాళ్ళు లేరు. జైల పాలైన వాళ్ళులేరు,చనిపోయిన వాళ్ళులేరు. కాని చర్చిఆస్తికి మణి రత్నాలు సమానంగా వారసులుగా కిందా మీదా పడ్డాక అక్కడొకతీర్పు ఇక్కడొక తీర్పు ముగిశాక, అటింతా ఇటింతా ఖర్చు అయ్యాక తీర్మానం అయింది తీర్పు వచ్చింది.

హైకోర్టుతీర్పు అసలేం బాగాలేదని సుప్రీం కోర్టుకు మణిరత్నాలు మర్యాదగా కేసుదాఖలా చేశారు. అదెప్పుడు మొదలవుతుందో, ఎప్పుడు తీర్పు వస్తుందో మణిరత్నాల కాలంలోనే తీర్పు వింటారో వీళ్ళ పిల్లలు వినవలసివస్తుందో వేచి చూడవలసిందే!! మిగతా కథ వెండి తెరమీద చూడవలసిందే!

చర్చిలో నుంచి ప్రార్థన ముగించుకొన్న జనం బైటికి వస్తున్నారు. కబుర్లు బంధుత్వాలు, పలకరింపులు, అభినందనలు, షేక్ హేండులూ, కలకలం, రద్దీ!

చర్చిఅంతా ఖాళీఅయింది. అందరూ వెళ్ళిపోయారు. కానీ ఫాదర్ పోలేదు. ఎందుకు పోలేదంటే మణి రత్నాలు పోలేదు కాబట్టి.

బైటికి పోయిన వాళ్లు లోపలున్న మణిరత్నాలను చూస్తున్నారు.

వాళ్ళ బంధువుల మిత్రుల మాటకేంగాని పరివారం మాత్రం పరాకుగా లేదు.

ఫాదర్ వచ్చి ఇద్దరినీ అభినందించి మరీ వెళ్ళాడు.

వెలుపల ఉన్న వాళ్ళు మణిరత్నాలు గోదాలో వస్తాదులు రాగా కుస్తీ పడతారని పందెం కాసుకొంటున్నారు.

వాళ్ళలో ఎవరు చేయిఎత్తినా పరివారం తలపడుతుందని నమ్ముతున్నారు! వాళ్ళలో ఎవరు ఎవరి వాళ్ళో పోల్చు కుంటున్నారు.

కూడబలుక్కున్న వాళ్ళ మాదిరిగా ఇద్దరూ ఒకేసారి కుర్చీలలోనుంచి లేచి నిలబడ్డారు.

వెలుపల నుంచి తొంగి చూచే వాళ్ళ కళ్ళలో ఆత్రం!

మణి రత్నాలు ఒకరివైపు ఒకరు ఒక్కొక్క అడుగు వేస్తుంటే బైట నిలబడ్డ జనం తలుపుల దగ్గర, కిటికీల దగ్గర ఒకరు మీద ఒకరు ఎక్కి నిక్కినిక్కి చూస్తున్నారు.

చర్చి సెంటరులో ఇద్దరూ నిలువుగా, నిటారుగా, నిలువెత్తున నిశ్శబ్దంగా, నిశ్చలంగా నిలబడి వున్నారు.

ఇద్దరూ ఒకేసారి కుడి చేతులెత్తారు.

చేతితో కొట్టవచ్చు. నెట్టవచ్చు. గొంతు పిసకవచ్చు.

కానీ ఇద్దరి చేతులూ కలిశాయి; కరచాలనం షేక్ హేండ్స్.

క్రీస్తు రెండవ రాకడను, క్రైస్తవ భక్తులు వాళ్ళిద్దరినీ చూచి, భావించు కొంటున్నారు.

రెండు చేతులూ ఊగుతున్నాయి, ముఖ్యంగా నవ్వుతున్నాయి.

'విష్ యు హేపీ క్రిస్మస్' ఇద్దరూ ఒకేసారి అన్నారు.

జనం విన్నారు.

అందరూ అనుకొన్నారు.

'విష్ యు హేపీ క్రిస్మస్'

బంధువులు మిత్రులు మామూలే కాని పరివారం కూడా ఎదుటి పరివారంతో ఎదురుగా నిలబడి చేతులు కలుపుతున్నారు.

కాంపౌండు నిండా జనం, భయం లేని జనం, సందేహం లేని జనం.

కాంపౌండు అంతా షేక్ హేండ్స్.

ఏ మూల విన్నా, స్త్రీలు, పురుషులు, పిల్లలు అంతా ఒకటే మాట.

'విష్ యు హేపీ క్రిస్మస్'

చర్చి గంటలు నిర్విరామంగా మోగుతున్నాయి.

# ఏది సూర్యోదయం ?

రూప తూలుతూ నడుస్తూ ఉంది. ఆమె రెండు భుజాలూ ఇద్దరు పని మను షులు పట్టుకున్నారు.

రూప వాళ్ళ మీద పడి నడుస్తూ ఉంది. వాళ్ళు నడిపించుకుపోతున్నారు.

కాళ్ళు నేలమీద ఆనటం లేదు. జారి పోతున్నాయి.

వాళ్ళు నడిపించటం లేదు. ఎత్తుకు పోతున్నారంటే తప్పు. లాక్కుపోతు న్నారంటే పొరపాటు. రూప ప్రమేయం లేకుండా, రూప నడచి పోతూ ఉంది.

ముందు వాద్య సంగీతం. హోరెత్తే సంగీతం.

రూప అందగత్తె. ఆ అందం శరీరమంతా ఉంది. రంగులోనూ ఉంది. పొందికలోనూ ఉంది.

మళ్ళీ మాట్లాడితే అందం వయసులోనూ ఉంది. ఇరవై ఏళ్లలోపు వయస్సు.

ఆమె అందం చదువువల్లా వచ్చింది. పది పాసయింది.

ఆమె అందం తెలివి మూలంగా కూడా వచ్చి ఉండవచ్చు.

అందమైన రూప వళ్ళు మరచి నడుస్తూ వుంది. తల మీద బట్ట వేసినా ఉండటంలేదు. ఒంటిమీద బట్ట నిలవటం లేదు. కట్టు బట్టలు కాళ్ళకూ, చేతులకూ అడ్డం అవుతూ ఉన్నాయి.

పెళ్ళి అయితే కొందరి అందం ఇనుమడిస్తుంది. పెళ్ళి కళ అంటారు. దాంపత్య సౌందర్యం అనీ అంటారు.

రూపకు పెళ్ళి అయింది. కానీ ఆటువంటి అందం ఏమీ రాలేదు. లేదు.

చంద్రుళ్ళో మచ్చలాగా రూపలో మచ్చ ఉంది. అది పేదరికం.

పేదరికం చదువుకు అడ్డం వచ్చింది. పదో తరగతి బాగా పాసయినా చదువు సాగలేదు. ఆగి పోయింది.

తండ్రి రైతు, తల్లి కూలీ. ఆస్తిపాస్తులు లేవు. ఏ పూటకా పూట సంపాదించుకొంటే తిండి. లేకపోతే పస్తు.

రూప గుణం మంచిది. నడవడిక మంచిది. నలుగుర్లో మంచి పేరుంది. ఆ మంచితనం పరిమళం లాగా చుట్టూ వ్యాపించింది.

ఆవాసన పీల్చిన వాళ్ళు ముక్కులు తడుం కోవటమే కాదు, చెవులు కొరుక్కున్నారు.

సంబంధాలు రాసాగాయి. రూపకు పెళ్ళి చేసి చేతులు కడుక్కోవాలని తల్లిదండ్రులూ సిద్ధమయ్యారు.

ఒక్కగానొక్క కూతురు. లేక లేక కలిగిన సంతానం. పెళ్ళి చేసి అత్త గారింటికి పంపటం కష్టంగానే ఉంది. కానీ తప్పదు కదా !

వచ్చిన సంబంధాల్లో ఒకటి కళ్ళు తిరిగిపోయే సంబంధం.

కుటుంబమంతా చుట్టూ నాలుగామడ పేరు మోసిన కుటుంబం.

వంశం రాజరికపు వంశం. ఆ వంశం వాళ్ళు పౌరుషానికి పెట్టింది పేరు.

పెళ్ళి కొడుకు పాతికేళ్ళ వాడు. అందగాడు. స్త్రీల సౌకుమార్యం వళ్ళంతా చోటు చేసుకొన్న అందగాడు.

రూప అందరికీ నచ్చింది. తమ ఇంటి కోడలుగా రూపవస్తే అదే పదివేలు అనుకొన్నారు అత్తా మామలు. మీ యిష్టమే నా యిష్టం అన్నాడు పెళ్ళికొడుకు.

రూప తల్లి దండ్రులకు కూడా నచ్చిన సంగతి, కట్నం ప్రసక్తి లేదు, కానుకల మాట లేదు.

ఆస్తి అంతా అబ్బాయిదే! పంచుకొనే వాళ్ళు లేరు.

ఇంత ఆస్తి ఉండగా ఇంకెందుకీ కట్నం కానుకలు?

రూప అందమే కట్నం !

పెళ్ళి బాజాలు మోగాయి. వేదిక అంతా సందడిగా అయింది.

రూప తూలుతూ నడుస్తూ ఉంది. పనివాళ్ళ చేతుల మీద ముందుకు నడుస్తూ ఉంది.

ముందు బాజాలు మోగుతున్నాయి.

వాటి వెనుక జనం మందలు మందలుగా మౌనంగా నడుస్తూ ఉన్నారు.

ఊళ్ళో నుంచి బయల్దేరిన జనం ఊరి వెలుపలికి వచ్చారు. పొలిమేరకు అభిముఖంగా నడుస్తూ ఉన్నారు.

ఆర్నెల్ల క్రితం ఈ పొలిమేర దాటే ఈ ఊళ్ళోకి రూప వచ్చింది.

ఆ రోజు ఆమెను పల్లకీలో బోయీలు మోసుకొని వచ్చారు.

కొత్త బట్టలు. పసుపు బట్టలు. పెళ్ళి బట్టలు. ఎంతో అలంకారం.

ముందూ వెనుకా జనం నడుస్తూ ఉండగా రూప పల్లకీలో మహారాణిలా కూర్చుంది. రాచ కుటుంబంలో కాలు మోపటానికి పెళ్ళి కూతురై వచ్చింది.

ఊరి మొగదలే విడిది ఏర్పాటు.

ఆ రోజు పెళ్లి పందిట్లో ఎంతమంది జనం! ఎన్ని ఊళ్ళ వాళ్ళు!

ధనవంతుల ఇళ్ళ పెళ్ళికి ఇంత మంది జనం వస్తారు.

ఇందరు బంధువులున్నారు.

ఇంత తీరుబడిగా వచ్చారు. ఇన్ని కానుకలిచ్చారు.

రూప కళ్ళు తిరిగి పోయాయి. ఎంత అట్టహాసం! ఎంత ఉత్సాహం! ఎంత వేడుక!

విడిది ఏర్పాట్లు, భోజనం ఏర్పాట్లు, ఊరు ఊరంతా పెళ్లిపందిరిలా అయి పోయింది.

అంత జనాన్ని, అంత ఆనందాన్ని, తనివి తీరా చూచింది రూప. అదృష్టం అంతా తనదేనని పొంగి పోయింది ఆ రోజు. అదెంతోకాలం నిలవలేదు.

ఇప్పుడు ఇంతమంది జనాన్ని చూడటంలేదు. కళ్ళున్నాయి, కనిపించటం లేదు. తూలిపోతున్నాయి.

ఇంతమంది జనం ఆనందంతో ఉన్నారో దుఃఖంతో ఉన్నారో ఉదయం దాకా రూపకు తెలుసు. ఇప్పుడు తెలియదు.

ఇంతమంది జనం మౌనంగా నడుస్తున్న సంగతి తెలివికి మబ్బులు కమ్మిన రూపకు తెలియదు. వీళ్ళు ఇటునడిచి ఎక్కడికి పోతారో తెలియదు.

రూప రెక్కపట్టి నడిపిస్తున్న ఇద్దరు పనివాళ్ళతో కలిపి మొత్తం ముగ్గు రాడవాళ్ళు తప్ప మిగతా అందరూ మగవాళ్ళే!

రూప కళ్ళు తేలిపోతున్నాయి. ఈ పనివాళ్ళు ఇద్దరూ ఇచ్చిన రెండు గ్లాసుల షరబత్ తాగిన దగ్గర్నుంచి రూప ఇలా అయిపోయింది.

వాళ్ళిద్దరూ రూపకు ప్రాణబంధువులు. అత్తవారింటికి వచ్చిన నాటినుంచి వాళ్ళ ఆత్మీయత ఆమెకు అండఅయింది.

వాళ్ళు లేకపోతే ఆమె నరకం అనుభవించేదాన్ని అనుకొంటుంది.

వాళ్ళు అత్తామామల పనివాళ్ళు అనీ, తనకు అండగా ఉన్నారనీ, రూపకు తెలియకపోలేదు.

తనకు వాళ్ళు తోడుండటం అత్తామామల మాటప్రకారమేనని రూపకు తెలుసు.

అయినా వాళ్ళు ఆత్మీయంగా ఉన్నారు. వాళ్ళమాట నమ్మింది. చేత నమ్మింది. ఇచ్చింది తాగింది.

తాగినప్పటినుంచి తలతిరిగిపోయింది. వళ్ళు తూలిపోయింది. కాళ్ళు తేలి పోయాయి.

మనిషి మనిషికాకుండా నడిచిపోతూఉంది.

పెళ్ళయిన తరువాత శోభనం ఏర్పాటు జరగలేదు.

ఎందుకనో రూపకు తెలియదు. కానీ అత్తవారింటిలోనే ఉంది.

బంధువులు వస్తున్నారు. పోతున్నారు పరాచికాలు, ప్రశంసలు, బహు మతులు, సరేసరి. అంతా బాగానేఉంది.

అతనే బాగాలేడు. కంటికి కనబడడు. చేతికి దొరకడు.

ఏఊరూ వెళ్ళలేదు. ఇంట్లోనే ఉన్నాడు. తుష్టిగా భోంచేస్తున్నాడు.

పలుకరించడు. భావించాడు. ఎదురుకాడు. గదికిరాడు. తప్పించుకొని తిరుగుతున్నాడు.

అమ్మా నాన్న వచ్చినప్పుడు రూప ఆమాటే అంది. అది ఆధారంగా వాళ్ళు ఆచూకీ తీశారు.

పిల్లవాడి వంట్లో బాగాలేదు.

అదే రూపతో చెప్పారు. అవును కాబోలు అనుకొంది రూప.

మనిషి మామూలుగా తిరుగుతున్నాడు. అందరిలా నడుస్తున్నాడు. నవ్వుతున్నాడు.

'సిగ్గు' అనుకొంది రూప. సిగ్గుపడింది.

మనిషిలో మార్పులేదు.

రూప వయ్యారంగా ఎదురయింది.

మనిషిలో మార్పులేదు.

సుతారంగా నవ్వింది.

మార్పులేదు.

అనుకోకుండా తగిలింది.

మార్పులేదు.

అర్ధరాత్రి చేయి పట్టుకొంది. బొమ్మలాగా నిలబడ్డాడు.

రూపకేమీ అర్థం కాలేదు.

పనివాళ్ళతో మాట్లాడింది. అవును కాబోలు అన్నారు.

నా గొంతు కోశారు అంది. ఏడ్చింది. అన్నం మానింది. నిద్రరాలేదు.

లంకంత ఇంటిలో ఒంటరిది అయిపోయింది. ఉండలేకపోయింది.

పుట్టింటికి బయలుదేరి వెళ్ళింది.

పసుపుతూ నడుస్తూ ఉన్న రూప ముందు జనం మధ్య పల్లకీ ఉన్నట్లుగా ఉంది.

పల్లకీ కాదు. పాడె!

నలుగురు మోస్తున్నారు. పల్లకీకి చేసినంత అలంకారం చేశారు పాడెకు కూడా.

వాద్య సంగీతం హోరెత్తిపోతూవుంది. పెళ్ళికున్నంత హడావుడిగా ఉంది.

తేడా అంతా ఒకటే !

ఆ రోజు పల్లకీలో వచ్చింది.

ఈ రోజు కాలినడకనపోతూ ఉంది.

ఆ రోజు ముందు పాడెలేదు. ఈ రోజు ఉంది.

ఏం జరుగుతూ ఉందో రూపకు తెలిసే స్థితిలేదు.

ఆ రోజు ఇంటికి వచ్చిన రూపను తల్లిదండ్రులు ప్రశ్నలతో హింసించారు.

'అత్తా మామలకు చెప్పివచ్చావా ?'

'లేదు.'

'భర్తకు చెప్పావా ?'

'లేదు.'

'పారిపోయి వచ్చావా ?'

పలకలేదు.

తల్లి దండ్రులు ఓర్పు వహించారు.

రూప అత్త మామలు కఠినులుకారు దయామయులు.

కట్నం అడగలేదు. బాధించరు.

కట్నం తేలేదని, తెమ్మని కాల్చి చంపరు. రాచిరంపాన పెట్టరు.

భర్త సుకుమారుడు. భార్యతో మాట్లాడటానికి కూడా సిగ్గుపడి, పయ్యారంగా వంకర్లు తిరిగిపోతాడు.

చాలా మంచివాడు. కొంచెం పిచ్చివాడు. బాగా అమాయకుడు.

కూతురెందుకు పారిపోయి వచ్చిందో తల్లి దండ్రులకు అర్థం కాలేదు.

గుచ్చి గుచ్చి అడిగితే రూప తల్లితో చెప్పిది. 'ఆడంగి రేకులోడు.'

తల్లి అదిరిపోయింది. తండ్రి బిత్తర పోయాడు.

ఏం చేయాలో దిక్కు తెలియలేదు. మౌనంగా ఉన్నారు.

వాళ్ళ భర్తే దైవం అనలేదు. చావో బ్రతుకో భర్తతోనే అనలేదు మెదలకుండా ఊరుకొన్నారు.

అత్తా మామలు ఊరుకోలేదు. కోడల్ని పంపమని కబురు చేశారు.

జవాబు లేదు.

'మేమే వచ్చి వెంట బెట్టుకు వస్తాం అన్నారు. రాలేదు.'

'అందువల్ల పోలేదు.'

శోభనం ఏర్పాటు చేస్తున్నామని కొంత కాలానికి కబురు పెట్టారు.

'అబద్ధం' అంది రూప.

అబద్ధ మనుకొంది రూప. 'అయినా వెళ్ళి చూడకూడదా' అన్నారు తల్లి దండ్రులు.

'నేను పోను' అంది రూప.

'రూప రాదు' తల్లిదండ్రులు కబురు చేశారు.

వారం తర్వాత ఆత్మీయంగా ఉండే పనివాళ్ళిద్దరూ వచ్చారు. చావు కబురు చల్లగా చెప్పారు.

'నీ భర్త చనిపోయాడు' రూప వాళ్ళ మాటలు వింది. చలనం లేదు.

అమ్మా నాన్నా బాధ పడ్డారు. అల్లుడు చనిపోయినందుకు కాదు. కూతురు ముండ మోసినందుకు.

తల్లి దండ్రీ రాలేమన్నారు. పీడ విరగడవుతూ ఉంది కాబట్టి పోయి గాజుపూసా ఇచ్చి రమ్మన్నారు.

పనివాళ్ళు రమ్మన్నారు.

రూప ఏడవలేదు. నిర్లిప్తంగా 'సరే' అంది. 'పదండి' అంది.

ఈ ఉదయమే పనివాళ్ళతో అత్తవారింట్లో అడుగు పెట్టింది రూప.

భర్త శవం చూచి, స్థాణువులా నిలబడిపోయింది.

ఏడవలేదు. గుండెలు బాదుకోలేదు. తల వంచుకొని కూర్చుంది. ఏమీ తినలేదు. పనివాళ్ళిచ్చిన షర్బత్ తాగింది. అప్పట్నుంచి తూలిపోతూ ఉంది.

కొంచెం సేపు ఇంట్లో జరుగుతున్న తతంగం తెలుస్తూ వచ్చింది. పాడె కట్టటం గమనించింది.

'రూపకెంత పతిభక్తి' అని తూలిపోతున్న తనను చూచి అమ్మలక్కలు అనుకోవటం వింది.

వెర్రిగా నవ్వుకొంది.

పనివాళ్ళ చేతులు మీదపడి నడుస్తున్న రూపకు పాడెమీద ఉన్న భర్త శవం కనబడటం లేదు. పూలు ఎవరికయినా కనబడతాయి. పరిమళం ఎవరికయినా తెలుస్తుంది. సంగీతం వినబడుతుంది.

రూప పంచేంద్రియాలు పనిచేయటం మానేశాయి.

ఊరేగింపు వల్లకాట్లో ఆగింది. శవ సంస్కారానికి కట్టెల వేదిక విశాలంగా అమర్చి ఉంది.

శవాన్ని పడుకోబెట్టారు. పూలమాలలు వేశారు. పూలు జల్లారు.

అందరూ వెనక్కు చూశారు. పనివాళ్ళు నడిపిస్తుంటే నడచి వస్తున్న రూప పడిపోతూ ఉండటం చూచి జనం పరవశించి పోయారు.

పనివాళ్ళు శవం దగ్గరకు వచ్చారు. చేతుల్లో పూలమాలలాగ రూప ఉంది.

శవానికి దండవేసినట్లు పక్కనే పడుకోబెట్టారు.

శవం పక్క శవం లాగా చలనం లేకుండా పడుకొన్న రూప చేయి తీసి భర్త శవం మీద పెట్టారు పనివాళ్ళు.

జనం చప్పట్లు కొట్టారు.

బరువైన కట్టెలు తెచ్చి వాళ్ళ మీద ఉంచారు. ఇనుపతీగెలతో పై కట్టెలు కింది కట్టెలు కలిపిచుట్టారు. టిన్నుల్లోని కిరోసిన్ కట్టెల మీద పోశారు.

రూపకు స్పృహ లేదు.

ఆకాశంలో సూర్యుడు మండిపోతున్నాడు.

అగ్గిపెట్టె సూర్యుడి వారసుడు.

కాగడా పగటిపూట సూర్యుడి స్నేహితుడు.

నిప్పుల కుంపటి నివురు కప్పుకోలేదు.

గాలికి ప్రాణం వుంది.

శవానికి లేదు.

రూపకు ప్రాణం ఉంది. చైతన్యం లేదు.

సీత రాముడి సతీ తిలకం. అగ్నికి ఆమె ఆరోగ్యం తెలుసు.

భూమికి ఓర్పు ఉంది.

రూప సీత కాదు. అగ్ని అగ్గిపెట్టె కాదు. ఆనాడు కిరోసిన్ లేదు. ఈనాడు ఉంది.

ఏనాటికీ, ఈ దేశంలో స్త్రీ స్థితి ఇలాగే ఉంటుందా? ఇలాగే ఉండాలా?

ఇదా మునుల దేశం ?

ఇదా మనుషుల దేశం ?

ఇది ఏ కాలం ?

ఇది ఏ దేశం ?

కుంపటి వెలిగింది. మంట లేచింది. కాగడా అంటుకొంది.

కొరివి మండింది.

జనం చప్పట్లు కొట్టారు.

వాద్య సంగీతం మిన్నుముట్టింది. సూర్యుడు తలవంచుకొన్నాడు.

చితి మండింది.

కట్టెల పెళ పెళ వినబడింది.

పొగ ఆకాశానికి లేచింది.

చితి కదలలేదు. ఇనుపతీగెలు బిగిశాయి.

రూప అరుపులాగా, వాద్య సంగీతం లాగా కట్టెలు పగిలాయి. పేలాయి.

వాద్య సంగీతం ఆకాశం తాకింది.

చితి మంటలు చెట్టంత ఎత్తు లేచాయి.

పొగలు ఆకాశంలోకి చొచ్చుకు పోయాయి.

సూర్యుడు పొగ క్రమ్మి మసకబారిపోయాడు.

జనం చప్పట్లు కొట్టారు.

వాములు కాలినట్లు చితి కుమిలి కుమిలి కాలింది.

కదలిక లేదు.

నిశ్శబ్దం.

బూడిద రాశి !

జనం నమస్కరించి వెనుదిగిగారు.

నాకేం సంబంధం లేదని సూర్యుడు అస్తమించాడు.

ఏడీ సూర్యుడు ?

ఎప్పుడు ఉదయిస్తాడు ?

# గాలిలో దీపం

చెంపులు దగ్గరకు లాగి గొళ్ళెం పెట్టి, తాళం వేసి, ఎండ ముఖం చూస్తూ నడిచిపోయాడు స్కూల్ మాష్టారు. రెక్కలొచ్చిన పక్షుల్లాగా బడి పిల్లలు ఎగురుతూ, దూకుతూ, పరుగెత్తుతూ, వెళుతున్నారు. నడవటం లేదు.

సీతమ్మ పిల్లలందరిని అడిగింది. కిట్టిగాడు 'కనిపించాడా?' 'ఊ' అనలేదు. 'ఆ' అనలేదు గానీ వాళ్ళు ఎగిరిందే ఎగరటం, వెళ్ళిందే వెళ్ళటం. మూణ్ణెల్లు వేసవి సెలవులు. కిట్టిగాడు సీతమ్మకు లవుడు, కుశుడూను. మళ్ళీ స్కూల్ తెరవగానే ఒకటో తరగతిలో ఈ బళ్ళోనే చేర్చాలనుకొంటూవుంది సీతమ్మ.

కిట్టిగాడు గడుగ్గాయి. ఉన్న చోట ఉండడు. చెప్పింది వినడు, చేయమన్నది చేయడు, వద్దన్నది ముందుగా చేస్తాడు. అక్కడా ఇక్కడా పడతాడు. ముక్కూ మూతి బద్దలు కొట్టుకొంటాడు. నోరూ చేయి ఊరుకుండవు. ఆకతాయి. అంతా కలిపితే నాలుగేళ్ళు.

ఒకసారి తేపతేపకూ పొయ్యి దగ్గరకు వస్తుంటే అడ్డమయి, భయమయి రావద్దని సీతమ్మ చెప్పింది.

కిట్టిగాడు లెక్కపెట్టలేదు.

అక్కడికి వస్తే కాళ్ళిరగ్గొడతాను. ఇక్కడే కూర్చోమని నట్టింట్లో కుదేసి వంట గదిలోకి వెళ్ళింది.

పదినిముషాల్లో అక్కడ లేదు.

ఇంటి ముందుకు వచ్చిచూస్తే చెట్టుక్రింద కూర్చొన్నాడు.

'ఏరా! ఇక్కడ తగలబడ్డావ'ని అంటే కదల్లేదు.

'లే' అని చెవిపట్టుకొంటే, నవ్వాడు. ఏడుపు ముఖం.

చెవి మెలిపెడితే 'ఇహిహీ'అని నవ్వటమేకాని ఏడవటం లేదు. పిచ్చినవ్వు.

ఇంతసేపు కదలకుండా కూర్చున్నాడేమా అనిచూస్తే కాలువిరిగివుంది.

సీతమ్మ గుండె చెరువయింది.

ఆ రోజు నుండి సీతమ్మకు చీరాకు కలిగినా కిట్టిగాణ్ణి శాపనార్థాలు పెట్టటం మానుకొంది.

పొద్దున పొంతలో వేన్నీళ్ళు, చన్నీళ్ళతో తొరుపుతుంటే కిట్టిగాడు వచ్చి ఏదోఅడిగాడు. అప్పటికే విసిగి పోయివున్న సీతమ్మ కోపంతో 'ఎక్కడోచావుపో' అంది.

అన్న తర్వాత గుండెకు చలిజ్వరం వచ్చి కిట్టిగాడికోసం చూసింది.

వీడు దణ్ణెం పట్టుకొని ఉయ్యాల ఊగుతున్నాడు.

సీతమ్మ ఊపిరి పీల్చుకొంది, ఊరట పడింది.

అయిదు నిముషాల్లో అయిపు లేడు. గుండె అల్లాడింది. ఆరాటం పెరిగింది.

పొద్దట్నుంచి పొద్దునెత్తిమీదకు వచ్చిందాకా వెతుకుతూవుంది. వూరంతా తిరుగుతూనే వుంది. ఎదురయిన వాళ్ళను అడుగుతూనే వుంది. కళ్ళనీళ్ళు పైట చెంగుతో తుడుచు కొంటూనే వుంది సీతమ్మ.

కొడుకు కనబళ్ళేదు. కిట్టిగాడు కనబళ్ళేదు. బంగారుకొండ కనబళ్ళేదు.

ఒకసారి కోళ్ళగూడులో పగలంతా పడుకొన్నాడు,

వెదికింది లేడు.

చెరువుగట్టు మీద నిద్రపోయాడోసారి.

చూసింది. లేడు.

వాముల దొడ్లో నిద్రపోయాడు మరోసారి.

వెళ్ళింది. లేడు.

వెదికి, వెదికి మనిషి పిచ్చిపట్టినట్లు అయిపోయింది, సీతమ్మ. ముద్దుగా, బొద్దుగా, ఆరోగ్యంగా ఉండే కిట్టిగాడు నాలుగేళ్ళకే ఆరేళ్లవాడిలా కనిపిస్తాడు. అనిపిస్తాడు, అంటారు.

విరామం లేకుండా తిరుగుతాడు. నిద్రవస్తే అరసెకండులో నిద్రపోతాడు. లేపినా లేవడు. కదిపినా కదలడు. మొద్దు నిద్ర. ప్రక్కన పిడుగుపడనీ, కిట్టిగాడి నిద్ర చెడదు.

నేల మీద, దుమ్ములో, ఎండలో, చలిలో, పడక లేకుండా, నిద్రపోయే ముద్దు.

ఇలా పట్టున వుండకుండే అగమ్మకాకి లాగా తిరుగుతుంటే కోపం వచ్చి లోపల పెట్టి తలుపు గొళ్ళెం వేసి సీతమ్మ బయట నుంచి చూసింది ఒక రోజు

నిద్రపోయాడు.

సాయంకాలానికి మెలకువ వచ్చి లేచాడు. అటూఇటూ తిరిగాడు. 'అమ్మా' అని అరచాడు.

తలుపుదగ్గరకు వచ్చాడు, లాగాడు, రాలేదు. కిటికీ దగ్గరకు పోయాడు, గుంజాడు, కదల్లేదు.

వెలుతురు సెనపడుతున్న చోటల్లా మిణుగురు పురుగులాగా తిరిగాడు.

బయటకు రాలేక బావురుమని ఏడ్చాడు.

చూస్తున్న తల్లి గుండె తల్లడిల్లింది. తలుపు తీసింది.

'అమ్మా!' అని కాళ్ళకు చుట్టుకుని వేలబడిపోయాడు.

ప్రొద్దుపొడిచి వచ్చి గంగయినా ముట్టుకోకుండా వుంది. సీతమ్మ తలుపు ఆనుకుని అలాగే కూర్చుండిపోయింది.

రోజులూ, వారాలూ గడిచాయి.

కొడుకు జాడలేదు.

అంత్రాలు, తంత్రాలు కట్టించి. చేయించింది. లాభంలేదు. సోదె చెప్పించింది. దేవుళ్ళకు మొక్కుకుంది. లాభంలేదు.

కళ్ళు కనుగుంటల్లోకి పీక్కుపోయి, మనిషి ఎండిపోయింది.

వేసవి సెలవలు అయిపోయాయి.

ఆ రోజే బడిపిల్లలు మళ్ళీ స్కూళ్ళకుపోవటం చూసింది.

'ఏడీవాళ స్కూలుకు పోయివుండవలసింది' అని గొణుక్కుంది.

ఎక్కడున్నాడో కొడుకు.

వేసవి సెలవులకు స్కూలు మూసే రోజున కిట్టిగాడు ఊరంతా తిరగాడు.

ఎద్దు పొడవబోతే పారిపోయి చెట్టుకు కొట్టుకొన్నాడు.

తలకు బొప్పికట్టింది. లారీకింద పడబోయి పరుగెత్తుకుపోయాడు. తిట్లు తిన్నాడు. అలసిపోయాడు.

విశాలమయిన పాత తోటలో పాడుబడ్డ మేడ బాగు చేయించి బడి చేస్తే, అందులోకి బడిపిల్లలు తప్ప ఎవరూ పోని చోటికి రోజూ పిల్లలు వస్తూ పోతూ వుండటం చూసి కిట్టిగాడు వెళ్ళాడు.

కిట్టిగాడు వెళ్ళేసరికి మాష్టరు లేడు. పిల్లలంతా కీ బే....అని చదువు తున్నారు. గోల.

కిట్టిగాణ్ణి ఎవ్వరూ పట్టించుకోలేదు. కిట్టిగాడు వాళ్ళనెవరినీ పలకరించలేదు.

మూలన, చీకటిలో జానెత్తు బెంచీ వెనుక చేరగిలబడి నిద్రపోయాడు.

వేసవి సెలవులు ముగిసి పిల్లలంతా వచ్చారు.

బడి ముందు నిలబడ్డారు. అప్పుడే మేష్టారు వచ్చాడు.

సెలవుల్లో పిల్లలు ఏమేమి చేసింది చెప్పుకుంటూ వున్నారు.

తాళం తీసి, గొళ్ళెం తీసి, తలుపులు తోసి, పాముకాటు తిన్నవాడిలాగా మాష్టారు వణికిపోయాడు.

వాకిట్లో, రెండు తలుపులకు మధ్య బోర్లాపడి, రెండున్నర మూడు అడుగులు పొడవున్న ఒక పసి ప్రాణి అస్థిపంజరం.

# గళాసెత్తు దెయ్యం

పొద్దుకూకింది. కల్లు పాకలో పొద్దుపొడిచింది. వెలుతురులేదు. చీకటిరాలేదు.

వీధి దీపాలు వెలగ లేదు. గుడ్డి వెలుతురు. మూగ చీకటి.

మూలన రాయి మీద సుబ్బడు. ఎత్తిన గళాసు నోటికక్కరు సుకొనే వున్నాడు. దించలేదు.

సుబ్బడు ఎండు చేప. అయితే కడ్డీ చేప! నీలిగి నడుస్తాడు. నీలిగి కూర్చుంటాడు. నీలిగి పడుకొంటాడు. నీలుగుడు లేందే సుబ్బడు లేడు. సుబ్బడంటే నీలుగుడు.

సారాయి తాగిన సుబ్బడు యువకుడు. తాక్కపోతే ముసిలోడు.

కష్టం మీద ఖాళీ గళాసు నేలమీద పెట్టాడు. చుట్టూ చీకటి పోసెత్తినట్టు ముసిరింది.

సుబ్బడు మూణ్ణాళ్ళ నుంచి కూడు ముట్టిన పాపాన పోలేదు. పోనీ పుణ్యాన పోలేదు. కూడంటే సారాయి.

సారాయి తాగితే తిండి తినడు. డబ్బు వుంటే సారాయి తాగుతాడు. లేక పోతే పస్తు.

సుబ్బడి వంట్లో రక్తం లేదు. సారాయి వుంది. బీడీలు కాలుస్తున్నాడు. కమురు కంపు. మురుకులు, పకోడీలు, బజ్జీలు కూడా కంపు. మసాళా పప్పు, మసాళా బొరుగులు అమ్ముతున్నారు. దగ్గు వస్తుంది. ముడితే ఒట్టు.

సుబ్బడు తాగుతూ తినడు. అమృతం తాగుతూ విషం నంజుకోవటమా? వీల్లేదు.

తాగక ముందు తినటాని కుంటే అది పుచ్చుకొని వచ్చి సారాయి కొనుక్కొని తాగుతాడు. సుబ్బడు తాగుతాడు. తినడు. తినటం మర్చిపోయి ఎంత కాలం అయిందో గుర్తులేదు.

పెళ్లాం బ్రతికున్న రోజుల్లో తిన్నట్లు గుర్తు.

పుస్తె అమ్మి తాగిన రోజు తాను చావ వలసింది. ఆమె చావును వలచింది.

అప్పణ్ణుంచి తింటే సారాయి మానినంత ఒట్టు.

"ఇంకో గళాసు"

సుబ్బడు చెబితే సారాయి కుర్రాడు డబ్బు అడిగాడు.

జేబులో చిల్లర బరువుగా వుంది. తీసి ఇచ్చాడు. కుర్రాడు గళాసులో పోసుకు వచ్చాడు.

'ఈడి కియ్యాలింత డబ్బెణ్ణుంచి వొచ్చుంటుందబ్బా' ఆశ్చర్య పోయాడు, పాపం కుర్రాడు.

నిజమే సుబ్బడికి అమ్మటం తప్ప. సంపాదించటం తెలియదు. ఇల్లమ్మాడు తాగాడు. పొలం అమ్మాడు, తాగాడు, తాళి అమ్మాడు, సరే తాగాడు.

అమ్మటానికి ఏమీ లేకపోతే అప్పు చేశాడు. తాగాడు. కష్టార్జితం తాగాడు.

ముష్టి దొరక్క మూణ్ణాళ్ళ నుంచి కూడు అదే సారాయి ముట్టలేదు.

ఇవాళ ఇంత చిల్లర జేబులో గలగల్లాడిందంటే గళాసు కళ కళ లాడా ల్సిందే !!

తిక్క తలకెక్కిన ఒకడు మొలమీద పంచె జారిపోతున్నా నడిచి పోతు న్నాడు.

ఒక మూల సన్నగా, శ్రావ్యంగా లల్లాయి పదం అందుకున్నాడు, తాగిన బైరాగి.

'ఎందుకురా యేడుపు రేయ్, ఎవరు జచ్చేరీడ' సుబ్బడు కసురుకున్నాడు.

'ఏవురది సుబ్బరమన్నేసు సోములోలా దణ్ణాలండీ ?' సుబ్బడు మళ్ళీ మాట్లాడలేదు. లల్లాయి పదం ఆగ లేదు. వచ్చే వాళ్ళు వస్తున్నారు, పోయేవాళ్ళు పోతున్నారు.

ఏడుస్తూ వచ్చి నవ్వుతూ, నవ్వుతూ వచ్చి ఏడుస్తూ, ఏడుస్తూ వచ్చి ఇంకా ఏడుస్తూ, నవ్వుతూ వచ్చి ఇంకా నవ్వుతూ, జనం పోతున్నారు.

సుబ్బడు పోలేదు, లేవ లేదు, కదల్లేదు. వచ్చి నప్పుడు ఎట్లా కూర్చు న్నాడో, అట్లాగే కూర్చున్నాడు.

కదలిక అంతా గొంతులోకే ! సారాయి దిగుమతి అవుతువుంది.

ఇంత ద్రవ పదార్థం కడుపులోకి దిగుబడి అయినా, వంట్లో తడి లేదు. చెమ్మలేదు. ఎండిపోయిన కట్టె, వట్టి కట్టె, ఎండు కడ్డీ చేప !

ఏమి అవుతుందీ సారాయి.

ఆ మధ్య దగ్గు వచ్చింది. ఉమ్మివేస్తే రక్తం వచ్చింది. వంట్లో ఇమళ్ళని దాన్ని అక్కడెందుకుంచటమని కక్కేశాడు.

ఈ మధ్య దగ్గు రాకుండా రక్తం వస్తూవుంది. గాలి లేకుండా వాన వచ్చి నట్టు. దానికంత సరదా అయితే రానిమ్మని రోడ్లకి గళాసు గళాసులు రక్తదానం చేస్తున్నాడు.

ఎందుకో తెలియదు సుబ్బడి వంట్లోకి రక్తం చేరటానికి ఇష్టపడటం లేదు. ఉన్న రక్తం అక్కడ ఉండటానికి అంగీకరించటం లేదు.

సారాయి కుర్రాడు 'సుబ్బా ! ఇంక జాస్తేరా !' అంటే 'ఏడిశేవులే పోరా తేరా' అని చిల్లర చేతిలో పెట్టాడు.

"నీకేం పోయే కాలంరా" గళాసు తెచ్చి ముందు పెట్టాడు. గుటకలో మింగి విషం తాగిన పరమ శివుళ్ళా గొంతు పట్టుకున్నాడు.

ఎదుట నిండాఉన్న గళాసు నోటి దగ్గరుంచుకొంటే తెల్లటి సారాయి రంగు ఎర్రగా మారినట్లు చీకటి కన్ను గీటింది.

సుబ్బడు ఆశ్చర్యంగా గళాసు గొంతు పట్టుకొని, దాని ఊపిరి పీలుస్తు న్నట్లు ఒక్క గుటకలో పూర్తిగా తాగేసి కప్పను మింగిన పాములా కదలకుండా కూర్చున్నాడు.

కల్లుపాక ఎవరికీ కనపడకుండా, కొందరికి కనబడుతూనే ఉంది. చింతల తోపులో దాక్కుంది. కల్లుపాకలో వెలుతురు. కిటికీ మూసిన గదిలో వెలుతురులాగా చిన్నగా, సన్నగా, గుడ్డిగా కనబడుతూ వుంది.

కొక్కెర తెగులు తగిలిన కోడి మెడలాగా మెడ నిగిడ్చి చూస్తున్నాడు సుబ్బుడు.

చిల్లర రోడ్డు మీద విరజిమ్ముతున్నారు పిల్లలు. బిచ్చగాళ్లు ఎగబడి ఎగబడి ఏరుకుంటున్నారు.

సుబ్బుడు సందు చూచుకొని చొరబడ్డాడు.

హారతి పళ్ళెంలో చిల్లరతో బిగిసిన పిడికిలి గాలిలోకి ఎగరటంతో నేల మీద చిల్లర వర్షిస్తుంది.

ప్రక్కవాణ్ణి తోసి, తన్ని, రక్కి, గిల్లి, సుబ్బుడు చిల్లర ఏరుకొన్నాడు. పైస, రెండు, మూడు, అయిదు, పది, పావలా అర్ధ చిల్లరే చిల్లర! బిళ్ళలే బిళ్ళలు! ఏరటం జేబులో చేరటం ఏక కాలం!

ఊపిరి లేని సుబ్బుడు అంత ఊపుచూపుతుంటే పక్కనున్న వాళ్ళకి తట్టుకోవటం ప్రాణాపాయంగా అయింది.

పల్లె రోడ్డు దిగి డొంకలోకి మళ్ళితే, వర్షించే పైసలు ఇసుకలో పడి దొరక్క కనబడకుండాపోతే, పళ్ళెం ఖాళీ అయిపోతే, జేబు నిండిపోతే, సుబ్బుడు కడుపు నిండినవాడు తేన్చుతూ చుట్టూ చూచినట్టు చూశాడు.

బేండు మేళం వినిపించింది. రోడ్డు పొడుగునా చిల్లరతోపాటు విసిరిన పూలు కనిపించాయి. ఆ రోడ్డున వచ్చిన మనుషులు కనిపించారు. వాళ్ళలో కొందరి ఏడుపు వినిపించింది.

తీరా చూస్తే పల్లకీ మోసినట్లు పాడె మోస్తున్నారు. ఎండ తగలకుండా గొడుగు పట్టారు. వల్లకాటికి పోతున్నారు. కాలకుండా దుప్పటి కప్పేటట్లున్నారు.

సుబ్బుడు నవ్వాడు.

చచ్చి ఏ లోకాన ఉన్నాడో తాని ఇన్నాళ్ళకి బతికించాడు అనుకొని శవం ముఖం చూచాడు. తల నున్నగా పూలు రంగు రంగులుగా ముఖం తెల్లగా నల్లగా ఎండకు గొడుక్కు మారుతూ చిత్రంగా కనిపించింది.

వల్ల కాటిలో ఈ శవం కాలితే ఈ ముఖం ఈ చిత్రం ఎందుక్కనిపించదు?

కల్లు పాకలో సుబ్బడు నిండా ఉన్న గళాసు నోటి దగ్గర పెట్టుకోగానే రంగు మారింది.

తెల్లగా నల్లగా పూలుగా ఎర్రగా పచ్చగా సున్నగా చిత్రంగా గళాసు నవ్వింది.

నవ్విన గళాసు పీక నులిమేస్తూ గొంతులో పోసేసుకున్నాడు.

గళాసు ఖాళీగా వుంటే శవం లేచి కూర్చుంది. తలనున్నగా నల్లగా తెల్లగా రంగు రంగులుగా ఉంది.

తోటకివతల నుంచి పోతే రోడ్డు. అటు పోతే మురుగు! బురద! రొచ్చు! రోత! ముళ్ళ పొదలు! పిచ్చి చెట్లు !!

చచ్చిన కుక్కను ఈడ్చినట్లున్నారు వాసన. అగరొత్తులు కాలుతున్నాయి.

గళాసులో శవం ప్రాణం తీయటానికి సుబ్బడు సారాయి నింపాడు. శవం చావలేదు. బ్రతికే వుంది. పైగా నవ్వుతూ వుంది దెయ్యం!

తెల్ల దెయ్యం ఎర్రగా మారింది. చిల్లరంతా తీసి కుర్రాడి చేతిలో ఉంచాడు.

పెద్ద లోటా నిండా సారాయి ఇచ్చాడు కుర్రాడు. దానికి రంగూ రుచీ వాసనా అంటూ లేవు.

చిత్రం! సుబ్బడికి చెమట పడుతూ వుంది.

చొక్కా తీయనూ తీశాడు, తుడవనూ తుడిచాడు, ఎక్కడ పెట్టాడో మర్చిపోయాడు.

లోటా నోటక్కర్చుకొని గుటక గుటకకీ, గాలి కొడితే ఉబ్బే టైర్‌లాగా, కదిలి నిలబడసాగాడు సుబ్బడు. లోటా కాళీ అయ్యేసరికి నిటారుగా నిలబడ్డాడు.

ఎవర్నీ అడక్కుండా వచ్చిన సుబ్బడు, ఎవరికీ చెప్పకుండా బయలు దేరాడు. కట్టు పంచె అడ్డం పడితే జారతొక్కాడు. ఎట్లా పుట్టాడో, అట్లా పోతున్నాడు.

ఇటు రోడ్డెక్క లేదు. అటు మురుగు తొక్కాడు. ముళ్ళ పొదలు చీల్చాడు.

చిన్న ప్రాణాలు దెయ్యమని దాక్కున్నాయి.

తెల్లవారింది.

కాకులూ, గద్దలూ, చిల్లర ఏరుకొంటున్న వాళ్ళు లాగా అరుస్తున్నాయి, కరుస్తున్నాయి. ఎగురుతున్నాయి.

# కొత్త చూపు

రామలింగం పొద్దుంణ్ణుంచీ మొక్కలు నాటుతూనే వున్నాడు. వంచిన నడుం ఎత్తలేదు.

పొద్దువాలింది. ఆ రోజు పని ముగిసింది. తలెత్తాడు. నిలబడ్డాడు. నడుం మీద చేతుల్తో వత్తుకున్నాడు.

ఆవులిస్తూ రోడ్డుకు రెండు పక్కలా సోలుపులు సోలుపులుగా వున్న మొక్కల్ని చూశాడు. ఎంత ఆనందం!

రోడ్డున పడి పోతుంటే మొక్కలు తలలు వంచుకొని వినయంగా నిల బడ్డాయి.

పెరిగి పెద్దదై తలెత్తుకొని నిలబడ్డప్పుడు ఎంత దర్జా!

వంద మొక్కలయినా నాటాడు రామలింగం ఇవాళ! రోజూ ఇదేపని!

రామలింగం పసిపిల్లల్ని తాకినట్టు మొక్కల్ని తాకుతాడు. అంత సున్నితం.

మొక్క వేళ్ళకు నొప్పితగలకుండా మెత్తగా గోతిలో పెట్టి, చెమ్మమట్టి చిదిపి, పొడిరాల్చి, ఒండ్రు మట్టి వేసి, ఆ పైన ఇసుక మట్టి పోసి, పూడ్చి, ఇన్ని నీళ్ళు చిలకరించి రామలింగం లేచి నిలబడుతుంటే గుళ్లో పూజచేసి నిలబడ్డ పూజారి గుర్తొస్తాడు. అంత భక్తి.

ఏ ఒక్క మొక్కకో కాదు అన్ని మొక్కలకూ అంతే!

ఆసుపత్రి రోడ్డుమీద తలలొంచుకొని నిలబడ్డ మొక్కలు వైద్యం కోసం వెళ్ళే రోగుల్ని పిలవడం లేదు. తలవటం లేదు. చూడటం లేదు.

బ్రతకటం, బట్ట కట్టటం, బాగు పడటం, గూర్చి కలలు కంటున్నాయి మొక్కలు.

రామలింగం ఇంటికి వెళ్ళేసరికి నాగమ్మ కొంపలంటుకున్నట్లు అరచి గగ్గోలెత్తి పోతూ వుంది.

రోజంతా పడ్డ కష్టంతో, వళ్ళంతా పుట్టేనొప్పి మర్చిపోయి, రామలింగం గబగబా గుడిసెలోకి పోయాడు.

చాపమీద నాగమ్మ. పక్కనే పెద్దమ్మ. పురిటినొప్పులు. తొలికాన్పు.

నాగి లక్ష్మి, తాను తండ్రి కాబోతున్న శుభసమయం వచ్చిందని రామలింగం పొంగిపోతున్నాడు.

నాగమ్మ అరుస్తూ వుంచే బాధగా వున్నా, సంతోషంగానూ వుంది.

నొప్పి తెరతగ్గి అంసటగా అశాంతిగా నాగమ్మ కదులుతూ వుంది.

పెద్దమ్మ పొయిలో పిల్లిని తోలటానికి పోయింది.

దగ్గర కూర్చున్న భర్తకు మరీ దగ్గరకు రమ్మని సైగ చేసి, రెండు చేతులూ పట్టుకొని ఈ పోకిరీవాడు చూడు ఎట్లా తంతున్నాడో' అని పొట్టచూపించింది. నాగమ్మ పొట్ట అలలు అలలుగా కదులుతూవుంది.

పొద్దుట ఆసుపత్రికి నాగమ్మను తీసుకుపోతున్న రామలింగం ఆ రోడ్డు పక్కన తాను నిన్న నాటిన మొక్కలకు లారీవచ్చి నీళ్ళుపోస్తూవుంటే చూశాడు.

వద్దు వద్దని మొక్కలు మునుగుతున్న తలలూపుతూ మొత్తుకుంటున్నా వినకుండా ఇంకొంచెం ఇంకొంచెం అంటూ గొట్టం నీళ్ళు పోస్తూవుంది.

'అయ్యొయ్యో' అనుకుంటూ రామలింగం ఆగి 'కొంచెం కొంచెం పోయి' అని చెప్పి వెళ్ళిపోయాడు.

స్వీటు ఇస్తే చూచే పసివాళ్ళలాగా మొక్కలు నంగి నంగిగా నవుతూ తలలాడించాయి.

నొప్పులెక్కువయితే నాగమ్మను కాన్పుల గదిలోకి తీసుకుపోయారు. తలుపులు వేశారు. మనిషి కనిపించటంలేదు. అరుపులు మాత్రం వినిపిస్తున్నాయి.

గొంతు నాళం తెగిపోతుందా అన్నట్లుగా పెద్దగా అరిచింది నాగమ్మ. బైట బెంచీమీద కూర్చున్న రామలింగం గుండె జారిపోయినట్లయింది.

అంతలో పసిగొంతు కెవ్వుమంది. కేరుకేరుమంది.

జారిన రామలింగం గుండె పైకి చేరింది. ఆడుకొంది. అల్లరి చేసింది.

ఈ గొంతు ఈ లోకంలో ఇంతకుముందు లేదు. ఇది నా గొంతు. నాగి గొంతు. రెండూ కలిసిన మాగొంతు.

నూరేళ్ళు లోకంలో వినిపించపోయే గొంతు మొట్టమొదట విన్న అదృష్ట వంతుణ్ణి.

గొంతు ఎంత మధురంగా ఉంది! తన గుండెకు కొట్టుకోవటం నేర్పుతూ వుంది.

రామలింగం అనుకున్నట్లుగానే కొడుకు పుట్టాడు. తల్లీ కొడుకు హాయిగా ఆరోగ్యంగా వున్నారు.

ఆసుపత్రినుంచి ఇంటికి వెళుతున్న రోజు రోడ్డుపక్క మొక్కలు స్కూలు పిల్లల్లాగా ప్రసన్నంగా చేతులూపుతూ నిలబడ్డాయి.

ఎండు ఆకులు రాలిపోయాయి. మొక్కలు పచ్చబడ్డాయి. రేపోమాపో చిగురు వేస్తాయి.

రామలింగం సంతోషంగా గుడిసెలోకి బాబును తీసుకువచ్చి ఇది నీ సామ్రాజ్యం అని పరిచయం చేసి, పరిపాలించుకోమని పట్టాభిషేకం చేసి, చాప సింహాసనం చూపిస్తే, బాబు కూర్చోకుండా పడుకొని ఏడుపులతో ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు.

తల్లీ దండ్రి ప్రధాన మంత్రులై ప్రభువుల వారి ఆజ్ఞలను అమలు పరుస్తు న్నారు.

పుట్టినప్పుడు ముద్దుగా బొద్దుగా ఆరోగ్యంగా ఉండేవాడు. ఇప్పుడేమో రోజు రోజుకి అకారణంగా సన్నగా అనారోగ్యంగా తయారవుతున్నాడని నాగమ్మ గోల పెడుతూనే వుంది. రామలింగం మందులూ, మాకులూ తెస్తూనే వున్నాడు. వాడుతూనే వున్నారు.

వెదురు బద్దలతో గూడు బుట్టలల్లి మొక్కల చుట్టూ నాటితే పొయ్యిల్లోకి పొయ్యాయో పొలాల్లోకి పోయాయో మాయమయ్యాయి. పత్తాలేవు.

అందుకని చుట్టూ గోడతో, చదరం గోడతో, మొక్కల చుట్టూ కట్టటానికి నిశ్చయించుకొని రామలింగాన్ని పిలిచారు.

మొక్క మొక్కకీ కంతలు కంతలుగా ఇటుకలతో గజం చదరంలో గోడ కడుతుంటే ఇటుకలందిస్తూ ఉన్నాడు రామలింగం.

పనిచేస్తున్నంతసేపూ మొక్కలు నవ్వుతూ పలకరిస్తూనే వున్నాయి.

వారం రోజుల్లో, ఆసుపత్రి రోడ్డు మొక్కల చుట్టూ, కాపలా కట్టడాలు నిలిచాయి. చూస్తుంటే ఎందుకో బాధ కలిగింది.

పసివాళ్ళను జైల్లో పెట్టినట్లు అన్పించింది.

ఆదేమిటో తెలియకుండా; ఎందుకయినా నోళ్ళు తెరిచే పసి ప్రాణాలులాగా మొక్కలు కన్నాల్లోంచి నిక్కి నిక్కి చూస్తున్నాయి.

జాలివేసింది.

బాబుకు విరేచనాలు అన్న విషయం విన్నప్పుడు రామలింగం నవ్వు ఆపుకోలేకపోయాడు.

ఎందుకంత నవ్వు అంటే ఏం చెబుతాడు?

చూడు నాగీ నీకున్న పాలన్నీ ఆ పసివాడు తాగాలంటే వాడికి ఓపిక వుండొద్దూ ?

రామలింగం నవ్వుతూనే వున్నాడు.

నాగమ్మకు కోపం వచ్చింది. సిగ్గూ కలిగింది. ప్రేమా పుట్టింది.

'సర్లే' అంటూ వెళ్ళిపోయింది.

బాబును తీసుకొని ఆసుపత్రికి వెళుతుంటే మొక్కలు తల్లి చాటు పిల్లలాగ నవ్వుకున్నాయి.

ఆ సిమ్మెంటు, ఇటుకలు, కన్నాలు చూస్తుంటే రామలింగం వళ్ళుమండి పోతూ వుంది.

మొక్కలకు-ఇటుకలు సిమ్మెంటు - తన గుడిసెకు-మట్టి తాటాకులు.

తన కూలి డబ్బులతో కాస్తో కూస్తో తిని, ముతకో అతుకో కట్టుకొని, సిమ్మెంటు ఇటుకలతో ఇల్లు-

రామలింగం ఆలోచించుకొంటూపోతుంటే-

తన తాటాకు పాక గాలికి లేచిపోయినట్టు, వానకి మట్టిగోడలు విడిపోయినట్టు బాబు దుమ్ములో, ధూళిలో రోడ్డుపక్క బురదలో-

రామలింగం నడవటం ఆపి మొక్కల్ని చూశాడు.

కోటలో రాజకుమారుల్లా మొక్కలు నవ్వుతున్నాయి.

ఈసారి నాగమ్మ నొప్పులు పడుతుంటే రిక్షాలో పక్కనే కూర్చోబెట్టుకుని ఆసుపత్రికి తీసుకుపోయాడు రామలింగం.

ఆసుపత్రి రోడ్డులో మొక్కల ముఖాలు చూస్తుంటే గుండె చెరువయింది.

కొన్ని ఇటుకలు వానకు కరిగి మట్టిలో కలిశాయి.

కొన్ని ఇటుకలు లేనివాళ్ళ ఇళ్ళ గోడల్లో ఉన్నాయి.

కొన్ని సిమ్మెంటుతో చెట్టాపట్టాలు వేసుకొని మురుక్కాలవలో ఉన్నాయి.

మొత్తానికి మొక్కల చుట్టూ సిమ్మెంటు లేదు. ఇటుకలు లేవు.

నొప్పులెక్కువయి అరుస్తున్న నాగమ్మను గుండె కలుక్కుమంటున్న రామలింగం తీసుకుపోయాడు.

రెండోవాడూ కొడుకే అయినప్పుడు తల్లి అనురాగ తరంగిణి. తండ్రి ఆనందసముద్రుడు.

ఈ వారం రోజుల్లో పెద్దబాబుని సైకిల్ ఒకటి పడేసింది. లారీ వచ్చి బాబుకు పరుగు నేర్పింది. ఆవు తోకతో మంత్రం జపించింది.

రెండోవాడికి విరేచనాలకు మందు తీసుకొని వస్తున్నరోజు ఆసుపత్రి రోడ్డు బోసినోరులాగ కన్పించింది.

మొక్కల్లో ఒక్కటీ కనిపించలేదు.

మేక ఆకులు కొరుక్కుంది.

ఎనుం మొక్క పీక్కుపోయింది.

పిల్లలు మొక్కలు పీకి, వేరేచోట పాతి, మళ్ళీ పీకి పాతి-పీకి మొత్తంమీద చంపి ఆనందించారు.

ఆసుపత్రికి రోగిని తీసుకుపోతున్న ఆరోగ్యవంతుడు మొక్క పీకి పళ్లు తోంకొని ముఖం కడుక్కున్నాడు.

రోడ్డు పొడుగునా మొక్కలు పోగా, మిగిలిన గుంటలూ పడిపోగా మిగిలిన ఇటుకలూ మనిషి మంచితనాన్ని, మాలిన్యాన్ని, ఆశనీ, అంధకారాన్నీ వివస్త్రంగా వికారంగా, క్రూరంగా చూపుతున్నాయి.

ఇంటి దగ్గర పెద్దబాబు తలకి గాయమయి ఉన్నాడు.

కాకి తన్నబోతే పడ్డాడు. తల పగిలింది.

నాగమ్మ ఏడుస్తుంది.

భార్యను పిల్లల్ని చేతులకిందికి తీసుకుని కూర్చున్నాడు రామలింగం.

నాగమ్మ ఏడుపు మానింది.

పెద్దవాడు నొప్పి మర్చిపోయి కూర్చున్నాడు.

చిన్నవాడు కాళ్లు చేతులూ, రామలింగం ఆలోచనలులాగా తిప్పుతున్నాడు.

చావు పుట్టుకల మధ్య ఊగుతున్న లోకంలో పుట్టుకమీది ఆశవల్ల, చావు మీది భయంవల్ల, పెరగవలసిందేదీ పెరగవలసినట్లు పెరగటంలేదు.

నిరంతరం క్షోభ, సంఘర్షణ, వ్యధ.

రామలింగం కన్నీరు, నాగమ్మా పెద్దబాబూ చెరొక ప్రక్క తుడిస్తే కొత్త చూపు వచ్చింది.

# క్రిస్మస్ శుభాకాంక్షలు

చర్చి గంటలు మ్రోగుతున్నాయి.

'చింత లేదిక ఏసు పుట్టెను
వింతగను బెత్లేహేమందున
చెంత చేరగ రండి వేగమె
దీనులై సర్వమాన్యులై' పాట వినబడుతూ వుంది.

చర్చి అంతా రంగు కాగితాలతో, బెలూనులతో, చమ్కీ దారాలతో, రంగు రంగుల బబ్బులతో, తోరణాలతో, అరటి బోదెలతో, కొబ్బరి మట్టలతో అలంకరింపబడి వుంది.

చర్చి నిండా కిటకిట లాడుతూ జనం. క్రైస్తవులు.

కొత్త బట్టలు, కొత్త అలంకారాలు, కొత్త ఆశలు, కొత్త ఆనందాలు రూపం దిద్దుకొన్న క్రైస్తవులు.

సిలువ ఆకారంలో వున్న దేవాలయంలో క్రీస్తు శిరస్సు మీద ముళ్ళ కిరీటం పెట్టిన చోట వేదిక వుంది. చేతులకు మేకులు కొట్టిన చోట సంగీతం, చర్చి అధికారం కూర్చున్నాయి. సంగీతంలో హార్మోనియం, ఆడపిల్లలు, ఆర్కెస్ట్రా పాటల పుస్తకాల భాగం. అధికారంలో చర్చి పాలక వర్గం, వాళ్ళ సంతానం, వారసులో భాగం. కాళ్ళకు మేకులు కొట్టిన చోట చర్చి ప్రవేశం. అందులోంచి ఏసుప్రభువు రక్తం ప్రాచీన కాలంలో నుంచి వస్తున్నట్టు ఆరకుండా ఆగకుండా వస్తున్న క్రైస్తవులు. ఈ గేటులో నుంచే నగరంలోని క్రైస్తవులంతా చర్చికి రావటం, పోవటం.

ఫాదిరీ వేదిక మీద పులిపీఠం దగ్గర నిలబడి నక్షత్ర ప్రయాణం వివరించాడు. గొర్రెల కాపరులకు దేవదూత రక్షకుడి జననం గూర్చి తెలపటం విశదీకరించాడు. జ్ఞానులు కాపరులు చేసిన యాత్రలు తెలిపాడు. చలిలో కొండల్లో

నిండు చూలాలు అష్టకష్టాలు పడి బెత్లెహెం చేరటం చెప్పాడు. హేరోదు రాజు దుష్ట చింతన పరామర్శించాడు. పశువుల పాకలో జగద్రక్షకుడు పసిపాపగా పండుకొని ఉండటం భావించాడు. ఏసు ఎవరో, క్రీస్తు ఎవరో, క్రైస్తవం ఏమిటో, క్రైస్తవులు ఏం చేయాలో, ఎలా జీవించాలో, భక్తితో, ఆవేదనతో, ఆవేశంతో, ప్రేమతో సూటిగా తీక్షణంగా, తీవ్రంగా, దీక్షగా ప్రవచనం చేస్తున్నాడు.

చర్చిలో క్రైస్తవులు వింటున్నారు.

భక్తి తాదాత్మ్యంతో తలలూపుతున్నారు. ఆసక్తితో చెవులు నిక్కబొడుచుకొని వింటున్నారు. అలంకరణ పరికిస్తున్నారు. బట్టలు, నగలు పరిశీలిస్తున్నారు. దొరికే స్థలమూ తెలుసు కొంటున్నారు. పిన్నవాళ్ళు ఆవులిస్తున్నారు. చాక్‌లెట్‌లు తింటున్నారు. చీరలు దులుపు కొంటున్నారు. చుట్టూ చూస్తున్నారు.

చర్చి మౌనంగా ఉంది.

చుట్టూ ఆలగోలగా బాల గోలగా ఉంది.

భక్తిగా ఉంది. ఉత్సవంగా ఉంది. వేడుకగా ఉంది. వినోదంగా ఉంది. వింతగా ఉంది. బిచ్చగాళ్ళకు చింతగా ఉంది.

'చింత వీడిక ఏసుపుట్టెను.

పాట చర్చిలో వినపడటం లేదు. చర్చి నుంచి కాంపౌండుగోడ గేటు దాకా రెండు పక్కలా మహారాజుకు వంది మాగధులు లాగా, రోడ్డుకు ఫుట్‌పాత్‌స లాగా, మనిషికి కాళ్ళులాగా బారులు తీర్చి కూర్చున్న బిచ్చగాళ్ళ పాడుతున్నారు.

చర్చిలో ఉపన్యాసం సాగుతూంది.

ఎడం ప్రక్కన సంగీత సామ్రాజ్యం వైపు చూస్తు మకుటంలేని మహారాజు లాగా కూర్చున్న మహాత్ముడు ఏసురాం.

ఏసురాం పేరు ఎవరు పెట్టారో కాని పేరే పెద్ద విశేషం.

అది క్రైస్తవ హిందూ మత సంప్రదాయాల సంరక్షణ రూపం.

అది పాశ్చాత్య ప్రాచ్య భాషా ధర్మ సమన్వయ దీప్తి.

ఏసురాం పేరుకు మాత్రమే గొప్ప వ్యక్తి కాడు. జీవితం ఇంకా విశేష మయింది.

చర్చికి పోతాడు. బైబిల్ సూక్తులు వింటాడు. గుడికి పోతాడు. పూజ చేయిస్తాడు. మసీదుకు వెళతాడు. నమాజు చేస్తాడు.

ఎవరూ అతన్ని ఆటంక పరచరు. అందరూ అతన్ని ఆహ్వానిస్తారు. నగరంలో అతడికున్నంత పేరు ప్రఖ్యాతులు మరెవరికి లేవంటే ఆశ్చర్యం లేదు.

అతడో శక్తి, వ్యక్తి కాదు, వ్యవస్థ. అంతే కాదు. అతడు సర్వ మత సమన్వయ శీలి. తానే అన్ని మతాలు, అన్ని మతాలు తానే.

"నువ్వెవరివి"

"క్రైస్తవుణ్ణి"

"నువ్వెవరివి"

"భారతీయుణ్ణి"

"నువ్వెవరివి"

"విశ్వ మానవుణ్ణి"

అవీ ఏసు రాం సమాధానాలు.

అతడికున్నంత ఆస్తి ఆ ఊళ్ళో ఎవ్వరికి లేకపోవడంతోనే అతని గొప్పతనం. అంతే కాదు.

అతడికున్నంత మంది పిల్లలు ఆ వూళ్ళో ఎవ్వరికి లేరు. అంత మాత్రాన అతడికి ఆధిక్యం రాలేదు.

అతడి పిల్లలు ప్రపంచంలో ఎన్నో దేశాలలో వున్నారు. అన్ని దేశాలలో తన సంతానాన్ని చూచుకొనే అదృష్టం మాత్రమే అతడికి గొప్పతనం తెచ్చి పెట్టలేదు.

ఆ పిల్లలు చదివిన చదువులు, చేసే ఉద్యోగాలు, ఉన్న సంబంధాలు, వచ్చే సంపదలు ఇలా అని చెప్పటానికి వీలు లేకపోవటం నుంచి అతడికి ప్రత్యేక గౌరవం రాదు.

ఎవరో అనటం కద్దు. ఏసురాం తలచుకొంటే నగరాన్ని కొనేయగలడని.

నిజమెంతో అబద్ధమెంతో కానీ, అతడెప్పుడు నగరాన్ని బేరమాడలేదు. కానీ ఫ్యాక్టరీలు స్థాపించాడు. ఇళ్ళు కట్టించాడు. పొలాలు కొన్నాడు. ఒక కదిలే బ్యాంకు లాగా వుంటాడు. జేబులో చిల్లి గవ్వ వుండని బిచ్చగాడు లావుంటాడు. బిచ్చగాడికయినా చిల్లి గవ్వలు, చెల్లు గవ్వలు, చిల్లర డబ్బులుంటాయి.

రామ రామ ఏసురాం దగ్గర పొట్ట పొడిస్తే అక్షరం ముక్క లేనట్లే జేబు కొడితే పైసా దొరకదు.

ఎందువల్ల?

ఇప్పుడుండీ లేనివాడు కావటం వల్ల.

అప్పుడు లేకపోవటం వల్ల.

ఆ రోజుల్లో తాను చాలా చిన్నవాడు.

చిన్నతనం వయస్సుసకు సంబంధించింది. డబ్బుకు సంబంధించింది. ఇంకా అధికారానికి, అర్హతకు, అంతస్తుకు, పలుకుబడికి, ప్రాపుకు సంబంధించింది.

అప్పుడు దూడలు కాచుకొన్నాడు

నాగలి పట్టుకొన్నాడు.

తలగుడ్డ చుట్టుకొన్నాడు.

తెల్లదొరల దగ్గర చేరాడు. వాళ్ళ దగ్గర అక్షరాలు తప్ప అన్ని నేర్చుకొన్నాడు.

ఇంగ్లీషు మాట్లాడుతూవుంటే దొరలకు తలకాయ కొట్టేసి నట్లుండేది.

చాలా దేశాలు తిరిగాడు.

ఏసురాంకు చదువురాదని బొటన వేలు ముద్ర వేస్తాడని చూచిన వాళ్ళు కూడా నమ్మరు.

బట్టలు చూచినా, మాటలు విన్నా, తెలివి తేటలు గమనించినా, దేశాలు ఏలే మహారాజే అని నమ్ముతారు.

ప్రసంగం చేసే ఫాదరీ క్షణం క్షణం ఏసురాంని గమనిస్తున్నాడు.

ఏసురాం కంటితో మాట్లాడగలడు.

ఫాదరీ కంటితో వినగలడు.

ప్రసంగం ఆపమంటే ఆపుతాడు.

సాగించమంటే లాగించేస్తాడు.

ఇందువల్ల ఏసురాం మొనగాడై పోలేదు.

మరి ?

నలభై ఏళ్ళ ఏసురాం కార్యదర్శి.

అదేం గొప్ప ?

అవును ! అదే గొప్ప !

అది నిజమే. ప్రధానమంత్రి పదవికాదు. ముఖ్యమంత్రీ కానేకాదు. పోనీ మామూలు మంత్రి వ్యవహారమూ కాదు.

అయితే ఏకగ్రీవంగా అన్నేళ్ళు కార్యదర్శి కావటం మాటలా ?

మిషన్ అంటే ఒక చర్చి కాదు, చాలా చర్చీలు.

మిషన్ అంటే ఒక ఊరు కాదు. ఒక జిల్లా కాదు. చాలా జిల్లాలూ కాదు.

రెండు రాష్ట్రాలు కూడ ఈ మిషన్‌లో వున్నాయి.

ఈ క్రైస్తవులందరికి ఏసురాం కార్యదర్శి.

పోటీ లేకుండా గెలిచాడు !

గిట్టని వాళ్ళు లక్ష చెబుతారు. వాళ్ళంతా చర్చిలో కూర్చున్నారు. వాళ్ళి దప్పుడే లేవరు.

ప్రార్థన చేస్తున్నారు.

ప్రసంగం వింటున్నారు. భక్తి పారవశ్యంతో వూగిపోతున్నారు. ఊరు మరచి, వాడ మరచి, పుట్టి పెరిగిన చోటు మరచి, బ్రతుకు బాధ్యత మరచి, భక్తి ప్రవాహంలో కొట్టుకు పోతున్నారు.

ఏదీ కోరుకోకుండా, ఏమీ పట్టించుకోకుండా, ఏదీ అక్కర లేకుండా జీవిస్తున్నారు. దేవుణ్ణి సేవిస్తున్నారు.

వాళ్ళు ఆదర్శ క్రైస్తవులు. మాదిరి క్రైస్తవులు. లోకం ఆకలి గొన్నప్పుడు అగ్గిరెత్తి చూడ్డానికి దొరికే క్రైస్తవులు.

వీళ్ళకి దైవ సామ్రాజ్యం కావలసినంతగా మానవ సామ్రాజ్యం అక్కర లేదు.

దాని కోసం వీళ్ళు సర్వం సమర్పించుకొంటారు.

భక్తి తప్ప ఏమీ పొందరు. ఇల్లు లేదు. పొలం లేదు!

రేపటి గురించి ఆశ లేదు. ఆసక్తి లేదు.

ఏది లభిస్తే అది గ్రహించటం, జీవించటం అంతే ?

వాళ్ళు సుఖంగా వున్నారు. సంతోషంగా వున్నారు. వాటిని చుట్టూ పంచుతున్నారు.

తుదకు మిగిలిందేమీ లేదు. మిగిలేదేమీ లేదు.

ఇటువంటి సద్భక్తులను సంరక్షించే పూచీ ఏసురాంది.

ఏ ఎం. పి. ఎలక్షన్‌లో కూడా ఏసురాం పన్నే యుక్తులు మేం చూడలేదని రాజకీయాలలో తడిసి, నాని, ఎండి బీటలు తీసిన మేధావులు ఒప్పుకొన్నారు.

అందువల్లే దేశ రాజకీయాలలో పోటీ అయినా వుంటుంది.

ఏసురాంకి అదేం లేదు.

కల్లు, సారాయి ఖర్చు ఏ రాజకీయ నాయకుడయినా చేస్తాడట.

స్త్రీలను కూడా ఎలెక్షన్‌లో ఖర్చు చేయడం ఏసురాంకి తెలుసునట.

డబ్బు నదీ ప్రాంతంలో జలంలాగా ఎవరయినా ఖర్చుపెడతారట.

కానీ సముద్ర జలంలాగా ఏసురాం వాడుతాడట.

ప్రతినిధుల్ని ఆహ్వానించటం, బ్రతిమాలటం, బెదరించటం, దాచిపెట్టడం ఎవరైనా చేయగలరట కానీ అవసరమయితే అయిపులేకుండా చేయటం, పత్తా లేకుండా చేయటం, కేసు రాకుండా చూడటం ఏసురాంకు తెలుసునట.

అందుకే నగరంలోని రాజకీయ నాయకులు ఏసురాం ఇంటి వరండాలో పాఠాలు వినటం కోసం పడిగాపులు పడివుంటారు.

ఏసురాం దర్శనమే దైవ దర్శనం, ఉపదేశం గీతోపదేశం.

చర్చిలో ప్రసంగం సాగుతూనేవుంది.

చిలువలు పలువలుగా అల్లుకుపోతూవుంది.

మైక్ లౌడ్‌స్పీకరై లోకం మీద పడి కేకలేస్తూవుంది.

భక్తులు వస్తూవున్నారు.

చర్చి నిండిపోయింది. జనం చుట్టూ వెలుపల నిలబడ్డారు.

ఫాదిరి కనిపించకపోయినా ప్రసంగం వినబడుతూవుంది.

ఉత్సాహం ఊపిరై, ఆనందమై, పిల్లలు ఆడుకొంటున్నారు.

బిచ్చగాళ్ళు అడుక్కొంటున్నారు.

భక్తులు పరవశులవుతున్నారు.

గాలికి భక్తుల ఆనందం సువాసన పంచిపెడుతూవుంది.

కంటికి చర్చి పండుగగావుంది.

క్రిస్మస్ పండుగ పరమానందంగా చర్చిలో ఉపన్యాసంగా సాగుతూ వుంది.

పట్టరాని ఆనందం.

ఏసురాంకి పట్టరాని దుఃఖం.

ఎదురుగా ముందు వరుసలో కూర్చున్న యువకుణ్ణి చూస్తుంటే వళ్ళుమండి పోతూంది.

ఈ మిషన్‌లో ఏ జిల్లావాడో యువకుడు! ఆనందం !

నేను ఆనందాన్ని అంటూ నిన్ననే ఏసురాంని కలుసుకొన్నాడు.

'ఏం ?' అన్నాడు ఏసురాం.

'ఎలక్షన్లు' ఆనందం.

'ఏం ?'

'ఎం. పి.'

'ఏం ?'

"నువ్వైనా నిలబడు, నాకయినా నీ సపోర్టుఇవ్వు !"

'నీకేం బలముంది?'

'నేనే'

ఏసురాం మాట్లాడలేదు. అసలు అతడితో ఎలక్షన్లగూర్చి ప్రస్తావించిన వాడు ఇంతవరకూ లేడు.

ఎక్కడయినా, ఎప్పుడయినా వున్నా ఇలా మాట్లాడినవాడులేడు.

సలహా ఇచ్చినా, సూచన చేసినా, లొంగి, తగ్గి, తలవంచుకొని మాట్లాడిన వాళ్ళే!

ఇలా నువ్వో నేనో అన్నవాడెవడూలేడు.

అందరికీ క్రీస్తు పుట్టుక ఆనందం కలిగిస్తూవుంది.

ఏసురాంకి ఈ ఆనందం పుట్టుక బాధగావుంది.

చర్చిలో అంతా క్రిస్మస్ శిశువును చూస్తున్నారు. తలచుకొంటున్నారు. వింటున్నారు. ఆవులిస్తూవున్నారు.

ఏసురాం ఈ కొత్త యువకుణ్ణి చూస్తున్నాడు. తలుస్తున్నాడు.

వాడెవడో కారునీ, వీడెవడో స్కూటర్‌నీ ఎందుకు వాడటంలేదని ఏసురాంని అడిగాడు.

'ఏమో' అన్నాడు ఏసురాం పరధ్యానంగా.

'పెట్రోల్' అన్నాడు ఆనందం. 'ధర పెరిగింది' మళ్ళీ చెప్పాడు.

ఏసురాం పరధ్యానం వదలిపోయింది.

'ఆ!' అని సర్దుకొని కూర్చున్నాడు.

"నీకారులోకి పెట్రోలు ఎక్కణ్ణుంచి వస్తుంది."

'పెట్రోలు బంకులోంచి'

'కాదు గల్ఫ్ కంట్రీసునుంచి'

ఏసురాం వెన్నుముకమీద చరచినట్టయింది.

'ఏసుప్రభువున్నట్టి పుట్టి పెరిగి తిరిగి రక్షించి, శిక్షింపబడినచోటునుంచి".

ఏసురాం వెన్నుముక నిచ్చెనక్రింద ఇసుక తొలుచుకుపోతూవుంది.

'క్రీస్తు పుట్టకముందునుంచీ, పుట్టింతర్వాత ఇప్పుడూ ఎప్పుడూ అక్కడ యుద్ధాలే'

వెన్నుముక జలజల లాడుతూవుంది.

'అక్కడి యుద్ధాలే ఇక్కడి నీ కాలినడకకు కారణం!'

ఏసురాం నడుం విరిగినట్లయింది.

దేశ రాజకీయాలు, ప్రపంచ రాజ్యాల తాపత్రయం, ధరల పెరుగుదల, దేశంలో అరాచకం, ఆందోళనలు, అల్లర్లు, తగలబడటాలు వంటి చాలా విషయాలు మాట్లాడుతున్నాడు ఆనందం.

ఏసురాం చెవి పనిచేయటంలేదు. చూపు ఆనటంలేదు. వొంటిమీద స్పర్శ లేదు. తలకాయ పనిచేయటంలేదు. మొద్దుబారిపోయాడు.

ఒకటే ప్రశ్న.

'ఎవడు వీడు ?'

అరిగిపోయిన గ్రాంఫోను రికార్డు పెడితే వచ్చే ఒకే శబ్దం లాగా 'ఎవడు వీడు'? 'ఎవడు వీడు?' 'ఎవడు వీడు?'

వాడు ఎం.పి.గా నిలబడతాడో, నిలబడడో, ఓడిపోతాడో, పోడో కాని మిషన్ కార్యదర్శి పదవికి పోటీ కారాదు.

ఆ మాట అనుకొన్న దగ్గర్నుంచి ఒకటే వణుకు.

ఆనందం రాక పిడుగు పాటు.

అగ్నిమాపక దళం జట్లు జట్లుగా తలకాయ చుట్టూ తిరుగుతున్నట్లుంది.

నిన్నటి నుంచి ఏసురాంకు వణుకు. ఇప్పుడు ఏసురాం అంటేనే వణుకు ఆ వణుకు చర్చిలో, సూటులో, అధికారస్థానంలో, కూర్చొని వుంది.

ఆనందంవైపు చూస్తుంటే ఏసురాంలో వణుకు పెరుగుతూవుంది.

ఎటూ చూడకుండా, నిశ్చలంగా, ఫాదరీ వైపు చూస్తూ, ప్రసంగం వింటూ ఆనందంగా వున్నాడు.

చర్చిలో ఆవులింతలు ఎక్కువయ్యాయి.

ప్రసంగం ఆపమని ఏసురాం కళ్ళింకా చెప్పలేదు.

ఆ కళ్ళు ఆనందాన్ని మార్చిమార్చి చూస్తున్నాయి.

పిల్లలు చాలామంది చర్చి వెలుపలికి వచ్చారు.

యువకులు స్కూల్స్, కాలేజెస్ కబుర్లు చెప్పు కొంటున్నారు.

చిన్న చిన్న ఉద్యోగస్థులు, సినిమా సంగతులు మాట్లాడు కొంటున్నారు. పెద్దవాళ్ళు మౌనంగా కూర్చోవడంవల్ల నిద్రపడుతూ వుంటే తూలుతూ మేలు కొంటూవున్నారు.

చర్చిలో జనం అశాంతితో కదులుతుంటే ఫాదరీ ప్రసంగం ఆపేశాడు.

అదికూడా తెలియని ఏసురాం గుండెను వణుకు గృహంలోనే గస్తీ తిరుగ నిస్తున్నాడు.

ఫాదరీ పసివాళ్ళకు పేర్లు పెడుతున్నాడు.

ఆనందం కళ్ళు చెమ్మగిల్లాయి.

ఈ క్రైస్తవ జీవితాలు ఎలాసాగుతాయో!

మునుపటి లాగానా?

మెరుగ్గానా?

తరుగ్గానా?

ఆనందం కళ్ళుతుడుచు కొన్నాడు.

ఆనందం కళ్ళు తుడుచు కొంటుంటే ఏసురాం తనబేంకు దివాళా తీసినట్లు బాధ పడ్డాడు.

"సంతోషముతో నిచ్చెడు వారలనెంతో దేవుడు ప్రేమించున్" పాట ప్రారంభమయింది.

చందా పట్టేసంచులున్న కర్రలు పట్టుకొని ఫాదర్ ముందుకు వచ్చాడు.

నలుగురు చర్చి పెద్దలు లేచి నిలబడ్డారు.

ఆనందం కూడా లేచాడు.

నలుగురూ ముందుకు వెళ్ళారు. ఆనందం కూడా వెళ్ళాడు.

నాలుగే చందా సంచులు ఐదుగురు పెద్దలు. అందులో ఆనందం యువకుడు.

క్రైస్తవ భక్తులు వేసే చందావసూలు చేయడానికి చర్చి పెద్దలు సిద్ధమవుతున్నారు.

అదొక గౌరవం! హోదా!

ఎప్పుడయినా, ఏ పెద్ద అయినా రాకపోతే తరువాత వాళ్ళు వసూలు చేస్తారు.

కానీ ఏకాత్త మనిషో ఆపని చేయటానికి వీలులేదు.

'ఎవరు నీవు?'

ఏసురాం అడిగాడు. ఇదే ప్రశ్న నిన్నటినుంచి అతడి తలకాయకు కన్నం వేస్తూఉంది.

'ఈ మిషన్ క్రైస్తవుణ్ణి!' ఆనందం జవాబు.

'ఈ చర్చిలో!'

'మీవాణ్ణి'

'అంటే' ఏసురాం రెట్టించాడు.

''మీవారసుణ్ణి'' ఆనందం నెమ్మదిగా చెప్పాడు.

ఏసురాం వినలేక పోయాడు.

చందాసంచి లాక్కున్నాడు.

ఆనందం వదల్లేదు.

బలంగా లాగి, పడబోయి, నిలదొక్కుకొని, చేయి ఎత్తి, చాచి చెంపమీద కొట్టాడు.

ఆనందం ఆనందంగా నవ్వాడు.

'ఒక చెంపమీద కొడితే, రెండో చెంప చూపమని ఏసుప్రభువు చెప్పాడు' అన్నాడు.

రెండో చెంప ఫెళ్ళుమంది.

చర్చి అంతా అల్లకల్లోలంగా అయిపోయింది.

'ఇప్పుడు?' ఏసురాం ప్రశ్నించాడు.

'ఎప్పుడూ రెండో చెంప ఖాళీగా వుంటుంది'.

ఏసురాం వినలేకపోయాడు. వినబడిం తర్వాత నిలబడలేకపోయాడు. ఊగిపోయాడు. చేతులూ ఊగిపోతున్నాయి. రెండూ లేచాయి. ఒకేసారి ఆనందం చెంపలు ఫెళ్ళుమన్నాయి.

ఆనందం సంతోషంగా నవ్వాడు. కళ్ళలో నీళ్ళు !

'ఇప్పుడ్రా' ఏసురాం పిచ్చివాడయిపోతున్నాడు.

'రెండు చెంపలూ ఖాళీగా వున్నాయి'.

జనం ముందుకు వచ్చారు.

''ఎవరు నువ్వు? ఎవరితడు? ఏమయింది? ఎందుకు కొట్లాట ?'' గోల! అరుపులు! రద్దీ! తోసుకుంటున్నారు.

''ఉంటాయి,'' ఉంటాయి, ఏసురాం అరుస్తున్నాడు. 'దరిద్రపు వెధవా !' తిడుతున్నాడు. 'నా మీదికి వస్తావంటరా' కోప పడుతున్నాడు.

మళ్ళీ కొట్టబోయాడు.

ఆనందం రెండు చేతులూ పట్టుకొన్నాడు. చందా సంచి, కర్ర నేలమీద పడింది.

'నా చెంపలకేం ఫర్వాలేదు. నీ చేతులకే నొప్పి !'

ఈ మాటలు అసలు భరించలేకపోయాడు.

క్రింద పడ్డ చందా సంచి కర్ర తీసుకొని చాచి నెత్తిమీద ఒక్కటే దెబ్బ కొట్టాడు.

తల చిట్లింది. రక్తం చింది చందా సంచిలో పడింది.

ఆనందం ఏమీ అనలేదు. ఏడవలేదు.

ఎవరో వచ్చి అతన్ని పట్టుకొన్నారు. హాస్పటల్ కి పోదామన్నారు.

ఆనందం వద్దన్నాడు.

ఏసురాంని ఎవరో పట్టుకొన్నారు. కూర్చోబెట్టారు. 'తప్పు' అన్నారు. 'మంచి పనిచేశావు' అన్నారు. 'ఈ వయస్సులో కోపం రాకూడ'దన్నారు.

ఏసురాం 'చందాపట్టండి' అన్నాడు. చందా పడుతున్నారు.

'దశమ భాగము లెల్లా దేవునివీ ధారాళము నీయ సమకూడుడీ'.

చిల్లర, రూపాయలు, రెళ్ళు, అయిదులు, పదులు నోట్లు చందా సంచుల్లో పడుతున్నాయి.

చర్చి అనే సంచిలో ఆనందం రక్తం చందా పడుతూనేవుంది

'పదోవంతు'.

పాడుతూ పాడుతూ ఫాదర్ 'ఏసుప్రభూ! ఈ యువకుణ్ణి రక్షించు! నీ సిలువలో నీ సేవలో వాడుకో!' ప్రార్థించాడు.

చర్చిలో జనం మౌనంగా యువకుడి ఆరోగ్యం కోరుకుంటున్నారు.

చందా పట్టటం అయిపోయింది. ప్రార్థన చేస్తున్నాడు ఫాదర్. అందరూ తలలు వంచుకొన్నారు.

ప్రార్థన ముగిసి చూస్తే ఆనందం అక్కడ లేదు.

ఏసురాం ముఖంనిండా ఆనందం.

ఆనందం వెలుపల ఉన్నాడు.

అందరికీ క్రిస్మస్ శుభాకాంక్షలు చెబుతున్నాడు.

పేరు చెప్పటం తప్ప, ఊరు చెప్పటంలేదు.

రక్తం తుడుస్తుంటే వద్దనటం లేదు.

జాలి పడుతుంటే కాదనటంలేదు.

తాను మాత్రం క్రిస్మస్ శుభాకాంక్షలు చెబుతూనే వున్నాడు.

చేతులు పట్టుకొంటున్నాడు.

షేక్‌హాండ్స్ ఇస్తున్నాడు.

బొంగరంలాగా, బంతిలాగా, చుక్కలాగా, సూర్యుడులాగా, భూగోళం లాగా తిరుగుతున్నాడు.

ఏసురాం వెలుపలికి వస్తుంటే ఎదురుగాపోయి చేయి పట్టుకొని, చాలనంచేసి నమస్కరించాడు.

జనం బిత్తరపోయి చూస్తున్నారు.

ఏసురాం చేయి విసురుగా లాక్కున్నాడు.

గిర్రున వెనక్కు తిరిగాడు.

పోతూ పోతూ ఆగి, మళ్ళీ వెనుతిరిగి ఆనందంవైపు చూశాడు.

ఏసురాం వణకటంలేదు.

కుడిచేయి ఎత్తి ఆనందం తలమీద పగిలినచోట పెట్టాడు. తడిమాడు. వణికాడు.

ఏసురాం కళ్ళు ఎక్కడో చూస్తున్నాయి. కళ్ళలో నీళ్ళు.

చర్చిలోంచి అందరూ వచ్చేశారు.

'వస్తున్నా ప్రభూ!' ఆనందం అరుచుకొంటూ చర్చి గేటు వైపు పోయాడు. అక్కడే ఆగి "ఏసుప్రభూ! మళ్ళీ పుట్టావా?" అన్నాడు.

ఆనందం ఎదురుగా ఎవరూ లేరు.

"చర్చికి వచ్చావా?"

సమాధానం లేదు.

"చర్చి లోంచి ఈ రోజు వెలుపలికి వస్తున్నావు కాబట్టి ఏసుప్రభూ! నీకు నా క్రిస్మస్ శుభాకాంక్షలు".

ఆనందం కరచాలనం చేస్తున్నాడు.

ఎదురుగా ఎవరూ కనిపించటం లేదు

చర్చి గంటలు మోగుతున్నాయి.

# మల్లె మొగ్గ

ఏప్రిల్ నెల సాయంకాలం ఎండలో గడియారం స్తంభం కడిగిన ముత్యంలా మెరుస్తూ వుంది. రోజంతా చెమట వెళ్ళగక్కిన పగలు సాయంత్రం చల్లని కృష్ణ గాలి తింటూ వుంది. వాలిపోయే పొద్దుబొట్టులో ఆకాశం కొత్త పెళ్ళి కూతురులా సిగ్గుపడుతూ బుగ్గల్లో కెంపులు నింపుకొంది.

పొద్దు వాలుతున్నప్పుడు రోడ్డు పరుగు పందెంలో ఆటగాడులా రొప్పుతూ వుంది. గడియారం స్తంభం నిమ్మకు నీరెత్తినట్లుగా చిద్విలాసంగా నాలుగు ప్రక్కలా చూస్తూ నవ్వుతూ వుంది. దాని ముళ్ళు ఎండలో ఎంత తొందరగా నడిచాయో ఇప్పుడూ ఇంతే. ఎప్పుడూ ఇంతే. యుగయుగాల నుంచి ఈముళ్ళు ఇలాగే తిరుగుతున్నాయి. తొందరలేదు. ఆలస్యంలేదు. చెడా లేదు. బాగు పడా లేదు.

పట్టణం నడిబొడ్డులో చుట్టూ కావలసిన వన్నీ అమ్ముడు పోతున్న చోట, అన్నీ డబ్బుకు అందుబాటులో ఉన్న చోట నిస్సహాయంగా ఉన్న గడియారం స్తంభం తలనీడ నేలమీద పడుతున్న చోట గడియారం శిరస్సు నుంచి జారిపడి ఘనీభవించిన కాలపు తునకలాగా కూర్చుంది పూలపిల్ల కుసుమ.

క్షణక్షణానికి తనమీద నుంచి పెరిగి పోతున్న గడియారం స్తంభం నీడను చూస్తూ కూర్చున్న కుసుమ ముందు చెక్కపెట్టి పైన వెదురు తడక కట్టుకొన్న చీరమీద గుమ్మున తల దిమ్మెక్కించే మల్లెల మత్తువాసన కుప్పలాగా వుంది.

కడుతున్న దండ కడుతూ వుండగానే అమ్ముడు పోతూ వుంది. కుసుమ తల ఎత్తకుండానే తడి చేతులతో పూలకు దారం హారంగా వేస్తూంటే అవి ఆనంద బాష్పాలుగా రాలుతున్నాయి. రాలి పడ్డ నీటి బొట్టు నేలంత తడుపుతూ వుంటే రోజంతా ఎండ వేడిమికి వళ్ళు మండిపోయిన చేతులు చెక్కపెట్టె ప్రక్క సేద తీర్చుకొంటున్నాయి.

కుసుమ పూలు తాకుతుంటే దండ కడుతుంటే కవి కందపద్యం అల్లుతున్నట్లుంది. బాల్యం పొరలు పూర్తిగా రాలిపోని చేయి మొగ్గలాగ వుంది. దారమున్న చేయీ పూవూ అన్యోన్యంగా అవినాభావ సంబంధంగా కలగలుపుగా కలసిపోయి సాదా రంగులో తెల్లగా మరకలుగా కనిపిస్తున్నాయి.

పూలు కావలసిన వాళ్ళు పూలు, దండ కావలసిన వాళ్ళు దండ, తీసుకు పోతున్నారు

మగవాళ్ళు, ఆడవాళ్ళు, పసివాళ్ళు, పడచువాళ్ళు, ముసలివాళ్ళు, పనివాళ్ళు ప్యూనులు, దొరలు, దొరసానులు తొందరలో మందలింపుల్లో పూలకు వస్తారు. పుచ్చుకుపోతారు.

సైకిళ్ళు, రిక్షాలు, కార్లు ఏం వచ్చినా కుసుమ దగ్గరకు వచ్చేవి కాళ్ళు. పూలు తీసుకుపోయేవి చేతులు. కుసుమకు మనుషులంటే కాళ్ళు చేతులు అంతే!

సంఘంలో వాళ్ళ స్థానం ఏమిటో, జీవితంలో వాళ్ళ స్థితి ఏమిటో. ఆర్థికంగా వాళ్ళ అంతస్తు ఏమిటో, కుసుమకు తెలియదు. కాని వాళ్ళు ఆనందంగా వస్తారు ఆనందంగా వెళతారు. వాళ్ళు పూలు తీసుకుపోతున్నప్పుడు పొందే ఆనందం డబ్బును బట్టి కానీ, పూల మొత్తాన్ని బట్టి కానీ ఉండదు. ఒక్క పూవూ ఆనందమే! పూలమాలా ఆనందమే!

ఉరవడి తగ్గి ఊపిరి పీల్చుకొంటున్నప్పుడు కుసుమ కళ్ళ ముందు రెండు కాళ్ళు నిలబడివున్నాయి తనకు అవి బాగా పరిచయం ఎన్నిసార్లో చూచింది. ఆ కాళ్ళు బూట్లు లేకుండా రావు ఆ బూట్లు తనకు బాగా గుర్తు. అప్పుడే పాలిష్ చేసినట్లు అవి మెరుస్తూ వుంటాయి. ఉదయం చేసిన పాలిష్ సాయంకాలం వరకు అలాగే వుంటుంది. ఆ బూట్లకేకాదు, ఆ కాళ్ళకీ దుమ్ము అంటుకోదు. ఆ మనిషికీ మనసుకీ దుమ్ము అంటుకోదు.

ఆబూట్ల సొంతదారు సుందరరావు. తాలూకా ఆఫీసులో రెండేళ్ళ నుంచి గుమస్తా! ఆఫీసు నుంచి పోతూ ఆరు గంటలకు అంగడికి వస్తాడు. పావలా పూలు తీసుకొంటాడు.

సుందరరావు సాధారణంగా కుసుమతో మాట్లాడడు. పర్సు జేబులో పెట్టుకొన్నంత భద్రంగా పావలా తడిక మీద పెడుతాడు. కుసుమ చెండు ఇస్తుంది. పసిపాప చెక్కిళ్ళు తాకినట్లు పూలచెండ అందుకొంటాడు. రోడ్డుమీద మానవ సముద్రంలో మరో బొట్టుగా కలసిపోతాడు.

ఆడవాళ్ళ మాట కాదు, మగవాళ్ళ పూలు బేరం చేస్తుంటే కుసుమకు కోపం వస్తుంది. పేదవాని కోపం ఆ బేరగాళ్ళను, అంగడి చుట్టూ తిరిగే చీమలను చూస్తుంటే చీమల మీద ప్రేమ కలుగుతుంది. బేరం ఆడకపోవటమేకాదు, మాట్లాడక పోవటం, ఆతని ముఖం చూడటానికి ఆమెకు అవకాశం ఇచ్చింది. ఆ ముఖంలో పూల పరిమళం వుంది.

ఆ రోజు కూడా పూల పొట్లం చేతికిస్తూ ముఖంలోకి చూచింది. ఆ రోజు ఆమె గుండెలు జివజివ లాడాయి. గడియారం స్తంభం పక్కకు ఒరిగినట్టయింది. సుందరరావు ఆమె ముఖంలోకి చూశాడు !

వెన్నెల తరంగాలు రాశి పోసినట్లు చెక్కిళ్ళు, చీకటిలో దివిటీలు లాగ కళ్ళు, కాగే పాల మీద మీగడ కదిలినట్టు ముక్కుగోళ్ళు.

మళ్ళీ చూశాడు !

విశాలమైన పాల రాతి పలక మీద నల్లని పాము పిల్లలు ఆడుకొన్నట్లు ముంగురులు.

మలినం లేని నుదురు !

తడి ముంజేతితో ముంగురులు పైకి నెట్టుకొంటే నేతి బొట్టు పడ్డ పింగాణీ పాత్రలాగా నుదురు !

శూన్యంగా నుదురు !

కనిపించని వెంట్రుకలపాదుకూ పాదుకూ మధ్య ఉబ్బెత్తుగా ఉన్న చర్మం - నూనెపడి మెరిసే గాజు పలకలాగా వుండి మెడ చుట్టూ పొటమరిస్తున్న యౌవనపు అల అలతిగా తల వూపుతుంది.

బోసిగా మెడ! ఒత్తుగా నల్లగా వ్యాపించిన జుత్తు, అమావాస్య నల్లదనంతో ఆవులించి జడగా ప్రాకి ప్రాచీన దేవాలయ ప్రాభవం చూపటానికి బాట వేసింది.

కుసుమను, కాళీగా తల, చూస్తున్న సుందరరావు కళ్ళలో మన్మథుడు కాలిన నాటి బూడిద లేచివచ్చి పడితే కళ్ళు నులుంకొన్నాడు.

నీళ్ళు తిరిగాయి.

కుసుమ సుందరరావు కళ్ళలో నీటిచెమ్మ చూడలేక పోతున్నప్పుడు పూల పొట్లం పుచ్చుకొన్న సుందరరావు వెళ్ళిపోయాడు.

ఎప్పుడూ లేంది, ఆ రోజు సుందరరావు అలా చూడటం కుసుమ తట్టుకో లేక పోయింది. వెనక్కు తిరిగైనా చూడకుండా వెళ్ళిపోతున్న అతన్ని చూడ కుండానూ ఉండలేక పోయింది.

కుసుమ పూలు కొంటుంది. కుప్ప పోస్తుంది. అమ్ముతుంది. కానీ తనకు మాత్రం పూలులేవు.

రోడ్డున వచ్చే పోయే ఆడవాళ్ళు తమ తలల్ని పూలతో అలంకరించి గౌరవిస్తే చూసి కళ్ళనీళ్ళు పెట్టుకొంటుంది. మరుక్షణంలో నీళ్ళు తుడుచుకొంటుంది. నవ్వుతుంది. పూలు తనకు లేకపోవటం దుఃఖం, ఇతరుల కుండటం ఆనందం!

తన తలలోకి పూలు తేవలసిన మనిషి రాకుండా పోయాడు. తనను పదేళ్ళ పసిపిల్లగా వున్నప్పుడు పెళ్ళాడిన మనిషి పదేళ్ళనుంచి రాలేదు. రాడని కూడా తెలిసిపోయింది.

కూలీ నాలీతో జీవించే అమ్మానాన్నలకు గారాలకూతురు కుసుమ. సంవత్సరం తేడాతో అమ్మానాన్నా హరీఅంటే దిగులుతో కృంగి పోతున్నప్పుడే మిలటరీలో ఉన్న భర్త యుద్ధంలో చనిపోయాడన్న వార్త, కాలిపోయిన ఇంటి మీద పిడుగు పడినట్లు వినిపించింది.

లోకాన్ని తేరిపార చూడక ముందే లోకంతనని నిఘాపెట్టి చూచింది. ఎలా వుంటాడో తెలియని మనిషికోసం, ఆమనిషివి అని తన మెడలోవున్న తాళి, నుదుట వున్న బొట్టు, తలలోవున్న పూలు, చేతులకున్న గాజులు లోకం తీసుకు పోయింది.

పుట్టిందగ్గర్నుంచి పూలంటే ప్రాణమిచ్చే కుసుమ, తన పూలు లోకం తీసుకొన్న దగ్గర్నుంచి లోకానికి పూలు ఇవ్వటం కోసం ఇంకా విచ్చుకోని మొగ్గ లాంటి కుసుమ గడియారం స్తంభం దగ్గర దానినీడలాగా కూర్చుంటూ వుంది.

పూలు అమ్ముకోవటంలో ఒక తృప్తి ఉంది. ఒక ఆనందం ఉంది. ఒక జీవనోపాధి ఉంది. ఎడారిలో ఒయాసిస్సులాగా రోడ్డుమీద అందీ అందని పూల వాసన.

పూలు కడుతూవుంది. జనం వస్తున్నారు. కొంటున్నారు. పోతున్నారు. భగవంతుని సృష్టితన చేతుల మీదగా ఉపయోగం పొందుతూ వుంటే ఆపూలు తనే సృష్టించినట్లు తృప్తి పొందుతూవుంది కుసుమ.

పూలుకొనేవాళ్ళు అనేమాట వినిపిస్తే తనగుండెలు కలుక్కుమంటే అన వచ్చుకానీ, తలనిండా పూలుపెట్టుకొన్న వాళ్ళనుచూస్తే కనురెప్పల కింద చీకటి క్షణకాలం కదిలితే కదలవచ్చు కాని ఆమె సాధారణంగా ఆనందిస్తుంది. మామూలు మనిషిగా సంతోషిస్తుంది.

పూలు మూట కట్టి తడిక గోడకానించి చెక్కపెట్టె నిలబెట్టి అంగడి వూడ్చి ఇంటికి పోయి, అన్నం వండుకొని, తిని పడుకోబోయేటప్పుడు తనని అమ్మలాగా అప్యాయంగా చూచుకొనే పక్కింటి పెద్దమ్మ సినిమాకు రమ్మంటే పోయిండె కుసుమ.

సినిమాకి రావటం మంచిదే అయింది.

మొదటాట చూచి సుందరరావు బైటికి వస్తున్నాడు. ప్రక్కనభార్య, ఎంత అందంగా వుంది. ఆమె ఎంత అదృష్టవంతురాలు. ఆ చేయినీడ అండ తోడు ఆమెకెంతో బలం.

ఆమె తలలో పూల మాల ఉంది. అది ఆ రోజు సాయంకాలం తను కట్టి ఇచ్చిందే. అది తన దగ్గర్నుంచే వెళ్ళింది.

ఆ మల్లెలు ఎంత సువాసన వెదజల్లు తున్నాయో! ఎంత సువాసన!

ఆ మల్లెలు ఎక్కడ పుడితేనేం, తన ఇంటికి వచ్చాయి. తన చేతులతో మాల కట్టింది. ఆ సువాసన తన చేతుల మీదుగా పోయింది. తాను మాలలో ఉంచిన పెంచిన పోషించిన సువాసన. తన సువాసన, ఆమె తల లోంచి వెలు వడుతూ వుంది.

అతనితోపాటు ఆమె వెళ్ళిపోయింది. అయితే సువాసన ఉంది. సన్నగా, పల్చగా, లీలగా, కోమలంగా, సుగంధంగా వస్తూ వుంది. హాలు చుట్టూ, వీధిచుట్టూ ఊరు చుట్టూ, దేశం చుట్టూ, సువాసన, ఇవాళ్టి సువాసన, నిన్నటిది, మొన్నటిది, ప్రాచీన సువాసన, ఇవాళ సినిమా హాలులోంచి వెలుపలికి వచ్చింది. పోయింది.

కుసుమ గుండె ఆ సువాసన బరువుకు ఉక్కిరి బిక్కిరి అయి ఊగిసలాడి పోయంది. నిలబడలేక పోయింది. సినిమా చూస్తున్నంత సేపూ ఆ గంధం ఈ ముక్కును గిల్లుతూనే ఉంది. సువాసన ఇంకా పుడుతూనే వుంది. ఈ అనుభవం కొత్తది. ఆ సువాసన ఇంటికి వచ్చినా వదిలిపెట్టలేదు.

ఆ సువాసన ఆ రోజు నుంచి ఆమె అంతస్స్వాయువుల్లో ఏదో మూల ఒక గది అద్దెకు తీసుకొంది. బైటికిరాదు. వదలిపెట్టిపోదు. వళ్ళంతా లారీ పోతుంటే ఊగే బ్రిడ్జిలాగా వూపుతూ ఉంటుంది.

మరునాడు సుందరరావు పూలు కొనటానికి వచ్చాడు. పావలా ఇచ్చాడు. పూల పొట్లం ఇచ్చింది.

మాట్లాడలేదు. ముఖంలోకి చూడలేదు.

చూస్తాడని ఆశించింది. ఆశగా చూచింది. పోతున్న సుందరరావును చూచింది. తిరుగుతున్న గడియారం ముళ్ళు చూచింది.

ఆ తర్వాత రోజూ వచ్చాడు. పావలా ఇచ్చాడు.

కుసుమ పూలు పొట్లం కట్టింది.

ఇవ్వలేదు.

ముఖంలోకి చూచింది.

తలవంచుకొని చేయి చాపి నిలబడ్డాడు.

పొట్లం చేతిలో పెట్టింది. తన చేయి తీయలేదు.

పట్టుకొన్నాడు. చేతిలోకి రాలేదు.

ఆమె వదల్లేదు. అతను అందుకోలేదు.

రెండు గట్లు మీద ఆనివున్న వంతెనలాగా ఇద్దరి చేతుల్లో పూలపొట్లం.

సుందరరావు ఆమె ముఖంలోకి చూడలేదు. పొట్లం వదల్లేదు. పోనీ లాక్కో లేదు. మరి మాట్లాడలేదు.

ఆమె నిరాశగా చూచింది. నెమ్మదిగా మౌనంగా గొంతులో నీటి చుక్క జారినట్లు వదిలేసింది.

సుందరరావు నిలబడకుండా వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

అతను మొన్న తన ముఖంలోకి చూడటం ఏదో పొరపాటువల్ల జరిగిన చేష్ట! పొరపాటున తీసిన కిటికిలోంచి వెలుగు జాడలా వెలుపలికి వచ్చిన చూపు! మేరమీరని సముద్రం ఒడ్డు మీదికి తాత్కాలికంగా ఎగిరి పడ్డ అల! వినయం కోసం అనాలోచితంగా మెరిసిన మెరుపు మహాకవి పద్యంలో గణభంగంగా అనవసరంగా పడ్డ పదం.

ఆ పైన రెండురోజులు చూచింతర్వాత సుందరరావు కళ్ళలోంచి ఆ చూపును మళ్ళీ చూడలేనని నిశ్చయించుకొంది కుసుమ.

రోజులు గడుస్తున్నాయి.

తోటలోంచి పూలు వస్తున్నాయి.

తన అంగడిలో దండలవుతున్నాయి. చెండులవుతున్నాయి. మాలలవుతున్నాయి.

ఊరంతా వాసన వెదజల్లుతున్నాయి. విరజిమ్ముతున్నాయి. ఎన్ని తీగలో! ఎన్ని పూవులో! ఎన్ని మొగ్గలో!

మొగ్గలు, పూవులు నలగిపోయి, తొలగిపోయి, మళ్ళీ మొగ్గలు. మళ్ళీ పువ్వులు.

ఈ తీగలు సాగుతున్నాయి. ఈ మొగ్గలు తొడుగుతున్నాయి. ఈ పూవులు నలుగుతున్నాయి.

తీగలు మొగ్గలు, మొగ్గలు పువ్వులు పువ్వులు. నలిగితే సాఫల్యం.

రెణ్ణెళ్ల తర్వాత ఒకరోజు వచ్చిన సుందరరావు పావలా ఇవ్వలేదు. రూపాయి ఇచ్చాడు.

కుసుమ పావలా పూల పొట్లం కట్టి ఇచ్చింది.

'కాదు'

అతని గొంతు అంత మధురంగా ఉండటం ఆమెకు తెలియదు.

ముఖంలోకి చూచింది.

'రూపాయివి!'

ఆమె గెండె పులకరించిది. శరీరం ఉప్పొంగి పోయింది. ఆనందం పట్టలేక పోయింది.

'రూపాయివా!'

'ఆ'

'అన్నిపూలతో'

'ఆ'

'చెండా? పూలా?'

'చెండు'

ఇంతకాలం పావలా పూలు తీసుకుపోయే సుందరరావు ఆరోజు రూపాయి పూవులు తీసుకు పోతుంటే కుసుమ ఆనందం పట్టలేకపోయింది. ఆగలేకపోయింది. చూడలేకపోయింది. అడక్కుండా ఉండలేక పోయింది.

'మీకేనా ?'

సుందరరావు మాట్లాడలేదు.

'మీకేనా'

జవాబులేదు.

అతను బొమ్మయి పోయాడు. కదల్లేదు. మెదల్లేదు.

పొంగిన అల సముద్రంలోకే కృంగిపోయినట్లు కుసుమ చప్పబడిపోయింది. లేచిన జ్వాల పోయిలోకి కూరుకు పోయినట్లు కుసుమ కూర్చుండి పోయింది. ఆరిన దీపం లాగా నిరాశా ఆవిరులు పొగలు వెళ్ళగక్కింది.

రూపాయి పూలచెండు పొట్లం గట్టింది వెన్నముద్ద మజ్జిగలోంచి ఎత్తినట్లు ఎత్తింది. ఒద్దికగా అతని చేతుల్లో ఉంచింది. పూవు నుదుట బొట్టు పెట్టినట్లు రూపాయి దానిమీద ఉంచింది

సుందరరావు తల ఎత్తలేదు. వెనుతిరిగి చూడలేదు

'రేపు రూపాయివా, పావలావా పూలు' అనుకొంది.

సుందరరావు రేపు అనబడే రోజు రాలేదు. చాలా రేపులు కనబడలేదు. నెల అయినా సుందరరావు జాడలేదు.

అందుకు కారణం ఎంతో ఆలోచించింది. ఎంతో ఊహించింది. అర్థంకాక వూరుకొంది.

రెణ్ణెల్ల దాకా సుందరరావు కనబళ్ళేదు. ఆ రోజు ఎనిమిది గంటలకు ఆఫీసునుంచి ఇంటికి పోతున్నాడు. అంగడి మూద్దామనుకొంటున్న కుసుమ అతన్ని చూచి విలవిలలాడి పోయింది.

గడ్డం పెరిగింది. బట్టలు నలిగాయి. బూటులేదు.

చెప్పులు అరిగిపోయాయి.

ఆరిన దీపంలోంచి వచ్చే వికారపు పొగలాగా విచ్చలవిడిగా నడుస్తున్నాడు.

కుసుమ లేచి రోడ్డు కడ్డంగా పరుగెత్తింది.

'మీరు?' అంది.

'నేను'

ఈ గొంతు ఆ గొంతు కాదు.

ముఖంలోకి చూచింది.

విసయంగా చూశాడు.

ఈ చూపు ఆ చూపు కాదు.

మనిషిని నిలువెల్లా చూసింది.

తలవంచుకొన్నాడు.

కుసుమ కళ్ళనిండా నీళ్ళు నిండాయి. బావురుమని ఏడవాలనిపించింది.

'మీకేమయింది?' అంది.

జవాబు లేదు.

రోడ్డు రద్దీగా వుంది. 'రండి' అంది. చేయిపట్టుకొంది. ముఖంలోకి, కళ్ళలోకి, మెదడులోకి తిన్నగా చూశాడు. ఆమె ముఖం దించుకొంది. చేయి వదల్లేదు.

'ఏమయింది?'

అంగడి దగ్గరకు వచ్చారు. అతనేమీ మాట్లడలేదు.

రూపాయి పూలు పొట్లం కట్టింది. చేతిలో పెట్టింది.

అతను నవ్వాడు.

అది నవ్వు కాదు! శబ్దం. ఏడ్పుకాదు! ఏదోధ్వని!

పూల పొట్లం నెమ్మదిగా జారవిడిచాడు.

'ఏం?'

'అవసరం లేదు' అన్నాడు.

మాట్లాడాడో ఏడ్చాడో ఏమీ తెలియలేదు.

'ఎందుకవసరం లేదు?'

'ఆమె చనిపోయింది'

కుసుమ తల తిరిగిపోయింది. భూమి క్రుంగిపోతున్నట్లనిపించింది.

'ఆ రోజు రెణ్ణెల్లక్రితం రూపాయి పూలు' తీసుకుపోయేసరికి చనిపోయి, మాట్లాడకుండా ఆగిపోయాడు.

కుసుమ కూలిన కోటగోడలాగా కుప్పగా పడిపోయింది.

ఆపైన వారం రోజులైనా సుందరరావు కనబడలేదు.

అప్పుడప్పుడు రోడ్డున పోతూ వస్తూ ఆమె అంగడివైపు చూచేవాడు.

అది చూపు కాదు.

యథాలాపంగా ఎప్పుడైనా 'బాగున్నావా?' అనేవాడు.

అది మాటకాదు.

పిచ్చివాలకం! పాతికేళ్ళకే వృద్ధాప్యం.

కాళ్ళీడ్చుకొంటూ వెళ్ళేవాడు బాగా పొద్దుపోయిందాకా ఆఫీసులో ఉండే వాడు. రాత్రి తొమ్మిదికి పోతుంటే ఒక రోజు చూచింది. పలకరించింది.

'మీ ఆరోగ్యం ఎలా వుంది?'

'ఇలా.'

నిద్ర కళ్ళతో బదులు చెప్పాడు.

ఒక రోజు ఆరు గంటలకే ఆఫీసు వదిలిపోతున్నాడు.

ఆమె పేగుల్లో ఎక్కడో నవ్వు తొలకరి చినుకులాగా జారింది. మళ్ళి నాలుగు రోజులకు కనిపించాడు. గడ్డం గీసుకొన్నాడు. ఇస్త్రీబట్టలు వేసుకొన్నాడు. సినిమాకి పోతున్నాడు. మునుపటి మనిషి అయ్యాడు.

తుంచని మల్లెమొగ్గ పువ్వై చెట్టుమీద వాడిపోయి రాలి పడిపోయినట్లు ఒక కన్నీటిబొట్టు కన్ను అంతా లేగదూడలాగా ఉరుకులు పరుగులతో కలియ తిరిగి చూపును మసక చేసింది.

వస్తూ పోతూవున్నా సుందరరావు కంటి ఎదుట కనబడుతూ ఉన్నప్పటికీ అతనెవరో, తనెవ్వరో, ఏమీ సంబంధం లేదు.

ఉన్న సంబంధం పూలు.

అవి ఇప్పుడతనికి అవసరం లేదు.

పూలు తనకెప్పటికి లేవు.

పూలు లోకం కోసం తనదగ్గర వున్నాయి.

అతనికోసం కాదు.

ఆ రోజు జీతం వచ్చింది. పర్సు బరువుగా వుంది.

నెమ్మదిగా, బలంగా, గట్టిగా, విశ్వాసంతో వచ్చిన సుందరరావు కుసుమ ముందు, అంగడి ముందు, రోడ్డుమీద, గడియారం స్తంభం నీడలో, నిలబడ్డాడు.

చేతులు మెడ, నుదురు, తల మార్చి మార్చి కుసుమను చూస్తున్నాడు.

'ఏం?' అంది.

బదుల్లేదు.

సుందరరావు చూస్తున్నాడు.

ఆ చూపు ఎక్కడో ఎప్పుడో చూచినట్టు గుర్తు.

రోడ్డుమీద రద్దీ! గడియారం కదలిక ! మల్లెపూల సువాసన! ప్రాచీన సువాసన! శతాబ్దాల సువాసన!

పర్సు తీసి పూల పక్కనే పెట్టాడు.

'ఏం?' అంది.

'పూలు' అన్నాడు.

ఎంతకి?

'పర్సుకు.'

ఆమె గుండె ఆగినంత పని అయింది.

'ఏంది?' అంది.

'పూలు!' అన్నాడు.

ఒక్కసారి పూలకు ప్రాణం వచ్చి సుగంధం విడుస్తున్నట్టు సువాసన. ఆమె పూలు ఇవ్వలేదు.

సుందరావు దగ్గరకు వెళ్ళాడు. రెండు చేతులు పట్టుకొన్నాడు. వారించ లేదు. నిలబెట్టాడు. కాదనలేదు.

దోసెడు పూలచెండు తీసుకొన్నాడు. కుసుమ తూలిపోతూ వుంది. తల నిండా తురిమాడు. కళ్ళనిండా నీళ్ళు!

మల్లెమొగ్గ ఎక్కడో పుట్టింది. ఎక్కడో పెరిగింది. ఎవరో తుంచారు. ఎవరో తెచ్చారు. ఈ మాలలో నిలిచింది. ఈతలలో వెలసింది.

# బొమ్మలాట

కృష్ణమూర్తి వయస్సు నలభై అయిదు.

పెద్దతనం - భయం !

చిన్నతనం - ఆశ ! !

వార్ధక్యం ఊహించుకొంటే దిగులు !

యౌవనంపోగొట్టుకో కూడదని తాపత్రయం.

కాలం గడుస్తుంటే,

ఆశ తీరటం లేదు.

నిరాశ పెరుగుతూ ఉంది.

తెల్ల వెంట్రుకలు ! !

తలలో

నల్లరంగు !

మీసాలలో ! !

నల్లరంగు !

గడ్డంలో !

రోజూ షేవింగ్ !

తలనున్నగా దువ్వి.

మీసం నల్లగా చేసి.

గడ్డం మొటిక లేకుండా,

టిప్ టాప్‌గా

యువకుళ్ళా తయారవుతున్నాడు కృష్ణమూర్తి !

వైట్ పేంట్,

డిటో ష్లాక్,

పాయింటెడ్ షూ,

వాటర్ పాలిష్,

క్రూకట్ !

సైట్ ఉన్న ఐస్‌కి కూలింగ్ గ్లాసెస్.

అచ్చంగా,

యువకుళ్ళా అయిపోతున్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి! లెక్చరరు. తోటివాళ్ళతో ఎవరితోనూ, డిపార్టుమెంటులో ఎంతో అవసరం అయితే తప్ప, మాట్లాడ్డం లేదు.

వాళ్ళు ముసిలివాళ్ళు,

మాటలలో వార్ధక్యం,

చేతల్లో వార్ధక్యం,

సహించలేడు.

అందుకే మాట్లాడ్డం లేదు.

మాట్లాడుతాడు

యువకులతో,

డిపార్టుమెంటులో, కాలేజీలో క్రొత్తగా చేరిన లెక్చరర్సుతో, ట్యూటర్సుతో డిమాన్‌స్ట్రేటర్సుతో, విద్యార్థులతో, విద్యార్థినులతో,

బాగా మాట్లాడుతాడు.

ప్రిన్సిపాల్‌తో.

నో!

హెడ్‌తో.

నో!

అమ్మతో.

నో!

నాన్నతో.

నో!

ఒక్కటే మాట.
వృద్ధతరంతో మాట్లాడ్డు-నో!
యువతతో మాట్లాడుతాడు-యస్!
అంతేకాదు.
వృద్ధుల్ని సలహా అడగడు.
వెంట తిరగడు.
పట్టించుకోడు.
వృద్ధతరం బ్రతికిందని భావించడు.
యువకులతో
షికార్లకు పోతాడు.
కాళ్ళనొప్పి.
వాళ్ళుబాగా తిరుగుతారు.
ఎగురుతారు.
దూకుతారు.
తను చేయలేడు.
అయినా ప్రయత్నిస్తాడు.
హోటలులో
వాళ్ళు బాగాతింటారు.
తాగుతారు.
తినేస్తారు.
తొక్కేస్తారు.
లోపలికి కుక్కేస్తారు.
తను తినలేడు.
ఓపిక చూపుతాడు.
వారంరోజులు ఓపికగా జీర్ణంచేసుకొంటాడు.

కబుర్లతో
వాళ్ళు ఆడపిల్లల్ని గురించి,
ప్రేమల గురించి,
వివాహాల గురించి,
కట్న కానుకల గురించి,
ఆదర్శ ప్రేమల గురించి,
ఊహా లోకాల ఊహా ప్రేయసీమణుల శృంగార జీవితం గురించి,
లోకంలోని అనేక విషయాల గురించి,
సుందర స్వప్నాలు కంటుంటే,
ఆదమరచి పోయి,
వాళ్ళతో చేయి చేయి కలిపి,
కొంత ఊహ
కొంత వాస్తవం
నేర్పుగా మేళవించి,
యువకుడే అనిపించుకొన్నాడు కృష్ణమూర్తి,
ఒకప్పుడు
కృష్ణమూర్తి ముసలివాడు,
ఇంకోప్పుడు
యువకుళ్ళా ఉండాలను కొంటున్నవాడు.
మరోప్పుడు
యువకుణ్ణను కొంటున్నవాడు
వేరోప్పుడు
యువకుళ్ళా వున్నాడు.
ఇప్పుడు
యువకుడే అయిన వాడు,
కృష్ణమూర్తి యువకుడు, అచ్చంగా యువకుడు, స్వచ్ఛంగా యువకుడు.

ఒక యువకుడడిగాడు.

"మీకు పెళ్ళయిందా?"

కృష్ణమూర్తి నవ్వాడు.

"మా బంధువులమ్మాయి-అందంగా వుంటుంది. చూడకూడదూ!"

కృష్ణమూర్తి పరవశించి పోయాడు.

"మీ పెళ్ళికి మమ్మల్ని పిలవరా"?

కృష్ణమూర్తి మెలికలు తిరిగి పోయాడు.

అవును మరి,

అచ్చంగా యువకుడు కృష్ణమూర్తి.

ఈ రోజే !

'సినిమాకు పోదాం సిద్ధంగా ఉండని' శ్రీమతికి ఉదయం చెప్పి వచ్చాడు కృష్ణమూర్తి.

సాయంత్రం ఇంటికి వెళ్ళేసరికి,

కాఫీ హోటల్‌కీ, కనకయ్య పార్కుకీ,

కాకుంటే క్లబ్బుకీ, కనిపించే సినిమాకీ,

భర్త వెంట పోవటానికి

సిద్ధంగా వుంది

నలుగురు పిల్లల తల్లి,

నలభై రెండేళ్ళ శ్రీమతి !

మధ్యాహ్నం రాజమండ్రి నుంచి పెద్ద కూతురు, ఇద్దరు కూతుళ్ళతో దిగింది.

పెద్దదానికి నాలుగేళ్ళు.

చిన్నదానికి ఏణ్ణర్థం.

''బాగున్నావా?'' తండ్రి.

''ఆఁ!'' కూతురు.

''బైల్దేరూ పోదాం!'' భార్యతో.

"బట్టలు మార్చుకోరా!" తండ్రితో.

"ఉహు!" కూతురుతో.

"ఆయనిష్టం!" కూతురులో.

వసారాలో ఆ ప్రక్క పెద్దది, కూతురు కూతురు నాలుగేళ్ళది. బొమ్మను తీసుకొని

కృష్ణమూర్తి చూస్తున్నాడు, చేతుల్తో వూపుతూ, లాలిపాడి, ఎదురొమ్ము కానించుకొని జోకొడుతూ.

"ఏడవకమ్మా తాగు!" అంటూ

కృష్ణమూర్తి చూస్తున్నాడు, "తాగమ్మా! తాగు" పాప బొమ్మ పాపకు పాలిస్తూ వుంది.

బొమ్మ - పాప చూస్తున్నాడు.

పసితల్లి దగ్గరకు కృష్ణమూర్తి, వృద్ధ యువకుడు వెళ్ళాడు.

కళ్ళు గమ్మత్తుగా మూసి, బొమ్మ పాపకు పాలిస్తూ వుంది పాప.

# తరాల అంతరాలు

రామచంద్రయ్య ఐదు గంటలకే నిద్రలేచి కూర్చుంటేనే ఆశ్చర్యంగా ఉంటే అలంకరించుకొంటుంటే మరీ విచిత్రంగా ఉంది. అందుకే ఉండబట్టలేక అడగనే అడిగేశాడు సుందరం.

'ఏం నాన్నా ఇంత తొందర! ఎక్కడికి' ?

'మర్చిపోయావా ?'

'ఏమిటి ?'

'రవి వస్తున్నాడు కదా.'

సుందరం సంతోషానికి అవధుల్లేవు. తన తండ్రికి రవిపట్ల అంత ఆసక్తి ఉంటుందని సుందరం ఈ మధ్య అనుకోలేదు.

పదేళ్ళు అయి ఉంటుంది. ఇద్దరూ మాట్లాడుకోవటం మానేసి. కొట్టుకో లేదు. తిట్టుకోలేదు. వాదించుకొన్నారు. అంతే!

పిల్లలు బరితెగించిపోయారని తండ్రి మందలిస్తే, బానిసల బుద్ధి అని రవి గొణిగాడు. అంతే ఆ రోజు జరిగింది.

రవి మర్నాడు మామూలుగా 'తాతా! తాతా!' అంటూ పిలవక పోలేదు.

రామచంద్రయ్య ఉలకలేదు, పలకలేదు.

రవి 'తాతా' అని ఏడ్చాడు. బదులులేదు.

తాతామనవళ్ళు చాలా అన్యోన్యంగా ఉండేవాళ్ళు. తాతను చూడందే మన వడు ఉండేవాడు కాదు. మనవణ్ణి ఆటలు పట్టించందే తాతకు తోచేది కాదు. అట్లాంటిది వాళ్ళు మాట్లాడుకోవటం లేదంటే వింతే !

సుందరం తండ్రికీ కొడుక్కీ మధ్య రాయబారం చేయకపోలేదు. కానీ పూర్వపు మైత్రి కుదరలేదు.

రవి రెండేళ్ళు తాతతో మాట్లాడటం కుదరకపోయినా కావలసినవన్నీ చూశాడు. ఏం కావాలన్నా తెచ్చిపెట్టాడు. సినీమాకి కూడా ఒకసారి పోయి వచ్చారు. కానీ మాట్లాడుకోలేదు.

ఈ పదేళ్ళనుంచి రవి ఇంటిపట్టున లేడు. ఉద్యోగం బరువు బాధ్యతలవల్ల ఇంటికి రావటం అంతగా కుదిరేదికాదు. వచ్చినా ఎక్కువగా ఇంటిదగ్గర ఉండేవాడు కాదు.

ఈ మధ్య తన తండ్రికీ, తన కుమారుడికీ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభమయ్యాయి.

అలా ఉత్తరాలు మొదలయిన మొదటి రోజు రవి ఒకసారి ఇంటికి వచ్చాడు. రామచంద్రయ్య చూశాడు. నవ్వాడు. కానీ మాట్లాడలేదు.

'ఏం నాన్నా వాడితో మాట్లాడవు' అని సుందరం అడిగితే 'బానిసల బుద్ధి' అని సమాధానం చెప్పాడు రామచంద్రయ్య.

రామచంద్రయ్య పూర్వకాలం మనిషి. వయస్సు ఎనభై ఏళ్ళయినా ఉంటుంది. పుట్టింతేదీ ఏదీలేదు. ఎవరో రాసిపెట్టింది ఉంది. అది నమ్మితే ఎనభై కంటే ఎక్కువ వయస్సు.

రామచంద్రయ్య పాతకాలం మెట్రిక్యులేట్. ఇంగ్లీషు వాళ్ళ తల తినేట్లు ఇంగ్లీషు మాట్లాడే వాడనీ, ఇంగ్లీషు వాళ్ళు డిక్షనరీలు తిప్పి తిప్పి చూడవలసి వచ్చేట్లు ఇంగ్లీషు రాసే వాడని ప్రఖ్యాతి.

చేరటం తాలూకా ఆఫీసులో గుమాస్తాగా చేరాడు. కానీ, రిటైరు కావటం జిల్లా కలెక్టరుగా రిటైరు అయ్యాడు.

'ఈ కాలం ఎవడైనా ఇన్ని మెట్లు ఎక్కి ఇక్కడకు రాగలడా?' అని ఎప్పుడూ ప్రశ్నించే వాడు. వినేవాళ్ళకు విసుగు కూడా.

'నేను కలెక్టరుగా ఉన్న రోజుల్లో' అని ఈ ఇరవై ఏళ్ళలో ఎన్ని వేల సార్లు అని ఉంటాడో చెప్పటం కష్టం. కనీసం, సగటున రోజుకు పది సార్లు అయినా ఆ మాట అనటం, ఎదుటి వాళ్ళు వినటం తప్పనిసరి.

అందులో నిజం లేక పోలేదు. కష్టపడి పని చేసేవాడు. ఎదుటి వాళ్ళు బాగుంది అనే దాకా శ్రమించే వాడు. మొదట్లో సరిగా నిద్రపోయే వాడు-కూడా కాదు.

సుందరానికి తన బాల్యం బాగా గుర్తు.

సుందరం నిద్రలేవక ముందు రామచంద్రయ్య ఇల్లు వదలి వెళ్ళేవాడు. సుందరం రాత్రి నిద్రపోయిం తరువాత తండ్రి ఇంటికి తిరిగి వచ్చేవాడు.

ఇంట్లో కూడా రామచంద్రయ్య భార్యా పిల్లలతో మాట్లాడిన మాటలు రోజుకు పది ఉంటే గొప్ప.

తీరుబడి ఉండేది కాదు.

శ్రమించటంతో పాటు వినయ విధేయతలు పుష్కలంగా ఉండేవి.

తాసీలుదారు, డిప్టీకలెక్టరు, కలెక్టరు ఎవరయినా ఏరూలు అడిగినా తడుం కోకుండా చెప్పేవాడు.

కేంపుకు ఎప్పుడు రమ్మన్నా వెళ్ళేవాడు. ఏ ఊళ్ళో ఏం తిన్నా సర్దుకు పోయేవాడు. పని ఉంటే అన్నంలేదు. నిద్రలేదు.

తనతో గుమాస్తాగా చేరిన ఎవరూ కలెక్టరు కాలేదు. రిటైరు కాబోయే ముందు రెండేళ్ళు కలెక్టరుగా ఉన్నాడు. కారులో తిరిగాడు. జిల్లా అంతా తనిఖీ చేసేవాడు. రామచంద్రయ్య జమాబందీ చేయటం చూడవలసిన కళ.

తెల్లదొరలు పట్ల రామచంద్రయ్యకి అభిమానం ఎక్కువ. ఐ. ఏ. యస్. పాసయిన నల్లవాళ్ళు కూడా రామచంద్రయ్యకు తారసపడకపోలేదు, ఆయన సర్వీసులో. కాని నల్లవాళ్ళపట్ల ఆయనకు ప్రేమలేదు.

నల్లవాళ్ళంటే భారతీయులు. వీళ్ళకు క్రమశిక్షణలేదు. శ్రమపడరు. పనిచేయరు. సోమరులు అని తిట్టేవాడు.

ఇంగ్లీషు వాళ్ళంటే ఇంగ్లీషువాళ్ళే అనేవాడు. ఎక్కడ లేని అభిమానం.

ఈ అభిమానం వాళ్ళూ గౌరవించారు. జీతం పెంచారు. ఉద్యోగం పెంచారు. బాగా గౌరవించారు.

'తోటివాణ్ణి గౌరవించటం భారతీయులకు తెలుసా' అని రామచంద్రయ్య నిగ్గదీసి అడిగేవాడు.

'నాకు తెలుసు' అనేవాడు రవి.

'నీ మొహం' అనేవాడు తాత.

రామచంద్రయ్య జిల్లా బోర్డు స్కూలులో చదివాడు. మెట్రిక్యులేషన్ పాసయ్యాడు. గుమాస్తాగా చేరాడు. తండ్రి కట్టబెట్టిన సంబంధం కాదనలేదు. దుఃఖం లేకుండా సంసారం ఈదుకొచ్చాడు. సుందరం, ధనంజయం చక్కగా స్థిరపడ్డారు. ఇద్దరు కొడుకులు వృద్ధికొస్తే ఆనందించాడు.

ధనంజయం దూరప్రాంతం ఉద్యోగి. సుందరం తమ జిల్లాలోనే ఉండటం వల్ల రిటైరు అయిం తర్వాత పెద్ద కొడుకు దగ్గరే స్థిర పడ్డాడు రామచంద్రయ్య.

రామచంద్రయ్య ఆ రోజుల్లో కాలేజీలో చదువు కోవాలని చాలా ఆశ పడ్డ మాట నిజమే.

ఐదు జిల్లాలకు కలసి ఒక కాలేజీ ఉండేది. ఆ ఊళ్ళో ఉండి చదువుకోవటానికి వీలులేదు.

ఇప్పుడు ఎక్కడ చూసినా కాలేజీలే! ఊరూరా, వీధివీధికీ జూనియర్ కాలేజో, సీనియర్ కాలేజో, యూనివర్సిటీనో ఉన్నాయి.

'మూడు నాలుగు యూనివర్సిటీలు ఒక జిల్లాలోనే తగలబడ్డాయి, ఇప్పుడు. ఎదురైన ప్రతివాడు ఒక ఎమ్మే. ఏం చేయను - ఒక్కడూ కలెక్టరు కాలేదు.'

'జిల్లాల్లు మారలేదు' అనే వాడు రవి.

'అంటే' అని అంటుకొనేవాడు తాత.

'చాలామంది చదువుకోగలరు కాని అందరూ కలెక్టర్లు కారు' అనేవాడు రవి.

'ఎందుకు కారు?' నిగ్గదీసేవాడు తాత.

మునుపున్నన్ని జిల్లాలే ఉన్నాయి ఇప్పుడూను. జిల్లా కొక్కడే కలెక్టరు. మునుపు చదువుకొన్న పదిమందిలో ఒకడు కలెక్టరు అయి ఉండవచ్చు. ఇప్పుడు చదువుకొన్న లక్షమందిలో ఒక డవుతాడు.

'మరి ఎందుకీ చదువు?'

'చదువు మనిషి జన్మ హక్కు-చదువుకొనే అవకాశం అందరికీ ఉండాలి. చదువు ఎవడి తాత సొత్తు కాదు.'

'ఒక్కడూ కలెక్టరు కాలేడు'

'అవసరం లేదు'

'అర్హత లేదు'

'నే నొప్పుకోను తాత' రవి మండి పడ్డాడు. ఆ రకంగా తాతా మనవళ్ళు తగాదా లాంటిది పడి పందెం వేసుకొన్నారు.

'నువ్వు కలెక్టరువు కాలేవు'

'అవుతాను'

'కానీ చూద్దాం'

ఆ క్షణాల్లోనే మనవడు తాతను బానిసల బుద్ధి అంది.

బాల్యంలో బాగా చదువుకొనే అవకాశం కోసం అల్లాడిపోయిన రామ చంద్రయ్య అవకాశం ఉన్న బాల బాలికలు బాగా చదువుకోవాలని అభీష్టం. అందుకే మనవడు బాగా చదువుకోవాలని, చదవాలని పట్టుదల. పనిలేని కారణంగా పాఠాలు చెప్పే పనికూడా ప్రారంభించాడు. రవిది మిత్రులతో తిరిగే వయస్సు. ఇక్కడే వచ్చింది తిరకాసు.

రవి కాలేజీలో ఏం చదివేవాడోఏమో ఇంటిపట్టున సరిగ్గా గంట కూర్చొని చదివేవాడుకాదు.

రేడియో వినటం, అవీ పాటలు, దినచర్య. ఆటలు-క్రికెట్టు, టెన్నీసు, డబ్బు దండగ, కాలం వృథా. కాకపోతే కబుర్లు-సినీమాలు-రాజకీయాలు.

రవిది బాగుపడే బుద్ధిలాగా కనబడలేదు రామచంద్రయ్యకు. రవి ఎం.ఏ. చేసిందాకా రెండేళ్ళపాటు తాత సతాయింపు సినిమా రికార్డు అయిపోయింది.

అంతేకాదు, ప్రేమ వ్యవహారం ఒకటి. ఉత్తరాల రాకపోకలు చూసి రామ చంద్రయ్యకు చిర్రెత్తుకొచ్చింది 'అది ప్రేమకాదు తాతా స్నేహమే' అంటే మరీ ఒళ్ళు మండేది. 'పెళ్ళికాని ఆడపిల్లలతో స్నేహమేమి'టని సతాయించేవాడు.

పిల్లవాడు చెడిపోతుంటే నువ్వేమీ పట్టించుకోవటం లేదని సుందరాన్ని కూడా సూటిపోటి మాటలతో గాయపరిచేవాడు రామచంద్రయ్య.

'ఉద్యోగంలో చేరి ఇంత కాలమయినా పిల్లవాడి పెళ్ళి మాట ప్రస్తావించవేం?' అని రామచంద్రయ్య అడక్కపోలేదు. 'వాడిష్టం, నీ యిష్టం, మధ్యలో నాదేముంది' అని ఊరుకొన్నాడు సుందరం.

అప్పటి నుంచి ఉత్తరాలలో నీ స్నేహితురాలికి పెళ్ళి అయిందా అని వ్రాసి ఆమెకు ఇద్దరు పిల్లలు అని తెలుసుకొని, మరి నీ పెళ్ళి మాట ఏమిటి? పిల్లల మాట ఏమిటి? అని ప్రశ్నించ సాగాడు రామచంద్రయ్య.

ఇప్పుడే ఎందుకు పెళ్ళి. అప్పుడే ఏం తొందర వచ్చింది అని రవి బదులు వ్రాసేవాడు.

అటువంటి సమయంలో కూడా రవి ఇంటికి వస్తే రామచంద్రయ్య పలకరించేవాడు కాదు. రవి కూడా మాట్లాడించే వాడు కాదు.

రవిది అంతా తాత బుద్ధి. మొండి ఘటం. పెడసరం వ్యవహారం.

అప్పుడెప్పుడో రవి సుందరం మాట్లాడుకొంటుంటే రామచంద్రయ్య విన్నాడు.

'నీకు పెళ్ళెప్పుడిష్టం?'

'కలెక్టరు అయింతర్వాత!'

'కలెక్టరు ఎప్పుడవుతావు?'

'ఏమో!'

'వయస్సు పెరగటంలేదూ!'

'దేశానికి నష్టంలేదు'

సతాయించగా సతాయించగా రవి పెళ్ళికి అంగీకరించాడు.

'నాయిష్టం వచ్చినప్పుడు చేసుకొంటాను. మీఇష్టం వచ్చిన అమ్మాయిని నిర్ణయించండ'ని.

రామచంద్రయ్య, సుందరం ఆ ఉత్తరం నిజమేనని నమ్మలేక పోయారు. ఆ ఉత్తరంలోని తిరకాసు అర్థం కావటానికి రిటైర్డు కలెక్టరుకు కూడా ఇబ్బందే అయింది.

అరవై ఏళ్ళ పూర్వం పెళ్ళి చేసుకొన్న రామచంద్రయ్య తండ్రిచూపిన పిల్లమెళ్ళోతాళి కట్టాడు.

తాను తండ్రిమాట వింటే తన కొడుకు తనమాట వింటున్నాడని రామ చంద్రయ్య పొంగిపోయాడు.

అక్కణ్ణుంచి తాత దగ్గులు నేర్చుకోవటం మొదలు పెట్టాడు. వందసంబంధాలయినా తీరుబడిగా తిరిగి తిరిగి చూచివచ్చి అయిదు ఖాయం చేశానని రవికి వ్రాశాడు.

ఒక్కదాన్ని ఖాయం చేయమంటే, దానితో నాకేం సంబంధంలేదు, ఏది ఖాయం చేసుకొంటావో నీయిష్టం, అని వ్రాశాడు.

అంతేకాదు టూరు ప్రోగ్రాం వివరంగా వ్రాశాడు. ఎడ్వాన్సు టూరు ప్రోగ్రాం కూడా పిల్లల తల్లి దండ్రులకు పంపాడు.

రామచంద్రయ్య కాలు కాలిన పిల్లిలాగా, అంత వయస్సులో అంత చలిలో హడావుడి చేస్తుంటే సుందరం ఆనందానికి పట్టపగ్గాలు లేకుండా ఉంది.

'పద స్టేషన్‌కి' అన్నాడు-రామచంద్రయ్య.

'లిరా ఊరు వచ్చిన వాడు ఇంటికిరాడా?' అని సుందరం అంటే.

'అయితే నువు పడుకో. నేను పోయి వస్తాను స్టేషను దాకా!'

'నేనూ వస్తానులే'

'మరి రా!'

తండ్రీ కొడుకులు రవిని కలుసుకోటానికి బయలుదేరారు.

సుందరానికి ఆనందంగానూ ఉంది, ఆశ్చర్యంగానూ ఉంది.

ఆనందం రవిని గూర్చి.

ఆశ్చర్యం తండ్రిని గూర్చి.

రవి మీద తన తండ్రికి ఇంత ప్రేమ ఉందని ఇంత కాలం తాను తెలుసుకో లేక పోవటంవల్ల ఆశ్చర్యం.

అంతా తన తండ్రి పోలికతో తన కుమారుడుండటం ఆనందం.

'అన్నింటా వాడిది మీ పోలికే' అన్నాడు సుందరం.

'నీ ముఖం. వాడిది అచ్చంగా వాళ్ళ నాయనమ్మ పోలిక !'.

'అది కాదు - మొండి తనంలో'

'బలే వాడివిరా సుందరం. అది మొండితనం కాదు. పట్టుదల. ఆఁ! అదే పట్టుదల.

'అది సరే కాని, నీ అంతవాడు అయ్యాడని నీకు సంతోషం కదా!'

'ఒక మాట చెబుతా విను. వాడి మీద నాకు కోపం లేదు. నిప్పు రవ్వను రాజేశాను అంతే ! నా మౌనం కోపం కాదు. ప్రేమ.'

సుందరం మాట్లాడలేక పోయాడు.

రైలు దిగిన రవి సరాసరి తాత దగ్గరకు వచ్చి నిలబడ్డాడు.
తాత కళ్ళ నిండా నీళ్ళు.

సుందరం ఆనందం అవధుల్లేకుండా ఉంది.

తాత మనవణ్ణి కావలించు కొన్నాడు.

బుట్టలో ఉన్న పూలమాల తీసి రవి మెళ్ళో వేసి "రారా పెళ్ళి కొడకా" అంటూ ముద్దు పెట్టుకొన్నాడు.

రవి వినయంగా వంగి తాత పాదాలు తాకి నమస్కరించి పైకి లేచి ఎదురుగా నిలబడ్డాడు.

రైలంతా చూస్తూ ఉంది ఈ మాటెంగు.

రవిని దగ్గరగా లాక్కుని 'ఏరా పెళ్ళి కొడకా! కాళ్ళకు నమస్కారం చేయట మేమటి? బానిసలబుద్ధి కదూ'

రవి నిటారుగా నిలబడ్డాడు.

'అది భక్తి'

'కాళ్ళమీద పడటమా'?

'కాళ్ళ మీద పడుతూ ఉంది క్లర్కు కాదు, కలెక్టరు'

తాత మళ్ళి మనవణ్ణి కౌగిలించు కొన్నాడు.

'అది సరేరా! నీ పెళ్ళాన్ని నువ్వు చూసుకోవాలిగాని-నన్ను చూడమంటే ఎలా—'

'నా కంటే బాగా, నాకు కావల్సిన భార్యను నువ్వే ఎన్నిక చేయగలవని నా విశ్వాసం'

తాత హాయిగా నవ్వాడు

'ఎట్లా?'

'నన్ను కలెక్టరును చేశావే - అట్లా!'

తాత మళ్ళి తలూపుతూ నవ్వాడు.

'నీ భార్యను నువ్వు నిర్ణయించుకోవాలి కదా కుఱ్ఱ కలెక్టరు!'

'నా ఉద్యోగం నువ్వుకోరావు వచ్చింది, నాకు బాగుంది. నా భార్యను నువ్వు నిర్ణయిస్తావు. వస్తుంది. నాకు బాగుంటుంది.'

మనవడి నిర్ణయం విని, తాత సెడుమూపుతూ నవ్వాడు.

'అంటే ఏమిట్రా నీ ఉద్దేశం?' తాత నవ్వుతూ అడిగాడు. 'నే నంటే నీకు అంతా గురా'.

'గవర్నమెంటు నన్ను ఏ జిల్లాకు కలెక్టరుగా వేస్తే ఆ జిల్లాకు పోయినట్లు మీరు ఏ అమ్మాయికి మెళ్ళో తాళి కట్టమంటే, అంతే! అదే పెళ్ళి - మీరే నా పెళ్ళికి గవర్నమెంటు'

ప్లాటు ఫారం ఆశ్చర్యంగా చూస్తూ ఉండగా రైలు కూత వేసినట్లు తాత నవ్వాడు. ఇంజను పొగవదిలినట్లు చేతులు జాడించాడు. రైలు కదిలినట్లు కదిలాడు. ఇంజనుకంటే స్పీడుగా కలెక్టరు కంపార్టుమెంటులా వెంటరాగా ముందుకు సాగాడు.

ఆ రైలు అటు వెళుతూ ఉంటే మనవడికంటే ఉత్సాహంగా తాత చకచకా గేటు దాటి వెలుపలికి వస్తూ 'ఒరే పెళ్ళి కొడకా! నేను తోడు పెళ్ళి కొడుకును-తెలుసా' అంటూ తెలిసిన పెళ్ళి కొడుకు ఫోజుపెట్టి, ఉదయిస్తున్న సూర్యుణ్ణి చూస్తూ 'రారా నా తండ్రీ!' అంటూ వెలుతురులా నవ్వాడు రామచంద్రయ్య.

# సంస్కారణం

ఉత్సవం ఉత్సాహంగా సాగుతూ ఉంది.

రంగు రంగుల కాగితాల తోరణాలు కట్టారు. లౌడ్‌స్పీకర్ పెట్టారు. రంగు బల్బులు అమర్చారు.

వేదిక అమరి ఉంది. టేబిల్ మీద పూల వాజ్‌లు చక్కగా ఉన్నాయి. ఖద్దరు టేబిల్ క్లాతు ముచ్చటగా ఉంది. ముద్దుగా మూడు కుర్చీలు మెత్తగా, ఒత్తుగా, బుద్ధిగా కూర్చుని ఉన్నాయి. మైకులు మూడు అమర్చారు.

షామియానా సుందరంగా ఉంది. షామియానా నిండా కుర్చీలు వేశారు. జనం ఒక్కొక్కరే వస్తున్నారు.

ఇది కళ్యాణ మండపం కాదు. కాబట్టి పెళ్ళికాదు.

కార్లు గత్తర హడావుడీ లేదు. కాబట్టి ఆఫీషియల్ సమావేశం కాదు.

పిల్లలు బాడ్జీలు జండాలు లేవు. కాబట్టి రాజకీయ సభకాదు.

కిటకిటలాడుతూ జనం గుమిగూడారు కాబట్టి సాహిత్య సభకాదు.

బ్రాహ్మణులున్నారు కాని పూజారులు లేరు కాబట్టి మత సమావేశం కాదు.

వీధిలో, నాలుగు రోడ్లు కలిసే చోట కందుకూరి వీరేశలింగం పంతులు నిలువెత్తు విగ్రహం ముందు వేదిక, దాని ముందు షామియానా ఉండటం, విగ్రహం కాళ్ళదగ్గర్నుంచి అన్ని పక్కలు రంగు కాగితాల దారాలు కట్టారు, కాబట్టి ఇదేదో సంస్కర్తల సంగతి అయి ఉంటుందని అడిగితే అన్నారు. 'నీ కెందుకు పో' అని. అందుకని ఎవరినీ ఏమీ అడగటం బాగుండదని ఊరకుండటమే ఉత్తమం.

కందుకూరి వీరేశలింగం పంతులు గొప్ప సంస్కర్త. ఆడవాళ్ళ కష్టాలు తొలగించాలని అహరహం కృషి చేశాడు. సాంఘికంగా శ్రమించాడు. సాహిత్యంగా పరిశ్రమించాడు. సంఘంలోనూ, సాహిత్యంలోనూ కొత్తదనాపు ప్రసాదించిన ఆధునిక యుగ వైతాళికుడు.

ఇది కూడ జరుగుతూ ఉంది కాబట్టి ఇదేదో మహత్తర విషయమే అయి ఉంటుందనిపించింది.

ప్రభాకర్‌జీ వచ్చాడు. ప్రభాకర్‌జీ వచ్చాడంటూ చుట్టూ కేకలు వివబడ్డాయి. అందరూ అటు పరుగెత్తారు.

కొందరు నమస్కరించారు. కొందరు వినయంగా వంగారు. కొందరు పాదాలు తాకారు. కొందరు సాష్టాంగ దండప్రణామ మాచరించారు.

ప్రభాకర్‌జీ అందర్నీ ఆలింగనం చేసుకొంటూ ఆదరంగా మాట్లాడుతూ వస్తున్నాడు.

కట్టుకొన్నది ముతక ఖద్దరు గుడ్డముక్క. శరీరం మీదున్న బట్టంతా జమ చేసి కొలిస్తే రెండు మీటర్లు ఉండవచ్చు. అందులో సగం మొలబట్ట. మిగతా సగం తలబట్ట. ఇక మరేం శరీరం మీద లేదు.

తలమీద వెంట్రుకలో, జనపనారో, అట్టకట్టిన బట్టో చెప్పటం కష్టం! తల కెప్పుడయినా నూనె రాసిన ఆచూకీ లేదు.

ఆయన పొట్టఏదో, వెన్నుముక ఏదో చెప్పటం కష్టం. రెండూ అతుక్కుపోయి వేరుచేసి చూపటానికి వీలు లేకుండా ఉంది.

అది శరీరం అంటానికి వీలులేదు. కండలేదు. ఎముకల గూడు అనవచ్చు. అదీవీలు లేదు. చర్మం ఉంది. బరువు తూస్తే చూస్తే పసిపిల్లలు నవ్వుతారు.

గాలి తోలితే పడేట్టున్న మనిషి అంతంత బొజ్జల్ని కౌగిలించు కొంటున్నాడు, అంతంత ఛాతీలను స్నేహంగా చూచుకొంటున్నాడు.

అచ్చంగా మహాత్మాగాంధీలాగా ఉన్నాడు. నిజమే! గాంధీకి శిష్యుడట! సబర్మతిలో ఉన్నాడట.

మహాత్ములకు మహాత్ములమన్న గుర్తు అయినా ఉంటుంది. ఈ మనిషికి మనిషి నన్న స్పృహ ఉన్నట్లుగా అనిపించటం లేదు.

ఎందుకో నమస్కారం చేయటానికి బుద్ధిపుడుతుంది. ఎందుకు నమస్కారం చేయాలని పిస్తుంది?

మనుషుల కుండే వేమీ ఈ మనిషికి లేవు.

పక్కలేదు, ఊపిరి లేదు, బలం లేదు, ఇల్లులేదు, వాకిలి లేదు, పొలంలేదు, పుట్రలేదు. పంటలేదు. వంటలేదు. భూమిలేదు. భార్యలేదు. పిల్లల్లేరు. ఆస్తిపాస్తులు లేవు. నిద్రహారాలు లేవు, ఉన్నబట్ట బెత్తెడు ముక్క. ప్రాణంఒక్కటే ఉంది.

అందరికీ అన్నీ ఉంటాయి. కొందరికి ఎన్నో ఉంటాయి కొందరికి కొన్నే ఉంటాయి. ఈ మనిషికి ఏమీలేవు.

మునులు ఇలా ఉంటారు కాబోలు.

తపస్సు చేసుకోవటం చెట్టు కిందే కానక్కరలేదు. నగరంలో నడి వీధిలో నడుస్తూ తపస్సు చేసుకొంటున్న మహర్షి కాబోలు ప్రభాకర్‌జీ.

కలెక్టరు వచ్చాడు. కలెక్టరు వచ్చాడంటూ జనం చెల్లా చెదరయ్యారు.

ప్రభాకర్‌జీ ప్రక్కనే నడుస్తున్న బొజ్జలు, లాల్చీలు, మనీ పర్సులు, బిళ్ళ గోచీలు, చీలమండలి పంచెలు, ఉరుకులు పరుగులతో వెళ్ళిపోయాయి.

పోలీసులున్నారు. వెనుక బిళ్ళ బంట్రోతు ఉన్నాడు. ఆపైన జిల్లా అధికారు లున్నారు. చుక్కల్లో చంద్రుళ్ళా కలెక్టరు ఉన్నాడు.

కలెక్టరు చురుకైనవాడు, తెలివైనవాడు, ఉచితజ్ఞుడు, వివేకి, నీతిమంతుడు, దయాదాక్షిణ్యాలు కలవాడు. ధర్మ పక్షపాతి. మేధావి.

అన్నీ బాగానే ఉన్నాయి. కాని అంటరాని వాళ్ళను వెంటేసుకు తిరుగుతాడు.

ఆరాతీస్తే, ఆ ఊరికి బదిలీ అయి రాకముందే, కలెక్టరు హరిజనుడని అంతా అర్థమయిపోయింది.

ప్రభాకర్‌జీని పక్కనుంచి కలెక్టర్ని చుట్టుకొన్న జనం కలెక్టరు చుట్టూ గాడ్‌లైటుల్లాగా వచ్చారు.

జిల్లా కలెక్టరు ప్రభాకర్‌జీ కాళ్ళ మీద పడితే అందరూ తుఫాను వచ్చినట్లుగా, పిడుగులు పడ్డట్లుగా, ఎక్కడో ఇళ్ళు తగలబడుతున్నట్లుగా ఆనందంగా కరతాళధ్వనులు కావించారు.

అంతా ఉత్సాహం ఎందుకో ఎవరికీ అర్థం కాలేదు.

జిల్లా అంతా వణికించే కలెక్టరు ప్రభాకర్‌జీ చేతుల కింద పిల్లి పిల్లలా ఒదిగి రావటం చూడడానికి వింత దృశ్యం.

ప్రభాకర్‌జీ అ ఆ లు నేర్చుకోబోయిన రోజున కందుకూరి మరణించాడు. ప్రభాకర్‌జీ అ ఆ లు వచ్చిన రోజున సబర్మతి ఆశ్రమంలో చేరాడు. గాంధీ శిష్యుడయ్యాడు.

కందుకూరి వీరేశలింగం పంతులు స్త్రీ విమోచన ఉద్యమకర్త.

గాంధీ దేశ దాస్య విముక్తి సత్యాగ్రహ మహాత్ముడు.

ప్రభాకర్‌జీ ఏమిటి ? ఏమిటి ? ఏమిటి ? పుట్టాడు. పెరిగాడు. చదివాడు. శిష్యుడయ్యాడు. అతను కలెక్టరయినట్లు.

కందుకూరి కులం లోకానికి తెలుసు. గాంధీ కులం దేశానికి తెలుసు. కలెక్టరు కులం రాష్ట్రానికి తెలుసు.

ప్రభాకర్‌జీ కులం - అందరికీ తెలుసు. ఎవరికీ తెలియదు. అందరూ అందర్నీ అడిగారు. ఎవరూ ఎవరికీ చెప్పలేదు. పలకలేదు. ఉలకలేదు. కదల్లేదు మెదల్లేదు పెదవి.

మహత్తర విషయం. చిదంబర రహస్యం. ఒక్కటి సత్యం. ప్రభాకర్‌జీకి తన కులం తెలియదు. అది గాంధీ కులం.

సత్యాగ్రహాల్లో లాఠీ దెబ్బలు తిన్నాడు. జైళ్ళ పాలయ్యాడు. ఉన్నదంతా పోగొట్టుకొన్నాడు. ఏమీ లేనివాడయ్యాడు.

చాలా మంది సత్యాగ్రహులు, పాలకులు, ప్రభువులు, మినిష్టర్లు, ధనవంతులు, జనవంతులు, బలవంతులు.

ప్రభాకర్‌జీ ఏమీ కాదు.

దేశ విముక్తితో పాటు గాంధీ విముక్తి జరిగిపోయింది.

బ్రిటిష్ ఇండియా నుంచి రిపబ్లిక్ ఇండియా లోకి ప్రభాకర్‌జీ బదలీ అయ్యాడు. దేశమంతా తిరిగాడు. మానవ శక్తి బోధించాడు. ఆత్మ పరమాత్మల గూర్చి చెప్పాడు. సంఘ చైతన్యం ఉద్బోధించాడు. మానవ సమానత్వ సందేశం అందించాడు.

ప్రభాకర్‌జీ దేశంలో కొందరికి దేవుడు. కొందరికి ప్రవక్త. కొందరికి మహాత్ముడు. ఎవరికీ మనిషి కాడు. మనిషిలాగానూ లేదు.

జిల్లా యంత్రాంగం కలెక్టరుతో నడిచి వేదిక దగ్గరకు వచ్చింది. గాంధీ వాదుల ఖద్దరు లోకం ప్రభాకర్‌జీతో కదలి వచ్చి వేదిక చేరుకొంది. కందుకూరి ఆంధ్ర వారసుల చిరంజీవత్వం వేదిక చుట్టూ చేరింది.

ఎందరు మగవాళ్ళో దేశంలో నిజానికి అంతమంది ఆడవాళ్ళు. అందరూ అన్ని చోట్లకు రారు. వేదిక చుట్టూ మగవాళ్ళ కంటే ఆడవాళ్ళే ఎక్కువ. ఇటు వంటి చోట్లకు స్త్రీలు సాధారణంగా రారు, వచ్చారు. కానీ అంతేకాదు, ఆడవాళ్ళు అందరూ ఆ ఆజన్మ బ్రహ్మచారి పాదధూళి నెత్తిన వేసుకొంటున్నారు.

ఇందరు ఇన్ని విధాలుగా ప్రభాకర్‌జీకి వినయ విధేయతలు చూపుతున్నా అక్కడున్న ఆ గుంపు లేవలేదు. నమస్కరించలేదు. అటు చూడలేదు.

ప్రభాకర్‌జీ వాళ్ళ వైపు చూశాడు తల పంకించాడు. ముందుకు సాగి పోయాడు.

వాళ్ళు బీదబ్రాహ్మణులు, పూజారులు. వాళ్ళది పేదరికం. వేళకు అన్నం నీళ్ళు లేని వాళ్ళు. నిత్య నైమిత్తిక కర్మల నాచరించేవాళ్ళు. వేదానుష్ఠానపరులు బ్రహ్మవేత్తలు. దీక్షా జీవనులు. పైసా లేని వాళ్ళు. ఆస్తిపాస్తులు లేని వాళ్ళు. ఉద్యోగం సద్యోగం లేని వాళ్ళు.

కలెక్టరు అధ్యక్షత వహించాడు. ముఖ్య అతిథి ప్రభాకర్‌జీ. సమావేశకర్త అందర్నీ ఆహ్వానించాడు. వందన సమర్పణకర్త వేదిక మీద కూర్చున్నాడు.

బ్రహ్మ నాలుగు ముఖాలులాగా ఉన్నారు. వేదిక మీద ప్రముఖులు.

కందుకూరి చేసిన మొదటి వితంతు వివాహానికి నూరేళ్ళు నిండాయి. అది స్త్రీ జనోద్ధరణ, మానవ సమానత్వ స్థాపన.

సంఘ చైతన్య భావన.

వితంతువు సాంఘికంగా పొందిన హింస తలచుకొంటే బాధగా ఉంటుంది. వితంతువును మనిషిగా చూడండి అంటే చాలదు. పెళ్ళిచేస్తే చాలా గోల తప్పుతుంది. స్త్రీ మనిషి అవుతుంది. నలుగురితో సమానమవుతుంది. సమానత్వ భావన చెల్లుతుంది. సాంఘిక సమానత్వ లక్షణం నెరవేరుతుంది. నెరవేరింది. మరీ నెర వేరుతుంది.

సంఘంలో అసమానతలున్నాయా? ఉంటే అవి తొలగింపబడాలి అందుకు ఏం చేయాలో ఆలోచించాలి.

ఉపన్యాసాల ఊపు ' ఉద్ధృతంగా ఉంది. అందరూ మాట్లాడిం తర్వాత ప్రభాకర్‌జీ వేదిక దిగాడు.

ఎదుట వీరేశలింగం నిలువెత్తు విగ్రహం ఉంది. విగ్రహం మెడదగ్గర మంచె ఉంది. మంచె మీదికి మెట్లున్నాయి.

ముందు ఎవరో ఎక్కారు. చేతుల్లో నిలువెత్తు పూలమాలతో మరి ఇద్దరు మంచె మీదికి చేరారు.

వెనుక పండు వృద్ధు. ప్రాణం లేనికట్టె. పల్చటి మనిషి. ప్రభాకర్‌జీ పడుతూ లేస్తూ వణుకుతూ ఒక్కొక్క మెట్టూ ఎక్కి మంచె మీదకు చేరాడు.

క్రింద చుట్టూ జనం చేరి పైకి చూస్తూ ఉన్నారు.

దూరంగా వేద పండితులు నిలబడి ఉన్నారు.

ప్రభాకర్‌జీ వణుకుతూ, తడబడుతూ నిలబడ్డాడు.

నిలువెత్తు పూలమాల ఇద్దరు బలవంతులు అందించారు.

ప్రభాకర్‌జీ సున్నితంగా పట్టుకొని వీరేశలింగం మెడమీద పూలమాల ముడి పడేటట్లుగా మాల ఉంచాడు. పూలమాల వీరేశలింగం విగ్రహం పొడుగునా జారింది.

ప్రభాకర్‌జీ తడబడ్డాడు. మళ్ళీ నిలబడ్డాడు. పూలమాల పట్టుకొన్న ఇద్దరూ ప్రభాకర్‌జీని పూలమాలలాగా పట్టుకొన్నారు.

ప్రభాకర్‌జీ పడలేదు. నిలబడలేదు. వాళ్ళిద్దరి చేతుల్లోగాలిలో ఊగులాడుతున్నాడు.

పూలమాల వీరేశలింగం మెళ్ళో అందంగా ఉంది. అరిచేతులు అరుచుకొన్నాయి. కరుచుకొన్నాయి. చురుచుకొన్నాయి. చప్పట్లు మోగాయి.

కరతాళ ధ్వనుల కలకలం తగ్గిం తర్వాత నెమ్మదిగా దిగి వస్తున్న ప్రభాకర్‌జీని పట్టుకొన్నాడు కలెక్టరు.

ప్రభాకర్‌జీ కుడిచేతి కింద కలెక్టరున్నాడు. ఎడం చేతి కిందికి ఎందరెందరో చేరి, దూరి, దూరమయి, మారి, మళ్ళీనూరి, మాయమయిపోయారు. ప్రభాకర్‌జీ కారు దగ్గరకు చేరేలోగా వంద మంది మారిపోయారు.

ప్రభాకర్ కారెక్కాడు. అది బయబుదేరింది. అలా వెళిపోయింది.

కలెక్టరింకా వెళ్ళనేలేదు.

జనమంతా ఇంకా అక్కడే ఉన్నారు.

ఇంతలో ఎవరో మంచె ఎక్కారు.

కందుకూరి వీరేశలింగం పంతులు మెళ్ళోని నిలువెత్తు పూలమాల నేలపాలు చేశారు.

అది మట్టిలో పడింది. దుమ్ము కొట్టుకుపోయింది.

పంతులు జీవించీ దుఃఖించాడు. గతించీ దుఃఖించాలి.

పంతులు సంఘం మీద తిరగబడ్డాడు. సంస్కరణగొడ్డలి ఎత్తి చెడ్డను నరికాడు.

అయన బతికీ పూజలు పొందాడు. గతించీ పూజింపబడ్డాడు.

దూషణ భూషణలు, ఆదర తిరస్కారాలు మహాత్ములకు లెక్కలో ఉండవు.

అంతలో ఎవరో కింద నుంచి నీళ్ళ బిందెలు అందించారు. విగ్రహం నిండా దిగపోతగా నీళ్ళు. విగ్రహం తడిసింది. తుడిచారు. కడిగారు. తోమారు. రుద్దారు. తుడిచారు.

నీళ్ళలో పూలమాల దుమ్మూ చెమ్మా సంతరించుకొని అందంగా రూపొందింది.

వేద వేద్యుల మధ్య వేదోక్తంగా వేద పఠనం జరుగుతుండగా విగ్రహం శుద్ధి పొందింది.

కిందనుంచి పాలబిందె అందించారు. విగ్రహం నిలువునా పాలపోత! క్షీరాభిషేకం.

కందుకూరి వీరేశలింగం విగ్రహం సంపూర్ణంగా పరిశుభ్రమయింది. పరిశుద్ధమయింది.

కలెక్టరు విగ్రహం దగ్గరకు వస్తున్న ధ్వని విని జనం తోవ ఇచ్చారు. అంతా కలకలం. ఘర్షణ, తిట్లు, దీవెనలు, రద్దీ, రభస!, గోల, అర్థం పర్థం లేని మాటలు, పాటలు, మనుషులు.

కలెక్టరు చుట్టూ చూశాడు పూల మాలకనిపించింది. నేలమీద విగ్రహం కనిపించింది పాలతడిలో.

కలెక్టరు వంగి పూలమాల ఎత్తాడు. నీళ్ళతో, పాలతో, మట్టిలో, దుమ్ముతో తడిసి బరువయింది. ఎస్.పి. ఎత్తిపట్టాడు.

కలెక్టరు మంచె ఎక్కాడు. వెంట పూలమాల వచ్చింది. ఎర్రటోపీల చేతుల్లో.

రద్దీగోల! లాటీచార్జీ!

విగ్రహం కంఠంలో పూలమాల!

కలెక్టరు చేతుల్నిండా దుమ్ము, ధూళీ, తడి.

మాలనిండా నీళ్ళు పాలు మట్టి.

విగ్రహం కంఠంలో పాలనీళ్ళ మట్టి.

దూరంగా ప్రభాకర్‌జీ జిందాబాద్.

ఇంకాదూరంగా ప్రభాకర్‌జీ డౌన్ డౌన్.

విగ్రహం మెళ్ళోపూలమాల పోలీసు కాపలాతో, బందోస్తుగా భద్రంగా ఉంది.

'ఎవరు దీన్ని అంటరాదు?' రూలు!

ఎవరు ఎవర్ని అంటరాదు??

ఎవరీ అంటరాని వాళ్ళు?

ఊరేగుతూ ఉంది.

ఊరంతా నిశ్శబ్దంలో

# ఉద్యోగం

రమ ఇంటర్వ్యూ చేస్తూ ఉంది. చిట్టచివరి కాండిడేట్ రాం.

రాం ఇంటర్వ్యూ గదిలో ప్రవేశించగానే మనిషిని నిలువునా చూచింది.

మంచి ఎత్తు. తగినలావు. చక్కని ఆరోగ్యం. మంచి రూపం. వస్త్రధారణ బాగా ఉంది.

రమ కూర్చోమంది. రాం కూర్చున్నాడు.

సర్టిఫికేట్లు చూడటం ప్రారంభించింది.

యం.ఎ. ఫస్టు క్లాసు యూనివర్సిటీ ఫస్టు. డిగ్రీ తీసుకొని ఆరేళ్ళయింది.

'ఇంత కాలం నుంచి ఏం చేస్తున్నారు?

'ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను' రాం సమాధానం చెప్పాడు.

'ఎన్ని ఇంటర్వ్యూలకు వెళ్ళి వచ్చారు'

'చాలా వాటికి!'

ఎన్ని ఆఫీసుల చుట్టూ తిరిగింది చెప్పవలసివస్తుందేమోనని రాం బాధ పడుతూ ఇబ్బందిగా కూర్చున్నాడు.

'బియ్యీడి చేశారా ?'

'చేయలేదు'

'చేయలేకపోయారా ?'

యం. ఏ. చదివితే రాని ఉద్యోగం బియ్యీడిచేస్తే మాత్రం వస్తుందా అనుకొని, ఆ సమాధానం బాగుండదనిపించి. 'చేద్దామనే ఉంది' అని నసిగాడు

'మాకు బియ్యీడి చేసిన కాండిడేట్ కావాలి' అని ఇంకా ఏవో కాగితాలు చూస్తూ ఉంది రమ.

'ఆ మాత్రానికి నన్ను ఎందుకు ఇంటర్వ్యూకి పిలవటం' అనుకొన్న రాం 'కరెస్పాండెన్స్ కోర్సు చేసి బియ్యేడి ముగించాలని ప్రయత్నిస్తున్నాను' అని సమాధానం చెప్పి, మీరు ఉద్యోగం ఇవ్వండి ప్రవేటుగా బియ్యేడి చేస్తాను అని అర్థం వచ్చి తీరుతుందని ఆనందించాడు రాం.

రమ ఇంకా ప్రశ్నించింది. రాం తల్లిదండ్రుల గురించీ, అన్నదమ్ముల గురించీ అక్కచెల్లెళ్ళ గురించీ.

ఈ నసంతా ఎందుకూ అనుకొన్నాడు కాని బుద్ధిమంతుళ్ళా అన్ని ప్రశ్నలకూ సమాధానం చెప్పాడు.

జిల్లా అంతా ఉత్తమ ఉపాధ్యాయుడని పేరు ప్రఖ్యాతులు ఆర్జించిన రంగనాథం మొదటి కొడుకు రాం. మంచి కుటుంబం. రాం వాళ్ళ అమ్మ రంగనాథాన్ని చేసుకొంటానని విద్యార్థినిగానే పట్టుబట్టింది. పెళ్ళి చేసుకొంది.

పంతుళ్ళందరికీ కుచేల సంతానం. రంగనాథం అపవాదం కాదు.

నలుగురు కొడుకులు. ముగ్గురు కూతుళ్ళు. ఆడపిల్లలకు స్కూలు చదువుతో ముగించి పెళ్లిళ్ళు చేశాడు రంగనాథం.

ముగ్గురు కొడుకులు పోస్టుగ్రాడ్యుయేషన్ ముగించి, పొట్ట చేత్తో పట్టుకొని వీధులు, ఆఫీసులు, అప్లికేషన్లు, ఇంటర్వ్యూల దశలో ఉన్నారు.

నాలుగో వాడు వీళ్ళలో కలుసుకోవటం కోసం హడావుడిగా పరీక్షలు రాస్తున్నాడు.

రమ ప్రశ్నించింది.

'ఆడపిల్లల్ని మీ తండ్రి ఎందుకు పై చదువులు చదివించలేదు.'

మీకెందుకందామనుకొని, ఎందుకయినా మంచిదనుకొని 'ఆడపిల్ల ఎక్కువగా చదివితే ఇంకా పెద్ద చదువులు చదివిన వాణ్ణి వరుడుగా సంపాదించాలి. పెద్ద చదువులు చదివిన వాడంటే కట్నం కానుకలు బాగా ముట్ట చెప్పాలి. మాకు అంతగా ఆస్తి పాస్తుల్లేవు.

'మీకెంతమంది పిల్లలు'

'పెళ్ళికాలేదు!'

'పెళ్ళెందుకు చేసుకోలేదు.'

'ఉద్యోగం లేక' అని జవాబు చెప్పాడు కాని లోపల కోపం లేకపోలేదు. కాని మీరు ఉద్యోగం ఇస్తే నేను పెళ్ళి చేసుకొంటాను. ఒక యువతి జీవితం పుడిపడుతుంది. మీవల్ల ఒక స్త్రీ ఉద్ధరణ కార్యం నెరవేరుతుంది. అని చెప్పినట్లుగా భావించుకొని ఇంటర్వ్యూలోనే అమితంగా ఆనందించాడు రాం.

వ్యక్తిగతమైన చదువుకు సంబంధించిన ప్రశ్నల తరువాత పాఠం చెప్పే తీరుమీద, పాఠ్యాంశాల మీద రమ ఇంటర్వ్యూ చేసింది.

రాం ఇంటర్వ్యూ బాగా చేశానని సంతృప్తి పొందాడు.

'ఏ విషయమూ మీకు రాస్తాం మీరు వెళ్ళి రావచ్చు' అని రమ అంటుంటే రాం గతుక్కుమన్నాడు. ఉద్యోగం వస్తుందో, రాదో, ఇస్తుందో ఇవ్వదో తెలుసుకోలేకుండా ఉన్నాడు.

పక్కనున్న సీనియర్ టీచర్ ఏమీ ప్రశ్నించ లేదు.

ఇటున్న కరస్పాండెంటూ ఏమీ అడగలేదు.

హెడ్‌మిస్ట్రెస్ రమ ఒక్కతే ఇంటర్వ్యూ అంతా ముగించి పంపించింది.

సంతోషంగా ఇంటర్వ్యూ గదిలో ప్రవేశించిన రాం అంత ఉత్సాహంగా బైటికి రాలేదు.

అది ప్రవేటు స్కూలు ఒకటి నుంచి ఎనిమిదో తరగతి దాకా అప్పటికి ఉన్న క్లాసులు. వచ్చే ఏటికి, ఆపై ఏటికి తొమ్మిదీ పదీ తరగతులు రావచ్చు.

ఇంగ్లీషు సోషల్ స్టడీసు చెప్పటానికి టీచర్ కావలసి ఉంది. ప్రకటిస్తే చాలా మంది అప్లై చేశారు

రమ కొందరికే ఇంటర్వ్యూకు పంపించింది చాలా మంది వచ్చారు.

పీపీ కెన్నో రికమెండేషన్లు !

రికమెండేషన్ ఉన్నా, లేకున్నా, మాకు కావలసిన కాండిడేట్‌ను మేం తీసుకొంటాం అని రమ తెగేసి చెప్పింది.

రాంకి రికమెండేషన్ లేదు. లేకపోనూలేదు. కొడుకు గుణగణాలను, అర్హతలను పిడమర్చి చెబుతూ తండ్రి ఉత్తరం వ్రాశాడు.

అనుకొంటే అవి సర్టిఫికేట్లు. కాదనుకొంటే అది రికమెండేషన్. మళ్ళీ మాట్లాడితే అభ్యర్థన.

రంగనాథం పేరు చూడగానే స్కూలు కరస్పాండెంటు ఎగిరి గంతేశాడు.

వాళ్ళిద్దరూ జిల్లా బోర్డునుంచి పరిషత్తు దాకా కలిసి పనిచేశారు.

సహోపాధ్యాయుడి కొడుకుగానే కాదు మిత్రుడి పుత్రుడుగా కూడా రాం సహాయం పొందాడు.

అంటే బియ్యీడి లేకపోయినా ఇంటర్వ్యూ అందింది.

రమ వద్దన్నా, కరస్పాండెంటు పిలుద్దామన్నాడు. రాం ఇంటర్వ్యూకి వచ్చాడు.

ఇక్కడ కరస్పాండెంటుది తండ్రి హోదా కూడా. అందువల్ల రమ కాదన లేక పోయింది.

లేకపోతే బియ్యీడిలేని అందరికీ ఇంటర్వ్యూ లేనట్లే రాంకీ ఉండేదికాదు. ఇంటర్వ్యూ ముగిసిం తర్వాత రమ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

'ఏమ్మా?' అన్నాడు తండ్రి. రమ ప్రక్కకు వెళ్ళిపోయింది. ముఖం కడుక్కొంది. ఫ్లాస్కులో కాఫీ తాగింది. ఇద్దరికీ ఇచ్చింది.

ఇంటర్వ్యూ అయిపోయింది. మీరు వెళ్ళరండి అంది. కాఫీలు ముగించగానే! తండ్రి సీనియర్ టీచర్ మారు మాట్లాడకుండా వెళ్ళిపోయారు. రమకు గతం కళ్ళముందు తిరగసాగింది.

తండ్రి వచ్చీరాని జీతం రాళ్ళతో రమను కష్టపడి చదివించాడు.

రమ యం.ఎ. పూర్తి చేసిన సంవత్సరం తండ్రి పెన్షన్ పుచ్చుకొన్నాడు.

అదీ అంతంత మాత్రమే!

తల్లి రోగిష్టి మనిషి. తండ్రికి జీతం లేదు.

రమ తప్ప కొడుకులూ కూతుళ్ళూ లేరు.

తల్లి దండ్రుల్ని కష్టాలు పడకుండా చూడాలి. అంటే సంపాదన ఉండాలి.

ఉద్యోగం కోసం ఊరూరూ తిరిగింది. ఉన్న నాలుగు రాళ్ళు కరిగి పోవటం తప్ప ప్రయోజనం కనిపించలేదు.

ఆఫీసుల చుట్టూ ప్రదక్షిణం చేసింది. పుణ్యం లేకపోగా, రాకపోగా కాళ్ళరిగి పోయాయి.

తండ్రీ ప్రయత్నించి చూశాడు. మాట పోవటమే మిగిలింది. ఉత్తరాలు దండగ. పోస్టేజి వేస్టు. ఉద్యోగం మాత్రం రాలేదు.

చేసేది ఏమీ లేక, ఊరికే ఉండలేక, ఉండటానికి వీలు లేక, ట్యూషన్లు చెప్పటం ప్రారంభించింది.

పెద్దక్లాసుల వాళ్ళకంటే చిన్నక్లాసుల వాళ్ళు ఎక్కువగా రావటం మొదలు పెట్టారు.

చిన్న పిల్లలతో మంచి కాలక్షేపం అనుకొంది మొదట్లో. కాని, రానురానూ ఇదీ పెద్ద పనే అనుకొంది.

ఆరంభంలో వచ్చిన వాళ్ళలో ఇంట్లో ఊరికే ఉండలేని, ఉంచలేని, ఉంచరాని పిల్లలు కొందరయితే స్కూల్సులో చదువుకొన్నది మళ్ళీ చెప్పించుకోవాలను కొన్న, చెప్పించుకోవలసివచ్చిన వాళ్ళు కొందరు.

అందరూ మొదట్లో ఎంతో కొంత ఇచ్చేవాళ్ళు. రమ పాఠాలు బాగా చెబుతుంది, అన్ని పాఠాలు చెబుతుంది, అని అందరికీ తెలిసింతర్వాత పిల్లలూ ఎక్కువయ్యారు. ఫీజూ ఎక్కువయింది.

మళ్ళీ ఏటికి కొత్త రకం పిల్లలు వచ్చి చేరారు. వాళ్ళకు ఏ స్కూలులోనూ అడ్మిషన్ లేదు. వాళ్ళు రోజంతా చదువు కోటానికి ఇంటి దగ్గరే ఉండి పోతున్నారు. స్కూలు దూరమనీ, టీచర్లు కొడతారనీ, రమ బాగా చెబుతుందనీ కొంతమంది తాము చదువుకొంటున్న స్కూలు మాని వచ్చి చేరుతున్నారు.

పని ఎక్కువయింది. రమ కోసం తోడు తండ్రి కూడా సహాయ పడ సాగాడు.

వృద్ధాప్యంలో ఆయనకు ఇబ్బంది రమకు ఇష్టం లేదు.

అందుకని సెకెండరీ ట్రయినింగు పాసయి ఊరికే ఇంటి దగ్గరుంటున్న తెలిసిన వాళ్ళ అమ్మాయిని తనకు తోడు రమ్మని పిలిచింది. నెలకింత జీతం ఇవ్వసాగింది.

ఇల్లు ఇరుకు అయితే వేరే ఇల్లు తీసుకొంది. స్కూలుకొక పేరు. తనకొక హెడ్‌మిస్ట్రెస్ హోదా లభించాయి.

ఆ స్కూలు రికెగ్నిషన్ కోసం తండ్రి తన తెలివి తేటలు చాకచక్యం ప్రయోగించాడు.

మొదటి అయిదు తరగతులతో ప్రారంభమయిన పాఠశాల ఎనిమిది తరగతులకు పెరిగింది. అద్దె ఇల్లు పోయి సొంత భవనం ఏర్పడింది.

ఉద్యోగం లేక ఆవురుమని ఏడ్చిన రమ అయిదేళ్ళలో ఇరవై మందికి ఉద్యోగం ఇచ్చింది.

స్కూలు బాగా జరుగుతూ ఉంది. రోజు రోజుకూ పిల్లల సంఖ్య పెరుగుతూ ఉంది.

స్కూలుకు మంచి పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. పదో తరగతిలో, నూటికి నూరు మంది పాసయ్యేసరికి ఎడ్మిషను అంతులేకుండా అయింది.

వచ్చిన వాళ్ళందరినీ చేర్చుకొని, బిల్డింగు పెంచి, క్లాసులు పెంచి, పని పెంచుకొంది రమ. ఆ పని పెరుగుదల కారణంగా కొత్తగా ఒక టీచర్ని నియమించవలసి వచ్చింది.

ఇంటర్వ్యూకి వచ్చిన వాళ్ళలో బాగా చదువుకొన్న బియ్యేడి యువతికి టీచరు పోస్టు ఇచ్చింది రమ.

తండ్రి రాంకి ఇవ్వాలని పట్టు పట్టాడు.

'బియ్యేడి లేదు. ఇవ్వను' అంది. అంతే మాట నెగ్గించుకొంది.

తండ్రి ఎన్నో చెప్పి చూశాడు. రమ వినలేదు.

'మంచి కాండిడేట్' అన్నాడు. తన 'మిత్రుడి కొడుకు' అన్నాడు. 'కష్టాల్లో ఉన్నారు' అన్నాడు.

ఏమీ పట్టించుకోలేదు రమ. పైగా కసురుకుంది.

'యం.ఏ. పాసయ్యాడు. తెలివైనవాడు. ఏం చేయను? ఇంతకాలం ఊరికే ఉన్నాడు. ఏం పనీ చేయలేదు. ఏ పనీ కల్పించుకోలేదు. ఉద్యోగం ఒకడిస్తే వచ్చేది కాదు. చేస్తే ఉండేది. ఏదైనా ఉద్యోగం చేసుకోమను' అని కోప్పడింది.

'నువ్వు ఉద్యోగం ఇవ్వకపోతే నేనిస్తాను.'

'తప్పకుండా ఇవ్వండి. నాస్కూలులో కాదు' రమ లేచి వెళ్ళిపోయింది.

కొత్త టీచరు ఉద్యోగంలో చేరిన రోజునే రాం ఉద్యోగం సంగతి ఏమయిందని అడగటానికి వచ్చాడు.

పరిస్థితి చూచి నీరసించి పోయాడు. అయినా ఆశవదులు కోదలచలేదు.

హెడ్ మిస్ట్రెస్ దగ్గరకు వెళ్ళాడు. రమ విషయం చెప్పింది.

ఎలా అయినా ఉద్యోగం ఇమ్మన్నాడు.

వీలుకాదంది. కాని తండ్రి పట్టుదల గుర్తుకు వచ్చింది.

రాం ముఖంలోకి చూచింది. అందమైన ముఖంలో విచారం దోబూచులాడుతూ ఉంది.

నేనేమీ చేయలేనంది మరీ మొండిగా అడుగుతున్నాడు రాం.

ఆ పోస్టు ఫిలప్ చేశామంది రమ. ఏ పోష్టుఅయినా ఫరవాలేదన్నాడు రాం.

'మీరేం పని చేయగలరు?'

'ఏ పనయినా!'

రమకు దిగులయింది. రాం మీద జాలి కలిగింది. మనిషి అందం చూస్తే కోపం వచ్చింది. ఏం పని చేసుకోకుండా ఎందుకుండాలిలా అనుకొంది. తండ్రి మాట గుర్తుకు వచ్చింది.

'రేపు రండి!', అంది. రాం ముఖంలో వెలుగు చూచింది. సన్నగా నవ్వుకొంది.

రాం ఆనందంగా వెళ్ళిపోయాడు.

రాత్రి భోజనం చేసేటప్పుడు తండ్రి అడిగాడు.

'పెళ్ళి మాట ఏమంటావు తల్లి!'

'మీ ఇష్టం!' చెప్పింది. ఆ జవాబు విని తండ్రి ఆశ్చర్యపోయాడు. ఇంత కాలమూ ఇప్పుడేం పెళ్ళి అనేది. ఆ మాట వినేదికాదు. ఎవళ్ళనూ చూచేది కాదు. ఒలపంతంగా మాట్లాడితే మండిపడేది.

అలాంటి రమ మీ యిష్టం అంటే తండ్రి పొంగిపోయాడు.

పడుకోబోయేముందు తండ్రితో చెప్పింది రమ, రాం వచ్చాడని, ఉద్యోగం లేదని చెప్పానని, దీనంగా ఉన్నాడని.

'అయ్యో' అన్నాడు. 'పాపం' అన్నాడు 'పాపం రంగనాథం' అన్నాడు.

అంతే మరేమీ మాట్లాడలేదు తండ్రి.

స్కూలుకు పోగానే ముందుగా కనిపించిన వాడు రాం.

'రండి, కూర్చోండి' అందిరమ.

ప్రెయర్‌కుపోయి వచ్చింది, అందరినీ క్లాసులుకి పంపింది.

ఎవరో టీచర్ సెలవు పెడితే ఆ క్లాసులు ఎవరు తీసుకోవాలో చెప్పింది.

తాను క్లాసుకు పోయివచ్చింది.

తన విషయం ఏమీ చెప్పకపోతే దిగులుగా కూర్చున్నాడు రాం. అడగటానికి అడగకుండా ఉండటానికి సాధ్యం కాక నీళ్ళు నములుతూ మింగుతూ కూర్చున్నాడు. చివరికి ఎలాగ్గో ధైర్యం చేసి అడిగాడు.

'నా ఉద్యోగం!'

'ఉండండి!' అంది కాఫీ ఫ్లాస్కులోంచి కప్పుల్లోకి వంచింది. 'తీసుకోండి' అంది. వణుకుతున్న వేళ్ళతో అందుకొన్నాడు.

రాం ముఖంలోకి చూస్తూ ప్రసన్నంగా చెప్పింది రమ.

'మా నాన్న మీకు ఉద్యోగం ఇస్తానంటున్నాడు. మీరు వెళ్ళి మీ అమ్మా నాన్నల్ని తీసుకువచ్చి, మా అమ్మా నాన్నలతో మాట్లాడి మా నాన్న ఇచ్చిన ఉద్యోగంలో చేరండి. అదినాకు చాలాఇష్టం. ఇక మీ యిష్టం!'

# ఒకే ఓటు

ఆమె వయస్సు ఇరవై.
పదును పెట్టిన చాకులాగా,
గిల్లెట్ బ్లేడ్‌లాగా,
అజాగ్రత్తగా ముట్టుకొంటే, తెగిపోయేటట్టుంది,
ఆమె అందం!
ఆమెను చూచేవాళ్ళకు,
కళ్ళ రెప్పల్లో కురుపులు లేస్తాయి.
రక్తంలో చేప పిల్లలు ఈదుతాయి.
ఆమె బస్సు దిగింది.
అట్టే కాలేజి రమ్మంటూ వుంది.
మధ్య విద్యార్థులు.
చేతుల్లో కాగితాలు, కరపత్రాలు.
కాలేజీ ఎలక్షన్లు.
కల్లోలం !
ఆమె వస్తూ వుంది.
అతను అడ్డం వచ్చాడు.
కాగితం ఇచ్చాడు.
"మీ ఓటు!"
అడిగాడు.
"ఊఁ!"
గొంతులో సరిగమపదనిసలు.
ఇంకొకతను.
"మీ ఓటు!"

"చూద్దాం!"

నవ్వు, పెదవి కొసలో వంకర,

వేరొకతను.

"మీ ఓటు!"

నవ్వు. కంటి కొసలు మెరుపు

మరొకతను.

"మీ ఓటు!"

వినటం మెడ ప్రక్కగా.

ఊపటం తల అడ్డంగా.

నడక వేగంగా, ఆలస్యంగా, ఆగుతూ, సాగుతూ, నిప్పు రాజుతూ, పొగ రేగుతూ, మంచుకురుస్తూ, వర్షం పడుతూ, వేడిగా, చల్లగా.

"మీ ఓటు !"

కౌగితం ఇచ్చాడు.

తల ఆడించింది.

ముంగురులు ముద్దుగా పైకి లేచాయి. పాము పిల్లల్లా పడిపోయాయి.

అటు అతను, ఇటు అతను.

మధ్యలో ఆమె !

నడుం తూర్పు, పడమరలకు తూగింది.

ఊగింది.

ఆగింది. సాగింది.

మెట్లు దగ్గర.

"ఓటు?"

"చూద్దాం."

గొంతులో కోకిల.

"ఓటు!"

"ఊఁ!"

గొంతులో పావురం.

"ఓటు!"

"ఆఁ!"

గొంతులో అమృతం.

అటు అతను! ఇటు ఇతను! ఇంకొక, మరొక, వేరొక పార్టీ, మనిషి, కేండిడేట్. ఓటు కాగితం, కరపత్రం.

ఓటు! ఓటు!! ఓటు!!! ఓటు!!!!

హోరు!

ఘోష!!

అలజడి!!!

వానలాగా, ఎండలాగా, చలిలాగా, ముసురులాగా రద్దీ!

అటు చూచింది.

ఇటు నవ్వింది.

అతనికి చేయి చూపినట్లయింది.

ఇతన్ని కళ్ళతో పలకరించింది.

నడుం నాజూకుగా కదిపింది.

కళ్ళు సుతారంగా తిప్పింది.

మెడ అందంగా వంచింది.

తల విలాసంగా ఊపింది.

చేతులు సున్నితంగా ఆడించింది.

కాళ్ళు కోమలంగా కదిపింది.

వంట్లో ఉన్న అన్ని అవయవాలు వొయ్యారాలు పోయేట్లు మెట్లు ఎక్కింది.

ఆమె మెట్లెక్కింది.

ఒక్కొక్కటి - వంకరొంకరగా - పైపైకి ఎక్కింది.

వరండాలో నిలబడింది.

క్రింద, బస్సు స్టాప్ నుంచి, మెట్ల దాకా, ఆర్ట్సు కాలేజీ ఆవరణం నిండా యువకులు, కరపత్రాలు.

ఆమె చూస్తూ వుంది.

ఓటు అడుగుతూ యువకులు ఎత్తుగా ఉన్నారు.

పై నుంచి చూస్తుంటే పొట్టిగా ఉన్నారు.

చిన్నవాళ్ళయి పోతున్నారు.

చూస్తూ వుంది. అనిపించింది వింతగా !

ఏమిటలా వున్నారు ?

మిఠాయి అంగడి చుట్టు ముసురుకొన్న కంగారు పడే పసిపిల్లలు.

బెల్లం మీద ఈగలు. బెల్లం చుట్టూ ఈగలు !

— ఆమె చూస్తూ వుంది -

ఏనుగు చుట్టూ దోమలు.

ఆహారం చుట్టూ చీమలు.

ఓట్లు అడిగే విద్యార్థులు. యువకులు.

చూస్తూ వుంది.

చిన్నచూపు చూసింది.

కళ్ళలో చిన్నచూపు చేరింది.

తనను చూచుకొంది.

వరండాలో వుంది.

మళ్ళ చూచుకొంది.

ఎత్తునుంది!

ఇంకా చూచుకొంది.

ఎంతో ఎత్తులో ఉంది.

ఎంతో ఎత్తుగా వుంది.

ఎంతో ఎదిగిపోయింది.

వాళ్ళెక్కడ? తనెక్కడ?

వాళ్ళెత్తెంత? తనెత్తెంత?

గుండెలో, రక్తంలో, నరనరాన, కణ కణాన నవ్వు.

ఆగని నవ్వు.

ఆపలేని నవ్వు.

పిచ్చినవ్వు.

చూస్తూ వుంది.

పై నుంచి క్రిందికి చూస్తూ వుంది.

అధికారి సేవకుణ్ణి!

కలెక్టరు ప్యూన్ని!

తండ్రి పసివాణ్ణి,

దేవుడు పూజారిని,

పూజారి భక్తుణ్ణి,

చూచినట్లు చూస్తూ వుంది.

వాళ్ళందరినీ చూస్తూ వుంది.

రోడ్డు మీద బస్సాగింది.

ఆర్ట్సు కాలేజీ కాంపస్‌లోకి వరదలాగా స్టూడెంట్స్.

వాళ్ళలో యువతి.

ఒంటి మీద ఆధునికత.

మనిషంతా నాగరికత

"ఓటు!"

విద్యార్థి

"ఓటు!"

యువకుడు

"ఓటు! ఓటు!! ఓటు!!!"

ఆటు విద్యార్థులు, యువకులు.

ఇటు విద్యార్థులు, యువకులు.
ఎటు చూచినా యువక విద్యార్థులు !
ఓటు కోసం
యువతిని ప్రాధేయపడుతున్నారు.
ప్రతిమాలుతున్నారు.
ఆమె చూస్తూ వుంది.
నవ్వులో వెలితి.
నవ్వులో అపధ్వని
నవ్వులో ఎగతాళి.
నవ్వు అసహ్యంగా మారింది.
క్రీగంటి కొసలో నీడ !
గొంతు ధ్వనిలో పీడ !
ఆమె చూస్తూ వుంది.
యువతి చుట్టూ యువకులు.
బెల్లం చుట్టూ ఈగలు.
ఏ బెల్లమయినా మూగే ఈగలు.
యువకులంతా యువతి చుట్టూ! ఓటు అడుగుతున్నారు.
ఒకే ఓటు !
పాతిక గొంతులు.
కంటిలో మెరుపు నీటి చెమ్మతో తడిసిపోతూ వుంది.
తననెవరూ అడగటం లేదు.
చుట్టూ ఎవరూ లేరు.
వరండాలో చాలా ఎత్తులో అందనంత ఎత్తులో వుంది.
ఒంటరి !
ఒంటరితనం అన్ని దిక్కుల్నుంచి ముసిరింది.
క్రిందికి చూస్తూంటే, కళ్ళు తిరుగుతున్నాయి.

ఓటు !
ఒకే ఓటు !
ఇస్తానంటే, ఇస్తే - ఔట్ -
ఏమీ ఉండదు.
క్రిందికి చూస్తూ వుంది.
కంట్లో తడిసిన వెలుగు !
ఒంట్లో ఆరిన రక్తం !
గొంతులో ఏడుపు !
మెట్ల మీద యువతీ యువకుల నవ్వు !
చుట్టూ ఒంటరితనం
ఒకే ఓటు !

# ఏ మూ తా డు ?

చంద్ర రిక్షా తొక్కుతున్నాడు. అతడి వయస్సు పదహారు సంవత్సరాలు. పదో తరగతి చదువుతున్నాడు.

సులువుగా సునాయాసంగా సైకిల్ తొక్కినట్టే రిక్షా తొక్కుతున్నాడు. చంద్ర ఎప్పుడూ రిక్షా తొక్కడు. ఆ రోజే అప్పుడే తండ్రి చూస్తూ వుండగా రిక్షా తొక్కు తున్నాడు.

బెల్ కొడుతున్నాడు, బ్రేక్ వేస్తున్నాడు, టర్నింగు తిప్పుతున్నాడు. ఆరి తేరిన వాడిలా రిక్షాని పరిపాలిస్తున్నాడు.

చంద్ర రిక్షా తొక్కగలడని తండ్రి రంగయ్యకు తెలీదు. చూడలేదు. వినలేదు. ఊహించలేదు. రంగయ్య చంద్రను రిక్షా తొకనియ్యలేదు. కనీసం రిక్షాలో చంద్రను తీసుకొని కూడా పోలేదు.

రిక్షా రంగయ్య యావదాస్తి, ఇంట్లో స్థిరాస్తి రోడ్డుమీద చరాస్తి.

చంద్రను రిక్షా దగ్గరకైనా రానిచ్చే వాడు కాడు కదా అతడికి రిక్షా తొక్కడం ఎలా అలవాటయింది.

చేప పిల్లకు ఈత నేర్పక్కరలేదు కాని రిక్షా తొక్కే వాడి కొడుక్కయినా నేర్చుకోక పోతే తొక్కడం చేత కాదు.

రాజు కొడుకు రాజు కావడం సులభమే కాని రిక్షా తొక్కే వాడి కొడుకు నేర్చుకోక పోతే రిక్షా తొక్కేవాడే కావటం అంత సులభం కాదు.

వాడు సింహాసనం మీద అనాయాసంగా కూర్చోవచ్చు. వీడు సీటు మీద సునాయాసంగా కూర్చోలేదు.

చంద్ర రిక్షా తొక్కుతుంటే రంగయ్య గుండె పట్టుకూర్చున్నాడు. ఆశ్చర్యమయ్యి కాదు. గుండె ఆగే అంత పని అయ్యి కాదు. రంగయ్యకు గుండె జబ్బు.

చంద్ర స్కూలు నుంచి ఇంటికొచ్చేసరికి గుడిసెముందు గుండె పట్టుకుని కాళ్ళూ చేతులూ విదిలిస్తూ తన్నుకులాడుతూ రంగయ్య పడివున్నాడు.

చంద్ర చూశాడు. తండ్రి చనిపోతాడేమోనని భయపడ్డాడు.

రంగయ్య కొడుకు రావడం చూశాడు. రిషా లాగడం చూశాడు. రిషాలో కూర్చో పెట్టడం చూశాడు.

చంద్ర రిషా తొక్కడం చూశాడు.

గుండె నొప్పి పోయినంత సంతోషమూ అయింది. గుండె ఆగిపోయినంత ఏడుపూ వచ్చింది.

సంతోషమెందుకంటే తన కొడుకు తనను హాస్పటల్‌కు తీసుకుపోతున్నందుకు.

అరగంటనుంచి తాను తన్నుకొంటుంటే చూచిన దిక్కులేదు. పలకరించిన ప్రాణి లేదు. ఆదుకొన్న అండలేదు.

కొడుకు రాకపోతే తాను హాస్పటల్ ముఖమైనా చూడకుండా చూచే దిక్కు లేకుండా దిక్కుమొక్కు లేని చావు చావ్వలసి వచ్చేది.

ఇప్పుడు చస్తే రిషా వుంది. కొడుకు వున్నాడు. హాస్పటల్‌లోకి పోతే ఎంతోమంది జనం. ఎంతోఅండ. ఎంతోకొంత మేలు.

రంగయ్యకు ఏడుపు ఎందుకొచ్చిందంటే చంద్ర రిషా తొక్కుతుంటే చూడలేక. అంటే చంద్ర రిషా తొక్కుతూ అసహ్యంగా వున్నాడనికాదు. ఇష్టం లేక. చంద్ర రిషా తొక్కటం ఇష్టంలేక.

చంద్ర చదువుకోవాలని, గొప్పచదువు చదవాలని, గొప్ప వుద్యోగం చేయాలని రిషాలో ఎక్కి కూర్చోగలవాడే కావాలి కాని తొక్కేవాడు కారాదని రంగయ్య ఆశ ఆశయం!

చంద్ర తనంతట తాను రిషా ఎక్కగలిగేవాడు అయిందాకా రిషాలో కూర్చోబెట్టకూడదని పసివాడుగా వున్నప్పుడుకూడా నడిచే బడికి పోయేటట్లు చూశాడు రంగయ్య.

రిక్షా తాకితే నడుపుదామని బుద్ధిపుడుతుందేమోనని దగ్గరకు కూడా చేర నిచ్చేవాడుకాదు.

ఈ పరిస్థితిలో చంద్ర రిక్షా తొక్కగలిగి నందుకు ఆనందం, తొక్కుతున్నందుకు దిగులు పెనవేసుకొని గుండెను పిండుతున్నాయి.

రంగయ్య రిక్షాలో గిలగిల్లాడుతూ కూర్చున్నాడు. కాళ్ళు చేతులూ పీకి నట్లుగా ఎదో జరుగుతున్నట్లుగా చలిచలిగా చెమట పడుతూ వళ్ళంత తిమ్మిరిగా గుండెను గుప్పెట్లో బంధించినట్లుగా నొప్పి.

ఎదురుగా లారీ వచ్చింది. పక్కనుంచి కారు వచ్చింది. అటునుంచి ఆటో వచ్చింది. రంగయ్య పరిస్థితిని చూశాడు. ఇక్కడే చచ్చిపోతాననుకొన్నాడు. కాని చంద్ర రిక్షాను అటుతిప్పాడు. ఇటుతిప్పాడు. లారీకి పక్కగా కారుకానుకొని సుళువుగా సూత్రంగా తప్పించి రిక్షాను నడుపుకుపోయాడు.

ఈ అరనిముషం ఆగిపోయిన రంగయ్యగుండె మళ్ళీ నొప్పి పుట్టసాగింది.

చంద్ర ఇంత నేర్పుగా రిక్షా తొక్కటం ఎప్పుడు నేర్చుకొన్నాడు.

రాత్రుళ్ళు.

రిక్షాను గుడిసె ముందు పెట్టి రంగయ్య అలసిపోయిన శరీరాన్ని నిద్రకు అప్పగిస్తే, చంద్ర విశ్రాంతి తీసుకొన్న శరీరాన్ని రిక్షాకి అప్పగించేవాడు.

తండ్రి చూస్తున్నప్పుడు చంద్ర రిక్షాను పామును చూసినట్లే చూస్తే తండ్రికి పరమానందం.

తండ్రి నిద్రపోయింతర్వాత రిక్షాని స్నేహితుణ్ణి పలకరించినట్టు దగ్గరకు పోతే, రిక్షాకి పరమానందం.

రిక్షా రోడ్డుమీద వీరవిహారం చేసేది.

కొడుకు చెడిపోయాడని తండ్రికి తెలీదు.

రిక్షా తొక్కితే చంద్ర చెడిపోయినట్టేనని రంగయ్య నమ్మకం!

కాని కొడుకు బాగుపడ్డట్టు తెలిసింది.

ఏ క్లాసూ తప్పంపోతే కొడుకు బాగా చదివినట్లే, బాగుపడ్డట్టే రంగయ్య విశ్వాసం.

మార్కులేమిటో వాట ఎక్కువ తక్కువలేమిటో రంగయ్యకు తెలీదు.

అందరికంటే తనకు ఎక్కువ మార్కులొస్తున్నాయని చంద్ర చెబితే రంగయ్య పట్టించుకోడు.

పై క్లాసుకి చంద్ర పోయిన రోజు రంగయ్యకు పండుగ, పబ్బం, పర్వ దినం.

అదేమిటో పదహారు సంవత్సరాలకే చంద్రకు వయసుకు మించిన వళ్ళు. తండ్రి లాగానే భారీ శరీరం. అంతే బలం. అంతే తెలివి, చురుకు. దర్జా.

మీసం చేతికందుతున్న వయస్సు.

కొడుకును చూస్తుంటే హాస్పటల్ దగ్గరకొచ్చినట్లే అయింది.

అదే రోడ్డున పదహారు సంవత్సరాల పూర్వం నిండు మనిషి సుబ్బమ్మని రంగయ్య హాస్పిటల్‌కి తీసుకుపోతూ వుండగా, రిక్షాలో పెళ్ళాం నొప్పులు పడుతుంటే, గుండె నొప్పి వచ్చినట్లు, కాళ్ళూ, చేతులూ ఆడక ఎదురు లారీ గుద్దుకొని ఇటు తాను, అటు పెళ్ళాం ఆ పక్క కొడుకూ పడి, ముగ్గురం ఒకేసారి అరిస్తే వినిపించుకోకుండా లారీ వెళ్ళిపోయింది.

కానుపు చేయించటానికి భార్యను రిక్షాలో చూలింతగా తీసుకుపోతున్న రంగయ్య కాన్పు అయిన భార్యను బాలింతగా హాస్పటల్లో చేర్పించాడు.

ఎవరికీ ఏ ప్రమాదం రాకుండా తప్పిపోవటం అరక్షణంలో కాన్పు అయి పోవడం ఎప్పుడు తలచుకొన్న తనకానందం కలుగుతుంటే సుబ్బమ్మ మాత్రం ఏడుస్తోంది.

మనలో ఎవరమయిన చనిపోయి వుంటే ఏమయ్యేది అని ఏడుపు.

ఆ పైనే తనని రిక్షా తొక్కవద్దని బతిమాలింది.

రంగయ్య ఆలించలేదు. ఆలిమాట పాలించలేదు. వేరే కూలి లేదు..

ఈ చంద్ర ఆ రోజు పసిగుడ్డుగా ఇక్కడే పడిందని దాటిపోతున్న రోడ్డుకు మొక్కాడు రంగయ్య.

పెళ్ళాం గుర్తుకొచ్చి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

పొద్దుట బాగున్న సుబ్బమ్మ, మధ్యాహ్నానికి చాప బట్టింది. ఏమయిందో ఏమో అంతు తెలయని జబ్బు.

సుబ్బమ్మ పోతుందని రంగయ్యకు ఎందుకో అన్పించింది.

అప్పుడే అ, ఆలు నేర్చుకొంటున్న చంద్రను దగ్గరకు తీసుకొని వీణ్ణి బాగా చదివించండి అని వేడుకొంది.

తాను సరేనన్నాడు.

రిక్షా తొక్కనివ్వకండి అంది.

తాను సరేనన్నాడు. కాని సుబ్బమ్మ వినలేదు. శూన్యంలో శూన్యం!

రంగయ్య ఆ రోజు నిర్ణయించుకొన్నాడు.

కొడుకును చదివించాలని పెద్దవాణ్ణి చేయాలని.

కొడుకు బాగా చదువుకుంటున్నాడు.

బాగా రిక్షా తొకుతున్నాడు.

బాగుపడ్డాడా? చెడిపోయాడా?

తండ్రి గుండె నొప్పితో సతమతమయిపోతున్నాడు.

చిన్నతనంలో తల్లి ఎవరో తండ్రి ఎవరో తెలియని వయస్సులో పట్నంలో తిరుగుతున్న పిల్లవాణ్ణి చేరదీసి, పెంచి, పెద్దచేసిన బిచ్చగత్తె కూతుర్నిచ్చి పెళ్ళిచేసి గతించిపోయింది.

కూతురు సుబ్బమ్మా కాలంచేసింది.

బంధువులు లేని రంగయ్య రోడ్డుపక్క పి.డబ్ల్యూ.డి. కాంపౌండును ఆనుకొని అత్త వేసుకొన్న గోనెసంచి పాకను రేకులపాకగా మార్చుకొన్నాడు.

మొదట్లో రెండు చక్రాల రిక్షాను లాగాడు, ఆపైన మూడు చక్రాల రిక్షాను తొక్కాడు. అవి బాడుగ రిక్షాలు.

ఈమధ్య తన జీవితమంతా పైసా పైసా పోగుచేసిన డబ్బుతో సొంత రిక్షా కొనుక్కున్నాడు.

సొంత రేకుల గుడిసెముందు ఇంతకుముందు గిలగిలా కొట్టుకున్నాడు.

సొంత రిక్షాలో ఇపుడు తానున్నాడు.

తన కొడుకు - తన కొడుకు - ఇప్పుడు తనను హాస్పటల్‌కి తీసుకు పోతున్నాడు. ఎప్పుడూ ఏమీ లేని తాను ఇవాళ ఇంతగా సొంతదారు.

ఏమీలేని రోజుల్లో చావుభయంలేదు.

అన్నీ వున్న రోజు అదీ వుంది.

రంగయ్యకు కొడుకు రిక్షా తొక్కడం ఎంతో ఆనందం. ఎంతో దుఃఖం.

ఒక దాని వెనక మరొకటి తరుముతున్నాయి.

హాస్పటల్ దగ్గర రిక్షా ఆగింది. రంగయ్య చూశాడు. విచిత్రమైన అనుభూతి.

ఇంతకాలం ఎంతో మందిని హాస్పటల్‌కి తీసుకొని వచ్చి వుంటాడు. ఇలా ఏ రోజు అనిపించలేదు. తను చనిపోతానేమో అనిపించింది. బ్రతుకుతానేమో అనుకొన్నాడు.

కాని చంద్ర మీదే ఆలోచనంతా లగ్నమయింది.

చంద్ర భవిష్యత్తు ఏమిటని ఆలోచన.

తాను చనిపోతే చంద్ర ఏమౌతాడు?

చదువు బాగా చదివి ఉద్యోగం చేస్తాడా?

చదువు మానేసి రిక్షా తొక్కుకుని జీవిస్తాడా?

ఏమౌతాడు?

కొడుకు బాగా చదివి ఉద్యోగం చేస్తాడని నమ్మకం కుదిరితే తండ్రి నిశ్చింతగా చనిపోతాడు.

చదువు మానేసి రిక్షా తొక్కుకుంటాడని విశ్వాసం కుదిరితే రంగయ్య నిశ్చయంగా బ్రతుకుతాడు.

ఆర్థికంగా, హార్దికంగా, అయోమయంగా వున్న ఈ సమాజం రంగయ్యను చనిపోనిస్తుందా ?

బ్రతకనిస్తుందా?

చంపుతుందా?

బ్రతికిస్తుందా?

తండ్రి ఏమౌతాడు?

చంద్ర ఏమౌతాడు?

# ఏది గమ్యం ?

రవి రాము ఎం.ఏ. క్లాసులో చేరిన మొదటి రోజుల్లోనే నాకు పరిచయ మయ్యారు.

రవి చక్కగా బట్టలు వేసుకొంటాడు. రాములో వినయం విశేషం.

రవికంటే రాముకే ఎక్కువ మార్కులు బి.ఏ.లో. రవి చూపుల్లోంచి ధనం రాలుతుంది. నవ్వితే నవరత్నాలు ఏ మహారాణికో రాలినట్లు.

రాము పుస్తకాల పురుగు. పురుగు పుస్తకం స్వరూపం తింటుంది. రాము స్వభావం తింటాడు.

రవి మెళ్ళోని బంగారు గొలుసు ఎప్పుడూ కొరుకుతూ ఉంటాడు. పై జేబు లోని నూరు రూపాయల నోటు 'హలో' అంటుంటుంది.

రవి, రాము హాస్టల్లో ఒకే రూం. ఒకరోజు వాళ్ల రూం చూశాను.

ఒక పక్క సంపన్నత కనిపించింది. మరో పక్క బీదతనం కిటికీలోంచి వచ్చే గాలికి రెపరెప కొట్టుకొంటూ ఉంది.

రవి మంచం అందగత్తె కాశ్మీర జాపుకు కూర్చున్నట్లుంది. రాము పడక సౌమ్యమైన ఇల్లాలు సాదుచుక్క పెట్టుకొన్నట్లుంది.

రాము బట్టలు, పుస్తకాలు, పడక సర్దుకొన్న తీరుచూస్తే ఎంతో ముచ్చటగా ఉంది.

రవి బట్టలు విలువైనవే. అరుదైన పుస్తకాలు కొన్నాడు. పడక సుఖం తెలిసినవాళ్ళకే ఆ మంచం అందం తెలుస్తుంది.

రవి సూర్యుడు కావచ్చు.

రాము చంద్రుడే !

-11

కాని వాళ్ళిద్దరు సూర్యచంద్రులుకారు. కారణం ఏమీలేదు. సూర్యచంద్రులు కలిసిరారు. కలిసిపోరు.

కాని రాము, రవీ, కలిసి కాలేజీకి వస్తారు. కలిసి హాస్టలుకు వెళతారు.

ఒకరు కనిపిస్తే మరొకరు పక్కనే ఉన్నట్లే లెక్క. ఉండి తీరతారు.

రవి బట్టలు రాము లాండ్రిలో వేసినప్పుడు, పుస్తకాలు క్లాసుకు తీసుకు వచ్చినప్పుడు నాకు ఎంతో సంతోషం కలిగింది. మిత్రులంటే అలా ఉండాలి, అనుకొన్నాను.

కాని రవి ఎసైన్‌మెంటు రాము వ్రాసినప్పుడు నాకు అదోలా అనిపించింది.

అయితే తాను రాయవలసిన ఎసైన్‌మెంటు రాయకుండా, రవి రాయవలసింది వ్రాస్తే బాధ అనిపించింది.

రవితో 'నువ్వెందుకు ఎసైన్‌మెంట్ రాయలేదు'? రాముతో ఎందుకు రాయించా' వంటే 'నా పేరు మీద నాలుగు కాగితాలు ఎసైన్‌మెంటు పేరుతో ఉంటే చాలదా?' అని నవ్వేశాడు.

ఆ మాటే రాముతో అంటే 'అది రాయటంవల్ల వచ్చే లాభం వచ్చేసింది కదా - పేరు ఎవరిదైతేనేం ?' అని ముఖం దించేసుకొన్నాడు.

ఒక రోజు సినీమా నుంచి వస్తుంటే రవి కనిపించాడు. ఒక్కడే కనిపించటంతో విచిత్రంగా అనిపించి పలకరించాను.

'రాము ఏడి ?'

'ఏమో' వెళ్ళి పోతున్నాడు. అలా వెళ్ళి పోతుంటే నాకు చిన్న తనమనిపించింది.

నేనంటే రవికి చాలా ఇష్టం !

అతను అలంకరించుకొనే తీరు నాకూ ఇష్టం. అతణ్ణి చూస్తుంటే పాతికేళ్ళ నాటి నన్ను నేను చూచుకొన్న భావన కలుగుతుంది.

రవి నా క్రెనిడో ఏమో నాకు అమితంగా గౌరవం చూపించే వాడు.

ఏదైనా పని చేసుకొంటూ 'పోయిరా' అని చెప్పిందాక పోసి రవి ఏమో అని వెళ్ళిపోతుంటే మతిపోయి చూస్తూ నిలబడ్డాను.

అల్లంత దూరం పోయి, ఆగి, వెనుదిరిగి చూచి, వెనక్కు వచ్చి. 'రేపు మిమ్మల్ని కలుసు కొంటాను' అని ఆగకుండా వెళ్ళిపోయాడు.

వెళుతుంటే వాసన వచ్చింది.

ఏమైనా తాగి ఉంటాడా అనిపించి వళ్ళు జలదరించింది

రవి సరదాగా ఉంటాడు. సోమరిగా ఉంటాడు. డబ్బు ఉంది కాబట్టి తగలబెతాడు విలాసంగా. కానీ చెడ్డవాడు కాదు. చెడు అలవాట్లు లేవు.

రవిని గురించి చెడ్డగా ఆలోచన వచ్చినందుకు బాధపడి వెళ్ళిపోయాను.

మర్నాడు ఉదయమే కనిపించి, ఏమీ అనుకోవద్దండి ఏదో తాగాను, ఏమో వాగాను' అన్నాడు నాకు మత్తెక్కింది. తలతిరగటం ప్రారంభమయింది.

'నిజమేనా?'

'పొరపాటయిపోయింది' అని దిగులుగా నిలబడ్డాడు.

హుషారుగా ఉండే రవి అలా అయిపోతే నాకేం బాగాలేదు.

'తాగకూడదు' అన్నాను కాని నాకేమీ నచ్చలేదు. నేనన్నమాట.

'తాగను' అని గోళ్ళు గిల్లుకొంటూ నిలబడ్డాడు.

'ఏం' అని ముఖంలోకి చూస్తే 'నిన్న స్కాలర్‌షిప్ వచ్చింది. ఏదో చేద్దామనిపించింది. మన్నించండి' రవి వెళ్ళిపోయాడు.

రవికేం స్కాలర్‌షిప్ వచ్చింది? హరిజనులకు స్కాలర్‌షిప్ వస్తుంది. వాళ్ళు సాధారణంగా బీదవాళ్ళు! అంత బీదవాళ్ళు లోకంనిండా ఉన్నారు. కాని వాళ్ళకున్న సాంఘిక దోషం - అంటరానితనం - అందరికీ ఉండదు. వాళ్ళకది పోగొట్టటానికి బీదవాళ్ళలోనే ప్రాధాన్యం ఇస్తారు. హరిజనుల్లో ధనవంతులుకి కూడా స్కాలర్‌షిప్‌రాదు.

రవి హరిజనుడు అనిపించడు. అయినా ధనవంతుడు.

గిరిజనులకు ప్రభుత్వ స్కాలర్‌షిప్ వస్తుంది.

ఈ దేశంలో అందరికీ ఇల్లూ, వాకిలీ ఉరూవాడా ఉన్నాయి, గిరిజనులకు తప్ప.

ఈ దిక్కుమాలిన వాళ్ళకు దేశదిమ్మరులకు సంఘజీవితం కోసం జరిగే ప్రయత్నంలో విద్యా, స్కాలర్‌షిప్ బాగున్నాయి.

రవి గిరిజనుడు కాదు.

అంటతానితనందోషంలో కూరుకొని పోయినా, దేశదిమ్మరులు కాక పోయినా సంఘంలో కొంతభాగం చేసుకోలేని, కొందరిదృష్టిలో నీచమైన వృత్తులు చేసుకొనేవాళ్ళు సమాజంలో ఆర్థికంగా వెనకబడి ఉన్నారు. ఈ వెనుకబడినవాళ్ళు ముందుకు రావటానికి చదువూ స్కాలర్‌షిప్పు పేరిట ధన సహాయమూ న్యాయమే.

రవి వెనుకబడిన తరగతివాడు కాదు.

పేరుకేమో ఉన్నతకులమే, అయినా డబ్బులేక, చదువు సాగక, అయోమయంగా బ్రతుకు ఈడుస్తున్నవాళ్ళు ఈ దేశంలో ఎంతో మంది ఉన్నారు.

వాళ్ళకూడా మరీ బీదవాళ్ళయితే ప్రభుత్వం ధనసహాయం చేయటం న్యాయమే!

ఉన్నత కులాలలో మరీ బీదవాళ్ళకు ప్రభుత్వమిచ్చే స్కాలర్‌షిప్పు రవికి వచ్చిందని తెలిసి ఆనందించాను. బాధ కలిగింది.

రామూ, రవీ ఒకే కులంవాళ్ళు!

'నీకు స్కాలర్‌షిప్‌రాలేదా?' అని రాముని అడిగాను.

ఎందుకు రాలేదంటే 'మా నాన్న ఉద్యోగికదా' అన్నాడు.

ఏం చేస్తాడంటే 'అటెండరు' అని జవాబు చెప్పాడు.

అయినా నువ్వు పేదవాడివేకదా అంటే నాకంటే పేదవాళ్ళకు మాత్రమే స్కాలర్‌షిప్పు ఇస్తారని చెప్పాడు.

రవి నీ కంటే పేదవాడా అని అడిగితే కాదని వెళ్ళిపోయాడు.

రవి రాముకంటే తెలివైన వాడూ కాదు.

రాముని నేను ఎంత ఆప్యాయంగా పలకరించబోతే అంతగా తప్పించుకు పోతాడు.

రాము చదువు, తెచ్చుకొనే మార్కులు, చూపే వినయం, నాకు ఆత్మీయంగా అనిపిస్తాయి.

రవికి ఇంటి దగ్గర్నుంచి డబ్బు బాగా వస్తుంది. రాముకు అంత రాదు.

రవి రెండు రోజుల్లో ఖర్చుపెట్టే డబ్బు రాము నెల రోజుల్లో కూడా ఖర్చు చేయడు.

రవి జేబులో ఎప్పుడు చిన్న బేంకు ఉంటుంది. రాము జేబులో చిల్లర కూడా ఉండని రోజులుండవచ్చు.

స్కాలర్ షిప్పు రాముకు రాకుండా పోవటం కష్టమనిపించింది.

రవికి రావటంలో చింతలేదు. రాముకు రాకపోవటంలో బాధ ఉంది.

రవి మాట రాము జవ దాటడు. ఏం చేయమంటే అది చేస్తాడు.

అలా ఎందుకు చేయాలా అని అనుకోడు. అనుకొన్న వాళ్ళకు జవాబూ దొరకదు.

ఇద్దరూ వెళితే కాఫీ బిల్లు రవి ఇస్తాడు. రాము ఇవ్వటానికి కూడా ప్రయత్నించడు

వీళ్ళిద్దరికీ స్నేహం ఎలా అయిందా అని తెలుసుకొనే ప్రయత్నం చేస్తే వాళ్ళు చిన్నప్పణ్ణుంచి కలసి చదువుకొన్నారని విన్నాను.

ఒకే ఊరు!

కొంత బంధుత్వం ఉంది.

కొంత మైత్రి ఉంది.

ఈ మైత్రి బంధుత్వం వెనక దాస్య మనస్తత్వం ఉందనిపించింది.

ఆవేశపరులకు అంతా అలా అనిపిస్తుందని సర్ది చెప్పుకొన్నా తట్టుకో బుద్ధి కావటం లేదు.

రవి దర్జా, ఠీవి చూస్తుంటే చూడాలని బుద్ధి పుడుతుంది. స్నేహం చేయాలని ఆశ కలుగుతుంది.

రాము కూడా అటువంటి ఆకర్షణకే లొంగి ఉండాలి.

ఈ తలనొప్పి ఎందుకు లెమ్మని వాళ్ళ విషయం ఆలోచించటం మానేశాను.

కానీ ఓకరోజు రాము వాళ్ళనాన్న కనిపించాడు.

ఉన్నా కాస్తంత పొలం పుట్ట రవి వాళ్ళ తండ్రి కాజేస్తే ఆ వూళ్ళో ఉండలేక, భార్యనూ కొడుకునూ తీసుకువచ్చి అటెండరుగా చేరి కాలం గడుపుతున్నానని చెప్పాడు.

పట్నం వచ్చిన రవితో రాముకు మళ్ళీ కాలేజీతో కలయిక. డిగ్రీ కలిసే చదువుకొన్నారు.

రామువాళ్ల తాత రవివాళ్ల తాత దగ్గర ఊడిగం చేశాడు. పార్టీ కక్షల్లో చనిపోయాడు.

రామువాళ్ల ముత్తాత, రవివాళ్ల ముత్తాత స్నేహంగా ఉండేవాళ్ళు. దోపిడీ దొంగలముఠా బారినుంచి రాము ముత్తాత రవి ముత్తాతను రక్షించి గతించాడు.

వంశపారంపర్యంగా రాము వాళ్ళు రవి వాళ్ళకు సేవలు చేస్తూ జీవించారని తెలిసి రాము ప్రవర్తన నాకు అర్థమయింది.

అయితే రాము తండ్రి ఆ రొంపి నుంచి తప్పించుకో చూశాడు కదా, రాము ఎందుకా ప్రయత్నం చేయలేదూ అని నాకు తపన పుట్టిన మాట నిజం.

రాము తండ్రికి చేనుంది. పొలం ఉంది. ఒక ఊరు శిస్తు అంతా రాము తండ్రి కడుతూ ఉంటాడు. ఇది కరువు నేల. పంటసరిగా పండదు. గింజ ఇంటికి రాదు.

వచ్చినేడు ఫరవాలేదు. రానేడు విత్తనాలు కూడా దండగ.

పంట పండకపోయినా, పండలేదని చెప్పినా ఆదాయం హద్దులో సర్టిఫికెట్టు పుడుతుంది.

వందెకరాల ఆసామి కొడుకు కూడా ఈ సర్టిఫికెటు పొందవచ్చు.

అటెండరు కొడుకు మాత్రం ఆ సర్టిఫికెటు పొందలేదు.

స్కాలర్‌షిప్ రాదు.

గుండెకోతగా ఉన్నమాట మాత్రం నిజం.

ప్రభుత్వం మారింది. లెక్కలు సరీగ్గా తేలలేదు. డబ్బు కనిపించలేదు.

ఉన్నత కులాల వాళ్ళ బీదతనం స్కాలర్‌షిప్పుల మీద కొంతపడింది.

అందరికీ స్కాలర్‌షిప్ రాలేదు.

రెండో సంవత్సరం రవికి కూడా రాలేదు.

యోగ్యులయిన కొందరికి స్కాలర్‌షిప్ రాకపోయి కష్టమూ తెలిసి వచ్చింది.

వాళ్ళు మెస్‌లో బిల్లు కట్టలేకపోయారు.

హాస్టల్లో ఇబ్బందిగా ఉండటం మొదలయింది.

వీళ్ళు ఆ ఆఫీసు ఈ ఆఫీసు చుట్టూ తిరిగారు.

ఫలితం లేకపోయింది.

వాగ్దానాలు ఉన్నాయి. స్కాలర్‌షిప్పులే రాలేదు.

ఆందోళన ప్రారంభమయింది.

రవిని ఈ గొడవమనకొద్దని రాము హెచ్చరించకపోలేదు. తనకు రాకపోయినా చింతలేదు కానీ, నీలాంటి యోగ్యుడికి స్కాలర్‌షిప్పు రాకపోవటం ఏమీ బాగాలేదని రవి మండిపడ్డాడు.

నాకు ఎలాగూ రాదుకదా అనుకొన్నాడు రాము. నీకు స్కాలర్‌షిప్ రాలేదుకదరా అని దిగులుపడనందుకు బాధపడలేదు. సానుభూతి చూపించినందుకు ఆనందించాడు రాము.

విద్యార్థులంతా క్లాసులు మానేశారు. నినాదాలు చేశారు. బస్సులాపారు. రైళ్ళాపారు.

పోలీసులు లా అండ్ ఆర్డరు కాపాడాలి. విధి నిర్వహణం కోసం వచ్చారు.

పోలీసుల్ని చూస్తే విద్యార్థులకు పోలియో వచ్చింది.

నినాదాలు చేస్తున్న వాళ్ళు వంకరటింకరగా పరుగెత్తారు.

రవి పక్కనే రాము పరుగెత్తాడు 'ఇక్కణ్ణువు పనికిరావు. రూంకుపోరా' అన్నాడు రవి 'పోనుపో' అన్నాడు రాము.

రోడ్లు వేయించటానికి, ప్రయాణాలు సుఖంగా సాగేటట్లు చూడటానికి ప్రక్కగా రాళ్ళు తోలించారు.

దొరికిన రాయి దొరికినట్లు పుచ్చుకొని విద్యార్థులు విసరటం ప్రారంభించారు.

తగలందలచుకొన్న రాళ్ళు తగులుతున్నాయి. తప్పించుకో దలుచుకొన్న రాళ్ళు తప్పించుకొంటున్నాయి.

పోలీసులు లాఠీలు తిప్పటమూ మొదలయింది.

రాయి ఎంత దూరానికయినా విసరవచ్చుననేది అందరికీ తెలిసిన సంగతే!

లాఠీతో దగ్గరున్న వాడినే కొట్టటానికి వీలవుతుందనేది రహస్యంకాదు.

అందువల్ల పోలీసులు ఎవర్నీ కొట్టలేక పోయారు,

అయితే విద్యార్థులు విసిరినరాళ్ళు తగిలాయి.

'మనం రాళ్ళు విసరొద్దు పోదాంరా' అని రాము రవిని లాగుతూ ఉన్నాడు.

రవి విడిపించుకొని రాళ్ళు విసురుతూ ఉన్నాడు.

పోలీసులు టియర్‌గాస్ వదిలారు. అయినా రాళ్ళ వర్షం,

'నువ్వేరూంకు పోతావా? తన్నమంటావా?' అంటూ రవి రామును కసురుకొన్నాడు.

'నిన్ను ఇక్కడవదలి పోను' అని మొండికేసి 'రా రూంకు పోదాం!' అన్నాడు.

'పోపో-రేయ్‌పోపోరా' అని రాళ్ళు విసురుతూనే ఉన్నాడు. రవి.

'ఫైర్ చేస్తున్నాం వెళ్ళిపొండి' అని మైక్‌లోంచి, పోలీసు వేన్‌లోంచి విని పించింది.

రాళ్ళ వర్షం!

తుపాకీ గుండు!

పిట్టల్లా లేచి పరుగెడు తున్నారు విద్యార్థులు.

'పారిపోవద్దు! ఉండండి' అంటూ ఆపుతున్నాడు రవి.

'పోదాం రారా!' అని రవిని పట్టుకొని పీకులాడుతున్నాడు రాము.

తుపాకీ పేలింది.

రాము పడిపోయాడు.

వాతావరణం చుట్టూ అల్లకల్లోలంగా ఉంది. నిర్మానుష్యం అయిపోయింది.

రామును వేన్‌లో వేసుకుపోయారు

ఆ పైన చాలా గందర గోళం జరిగింది. నేను తల స్నానం చేశాను.

తల నీటిలో కన్నీళ్ళు కరిగి పోయాయి.

హాస్టల్లో, రూంలో, రవి పిచ్చివాళ్ళా కూర్చున్నాడు.

బోసిగా ఉన్న గదిలో ఏకాకిగా దిగులుగా ఉన్న రవిని ఏమని పలకరించాలో తెలియలేదు.

తిరిగి వస్తుంటే నా వెనక నా నీడ నా అంత వేగంగా నడచి వస్తూ ఉంది.

# ప్రమాదం

సాయంకాలం ఆరు గంటలకు రోడ్డు మీద ప్రమాదం.

పల్లెనుంచి పత్తి సంచులతో వస్తున్న రెండెడ్ల బండిని వెనుకనుంచి వస్తున్న బస్సు గుద్దింది.

బండి తలక్రిందులుగా పడింది. ఎడ్లు రెండూ దూరంగా పడ్డాయి.

పత్తి సంచులు చెల్లా చెదురుగా పడ్డాయి. రెండు మూడు పగిలాయి. పత్తి చుట్టూ పడింది.

బండి తోలుతున్నవాడు బోల్తాపడ్డ బండి కిందున్నాడు.

పక్కన కూర్చున్నవాడు పత్తి సంచుల మీద వున్నాడు.

ఎడ్లు చచ్చి పోయాయి. మనుషులకు ఊపిరి ఆడుతూ ఉంది.

బస్సు అక్కడ లేదు. ఎటు పోయిందో తెలియదు.

అది అడవి కాదు. నగరం. పూర్తి నగరం కాదు. నగర ప్రవేశం.

చుట్టూ ఇళ్ళున్నాయి. ఇళ్ళు కావు గుడిసెలు.

జనం ఉన్నారు. బస్సును చూశారు. నెంబరుంటుందని, చూడ వచ్చునని, గుర్తు తెలుస్తుందని, కొందరికి తెలియదు. అంటే కొందరికి తెలుసు. అయితే ఎవరికీ నెంబరు చూడటం తెలియదు.

బస్సు ఇటయితే పోయింది కాని, ఎటు పోయిందో -

బస్సులో జనం లేరు. జాతీయం అయింతర్వాత బస్సులు కొన్ని కులాసాగా తిరుగుతున్నాయి కొన్ని బస్సులు జనంలేని వూళ్ళకుపోయి వస్తున్నాయి.

బస్సు పోతేపోయింది. జనం వచ్చారు.

ఊపిరి ఆడుతున్న ప్రాణుల్ని రోడ్డుమీద పడుకోబెట్టారు.

పోలీసులకు కబురు చేయాలనుకొన్నారు

హాస్పటల్‌కి తీసుకుపోలనుకొన్నారు

కారుతున్న రక్తం తుడిచారు. పంచెలు చించి, చొక్కాలు చించి, అవి చిరిగి వున్నాయి - కట్లు కట్టారు.

ఆడవాళ్ళు కన్నీళ్ళు కార్చారు.

యువకులు బస్సుల వాళ్ళ అఘాయిత్యాల మీద కోపం చూపారు. తీర్పులు చెప్పారు. తీర్మానాలు చేశారు.

పోలీసులకు కబురు చేయటం పిల్లి మెడలో గంట కట్టేంత కష్టమయిన పని అయిపోయింది.

కాని వీళ్ళిద్దర్నీ హాస్పటల్‌లో మాత్రం చేర్చారు.

పత్తిమీత పడ్డ మనిషి పత్తి సొంత దారు.

బండి కింద పడ్డ మనిషి బండి సొంతదారు.

పత్తి యజమానిని రక్షించింది.

బండి యజమానిని శిక్షించింది.

జనం అనుకొన్నారు. ఇతడు చనిపోవచ్చు. ఇతడు బ్రతకవచ్చు.

స్పృహలేని ఇద్దరూ హాస్పటల్ మంచాలమీద ఉన్నారు.

ప్రాణం లేని ఎడ్లు రోడ్డు పక్క వున్నాయి.

కుక్కలు వచ్చి రక్తం మరకలు నాకి, నాలుక చీకొ్కంటున్నాయి.

జనం కసిరి వాటిని తరిమారు.

ఒకతను చిల్లా కొల్లరుగా పడ్డ పత్తిని చేత్తో ఎత్తి చాలా మెత్తగా ఉందని తెలుసుకొన్నాడు.

అతడు చెట్టుకింద రాయిమీద దివా రాత్రులు పడుకొంటాడు. తల కింద రాయి పెట్టుకొంటాడు. దిండు అతడి ఏకైక వాంఛ.

పోలీసులింకా రాలేదు.

ఉంటే అన్నం తినటానికి, లేకుంటే దెబ్బలు తినటానికి, కాకపోతే నిద్ర పోవటానికి, నిద్రరాకపోతే కడుపునిండా ఏడవటానికి ఎవరికి వాళ్ళు వెళ్ళి పోతున్నారు

రాత్రిక్రీ నీడలో ఎద్దుల మృతదేహాలు!

అవి బ్రతికి వున్న కాలంలో యజమానికి ఎంతో సేవచేశాయి. వళ్ళు దాచుకోలేదు. చనిపోయినా వళ్ళు దాచుకోలేదు. చర్మం విలువయిందని చుట్టూ వున్న గుడిసెల వాళ్ళకు తెలియక పోలేదు.

రెండెడ్లూ ఈ బండీ అతడి యావదాస్తి. బండి చక్రాలు దొర్లితే కడుపు కదులుతుంది.

పత్తి భారతదేశ సంపదలాగా ఒక్కచోటే కుప్పపడి వుంది.

దాన్ని అమ్ముకొని పల్లెకు పోతే ప్రస్తుతానికి చాలాకష్టాలు తీరతాయని నమ్మకం పెట్టుకొని పట్టణానికి వస్తున్నాడు, పత్తి సొంతదారు.

హాస్పటల్‌లో బండి మనిషి చనిపోయాడు. పత్తి మనిషి బతికిపోయాడు. దెబ్బలూ పెద్దగా తగల్లేదు. బెదురువల్ల స్పృహతప్పాడు.

ప్రథమ చికిత్స చేశారు. అతను కావాలనుకొంటే వెళ్ళిపోవచ్చు. కాని ప్రమాదంలో పడ్డ మనిషి అని తెల్ల వారిందాకా ఉండమన్నారు.

ప్రమాదం జరిగిన చోట క్రీనీడలో తెల్ల వార్లూ నీడలున్నాయి. కుక్కలొస్తే ఎడ్ల నెత్తురు నాకుతాయి. తోలు పీకుతాయి. అని జనం వాటిని తోలుతున్నారు, రాత్రి అంతా మనుషుల మీద కుక్కలు అరుస్తున్నాయి.

తెల్ల వారెం తర్వాత పత్తి మనిషి వచ్చాడు.

ప్రమాదం జరిగిన చోట రోడ్డు పొడుగునా వెతుకు తున్నాడు.

గుడిసెలలో నుంచి జనం వెలుపలికి రాలేదు.

పోలీసు లింకా రాలేదు.

రోడ్డుమీద పడిన రక్తం మరకల్ని తడి చేసుకొని నాకుతున్న కుక్కను చూచి ప్రమాదం జరిగిన ప్రదేశం పోల్చేసుకొన్నాడు.

అంతేకాని మరి ఏ ఆధారం లేదు.

చుట్టూ చూశాడు. పత్తి, బండి, ఎడ్లు కనపడలేదు. గుడిసెలు కనిపించాయి.

రోడ్డుమీద జరిగిన ప్రమాదం అందరూ చూశారు చూడవచ్చు. అది కనిపిస్తుంది.

రోడ్డు మీద జరగని ప్రమాదం అతడి కళ్ళ ముందు తిరిగింది. అది కనిపించదు.

# గంగాస్నానం

హరిద్వార్‌లో గంగానది ఒడ్డున స్నాన ఘట్టం. సమీపంలో బోరింగు పంపుకొట్టి నీళ్ళు పట్టి కొడుక్కు తాగిస్తూ వుంది యాత్రికురాలు.

ఢిల్లీ నుంచి అర్ధరాత్రి బయలుదేరిన బస్సు రుషీకేశ్, సప్తర్షి, సరోవర్‌లు చుట్టి హరిద్వార్ చేరిన వెంటనే నేను చూచిన ఈ దృశ్యం గుండెలో కలత అయింది.

పిల్లవాడికి నీళ్ళు కావలసి వస్తే గంగలో ఎన్ని నీళ్ళు లేవు ?

అసలు బోరింగు పంపు అవసరం ఏమొచ్చింది ?

దీన్ని ఎందుకు పెట్టించినట్లు ?

కోపం వచ్చింది. వళ్ళు మండింది.

కొట్టుకొంటున్న పంపును చూస్తుంటే కొట్టుకోవలసిన గుండె మొరాయిస్తుంది. తిరగబడుతుంది.

గబగబా వెళ్ళి దోసిళ్ళకొద్దీ గంగానది నీళ్ళు తాగాను. ఎంత చల్లగా, ఎంత తెల్లగా, ఎంత హాయిగా, ఎంత రుచిగా వుందీ జలం.

నేను తాగిన ఈ నీళ్ళు ఏనాటివి? పురాణ కాలానికి పురాణమయిన ఆర్ష ప్రాచీనత అంతస్నాయువులు ఏనాటివి?

పాదంలో, స్వర్గంలో, ఆకాశంలో, శిరస్సులో, శిఖరంలో, సానువుల్లో, లోయల్లో, పరుగులు తీసిన గంగస్వర్గానికి, భూమికి, నిచ్చెన, వంతెన.

భగీరథుని వెంట తాను వచ్చిన నేలంతా పావనం చేస్తూ శివాలకల కొండలు చీల్చుకువచ్చిన గంగ ఏనాటిది, భారతీయతకన్న ప్రాచీనమయినది. పవిత్రతకన్న పురాతనమైనది.

బ్రహ్మకుండం హిమాలయ పర్వత హృదయ కవాటం. ఏ మానవలోకం ఇంత పెద్ద జల కలిగివుంది?

భారతదేశానికి ప్రాణప్రతిష్ఠ కావించిన గంగానది నీళ్ళు ఈ కొడుకును కన్నతల్లికి అక్కరకు రాలేదు.

ఎందుకో చాలా బాధగావుంది. ఆమె కనిపించటంలేదు. పంపు కనబడుతూ వుంది. ఇదేం ఘోరం?

గంగలో స్నానంచేస్తే పాపాలు పోతాయి. ముక్తి వస్తుంది. పునర్జన్మలేని స్వర్గజీవితం లభిస్తుంది. ఆ నీళ్ళు, ఆ ప్రాంతం అమ్మ వళ్ళో ఉయ్యాలలో ఊగినట్లుగా ఈత. చల్లగా, హాయిగా, సుఖంగా, మధురంగా ఈత. వాలున పోవటం. మళ్ళీ వాలున పడటం. ఇదీ వరస. ఎంతసేపు ఈదినా తనివితీరటం లేదు.

వెనక్కు తిరిగివచ్చి నీళ్లలో దిగబోతున్నప్పుడు మళ్ళీ గుండె కలుక్కుమంది.

గంగానదిలో స్నానంచేస్తూ సబ్బు పెట్టుకోవటమా ?

ఒకరా! ఇద్దరా! ఎందరో?

తల తిరుగుతూవుంది.

పవిత్రత ప్రసాదించే గంగకు నా శరీరం మురికి ప్రతిఫలంగా ముట్టిందని అనిపించేసరికి వళ్లు జలదరించింది.

వంటి మురికితోపాటు సబ్బు మురికి కూడానా ?

పైన ఆడవాళ్ళు స్నానం చేస్తున్నారు. సబ్బు కలిసిన గంగా నీళ్ళు మగ వాళ్ళను చుట్టుకు పోతున్నాయి

ఆడవాళ్ళు పైన స్నానం చేస్తున్నారు.

ఇద్దరు హిందీలో అనుకొంటున్నారు.

వాళ్ళ మురికితో వచ్చే నీళ్ళు, వీళ్ళ వళ్ళు చుట్టుకొని పోతున్న నీళ్ళు?

ఆకలిగా వుంది. వడ్డెక్కారు. ఇద్దరు పిల్లలు చెప్పుకొంటున్నారు.

'గంగలో స్నానం చేసేటప్పుడు నేను ఒంటికి పోశాను.'

'నేను నీళ్ళలోనే దొడ్డికి కూర్చున్నాను.'

నాకు కడుపులో దేవి నట్టయింది.

అక్కడుండ బుద్ధికాలేదు, బట్టలు వేసుకొని బ్రిడ్జి మీదికి వచ్చాను. పూసల దండలు లింగకాయల దండలు అమ్మే వాళ్ళు, పూలు బట్టలు విక్రయించే వాళ్ళు నిలబడ నీయలేదు.

ఈ ఒడ్డున బ్రిడ్జికి అటు ఆడవాళ్ళు, అలగావాళ్ళు, ఇటు మగవాళ్ళు తన్మయత్వంతో వళ్ళు తెలియకుండా స్నానం చేస్తున్నారు.

ఏ యే శరీర భాగాలు ఎవరెవరు చూస్తున్నారో వాళ్ళకు తెలియదు. తెలుసునేమో తెలియదు.

బ్రిడ్జి అవతల ఏముందోనని చూస్తే అన్నీ హోటళ్ళు. ఒక్కసారి భోజనం చేయటానికి పాతిక రూపాయలు అయినా చాలవు. పావలా అయినా సరిపోతుంది. అన్నదానం కూడా జరుగుతూ వుంది.

గంగనీళ్ళు నేనెందుకు తాగాను?

చిన్నతనం నుంచి పెంచుకొన్న భక్తి, తన్మయత్వం, పారవశ్యం.

ఎందు కీదాను?

స్నానంకోసం కాదు ఈదాలని ఈదాను.

ఎందుకు అంత సేపు ఈదాను? అంతభయంతో అంత ప్రమాదంలో అంత సంకోచంగా?

ప్రకృతిని వశం చేసుకోటానికి మనిషి నిరంతరం ప్రయత్నిస్తుంటాడు. ప్రయత్నంలో విజయం సాధించి బ్రతుకుతాడు. విఫలుడై గతించి పోతాడు. గంగలో ఈదటం అయినా ఎవరెస్టు ఎక్కటమయినా అంతే?

ఎవరెస్టు ఎక్కలేని పసివాడికి అందని ద్రాక్షపళ్ళు పులుపు.

గంగలో ఈదలేని, దిగకుండా ఆగలేని చిన్నవాడికి తన ఆధిక్యం నిలుపుకోవటానికి ఒంటికి పోయటం, సబ్బు పెట్టుకోవటం తనగొప్ప.

పూవు పెట్టుకొనే తలలేని వాళ్ళు దాన్నితుంచి పోగులు పెట్టినట్లు.

నలుగురికీ దొరికేది ఎవరికీ అవసరం లేదు. ఎవరికీ దొరకంది అందరికీ కావాలి.

గంగ పవిత్రమయింది అయితే దాన్ని మురికిదాన్ని అయినా చేయాలి. లేకపోతే తన గొప్ప అయినా చాటుకోవాలి.

గంగ ప్రధాన ప్రవాహం నుంచి పాయతీసి, వేగం తగ్గించి కష్టం తగ్గించి, స్నాన ఘట్టం రూపొందించారు. ఇదే ప్రధానమయిన స్థలం. పైన స్త్రీలు కనిపించకుండా జలక్రీడ లాడవచ్చు. అక్కడ చాలా తక్కువ మంది స్నానం చేస్తున్నారు. స్త్రీలు, పురుషులు ప్రక్క ప్రక్కనే స్నానం చేస్తున్నారు

వందల మంది స్నానంలో మునిగిపోయారు. వాళ్ళకు బాహిరస్పృహ ఉన్నట్లు లేదు.

ఉరస్థలి మీద బట్ట తొలిగిపోతే ఎదుట ఎవరున్నా వెంటనే సర్దుకొనే స్త్రీలేనా వీళ్ళు!

శరీరానికి బట్ట అతుక్కుంటే సవరించుకొనేవాళ్ళేనా వీళ్ళు!

పురుషుణ్ణి చూస్తే తొలిగిపోయే స్త్రీలు, నీళ్ళలో మునిగి ప్రక్కవాడి పక్కలాగా తేలుతున్నారు.

ఆడవాళ్ళు నీళ్ళలో గుంజీళ్ళు తీస్తుంటే వంట చేసినట్టేవుంది.

కావాలన్న ఆడవాళ్ళకు పరాయి మగవాళ్ళు ఈత నేర్పుతున్నారు. స్నానం చేయిస్తున్నారు.

ఇన్ని వందల మంది ఆడవాళ్ళను యిలా చూడాలంటే ఇంకెక్కడా సాధ్యంకాదు. హరిద్వార్ రావాలి.

వెయ్యి కళ్ళున్నా వెయ్యేళ్ళున్నా నిద్రపోకుండా సాన్న ఘట్టం చూస్తూ వుండొచ్చు.

ఇప్పటికీ రెండు కళ్ళతో ఈ రోజుకి సరిపెట్టుకోవాలి.

ఇద్దరు యువకులు అనుకొంటున్నారు. వాళ్ళు రోజూ ఉదయం నుంచి సాయం కాలం దాకా డ్యూటీ చేసి నిరుద్యోగులు కావటం వల్ల సత్రానికి పోయి కళ్ళతో తినటం వల్ల నిండిన కడుపుల ఆకలి అరుపులు వినకుండా నిద్ర పోతారు.

'ఎంత సేపు చూచినా ఇంతే కదా!'

'ఇంకేం కావాలి?'

ఇద్దరు పాతికేళ్ళ పడుచులు తాకితే చాలు, తలమీద చల్లుకొంటే చాలు, జన్మ తరించి పోతుంది. గంగలో చచ్చినా చాలు. స్వర్గం లభిస్తుంది. పితృ దేవుళ్ళకి నీళ్ళలో తిలలొదిలితే ఎంత పుణ్యం!

ఆ నీళ్ళే మొదట ఆ తల్లికి కొడుకు తాగటానికి పనికిరాకుండా పోయాయి. తలనొప్పిగా వుంది.

పోనీ ఆమెకు గంగానది పవిత్రత మీద నమ్మకం లేకపోయినా దాని వైద్య గుణం మీద అయినా విశ్వాసం ఉండవచ్చు.

ఇన్ని పాయలుగా, ఇంత విశాల హిమాలయ పర్వత సానువుల్లోని చెట్లు, ఆకులు, మూలికలు చుట్టుకొని, కలుపుకొని వచ్చే గంగానది నీటికెంత వైద్య శక్తి ఉంది!

ఏ శాస్త్రవేత్త కూడా కనుక్కోలేని వైద్య రహస్యం తనలో నింపుకొందో! ఏ రోగమయినా ఎలా నయమయిపోతుందో తెలుసుకొని అయినా గంగను పూజింపవచ్చునే.

ఈమె కిదేం మాయ రోగం !

సరే, గంగానది నీళ్ళలో వైద్య గుణం లేకపోయినా అదెంత ఉపయోగ కారిణి !

గంగానది హరిద్వారంలో మైదానంలో ప్రవేశించింది. ఇక పొలాలకు జల మవుతుంది.

ఉత్తర హిందూ దేశంలో సగం గంగ ప్రసాదించిన పంటతో బతుకు తుంది. అన్నదానం చేసిందాన్ని అలా పరాభవించవచ్చా ?

ఆ కన్నతల్లిని తలచుకొంటే మండుతున్న వళ్ళు గంగలో ఆర్పుదామని చూస్తే గంగ వేగం భయం కలిగించింది. ఏ నదీ అంత దూకుడుగా పోవటం చూడలేదు. దిగితే కొట్టుకు పోవటమే.

గొలుసులు దాటి లోనికి పోకుండా ఇనుప కడ్డీలు పట్టుకొని స్నానం చేస్తున్న వాళ్ళ స్థితి కూడా అంతంత మాత్రంగా వుంది.

చాలా మంది మెట్ల మీదే కూర్చొని మీద నీళ్ళు చల్లుకొనటం స్నానంగా సరిపెట్టు కొంటున్నారు.

చిన్న తనంలో బావుల్లో, చెరువుల్లో, కాలవల్లో ఈదులాడటం దెబ్బలు తినటం బాగా అనుభవం.

పిల్లలు ఈత నేర్చు కొంటామంటే ఈ మధ్య నేర్పటం వల్ల ఈదే బుద్ధి పోలేదు.

గంగను చూడగానే మునగాలనీ కాదు. స్నానం చేయాలనీ కాదు. ఈదాలని అనిపించింది. అందుక్కారణం ఇంత వేగంగా ప్రవహించే నీళ్ళలో మునుపు ఎప్పుడు ఈదలేదు

మొదటి మెట్టు దిగగానే కాళ్ళెవళ్ళో లాగినట్టయి కూలబడ్డాను. నీటి వేగం తెలియటం మొదలు పెట్టింది.

మెట్టు మీద కూర్చుని కాళ్ళు ఆడిస్తూ చల్లదనం అనుభవిస్తూ నేనిప్పుడు గంగలో కాళ్ళాడిస్తున్నానని పొంగిపోయాను.

మరో మెట్టు దిగాను. కాలికింద రాయి కోసుకు పోతున్నట్లనిపించింది. నే నీదగలనా అని భయం కలిగింది. మళ్ళీ మెట్టు మీదికి దిగిపోతే మొల మునిగింది. నాలో సగభాగం తేలిక అయి తేలిపోతున్నట్టు అనిపించింది. నిజంగానే తేలి పోయింది. నే నెంతగానో ఇనుప కమ్మీకి కొట్టుకొన్నాను. కమ్మీని పట్టుకొని మాత్రమే ఈదాను. గంగ వేగం అనుభవిస్తుంటే శివుడి తలకాయ తలంపుకు వచ్చి తల దిమ్మెక్కి శివుడి శిరస్సెంత బరువు, ఎంతవేగం, ఎంత గొడవ భరించిందో!

కొంచెం సేపట్లో గంగ అర్థమయింది. ఈదక్కరలేదు. నీళ్ళమీద తేలటం చేతయితే చాలు గంగవాలుకి ఎంతదూరమయినా వెళ్ళిపోవచ్చు. ఏటవాలుగా లోనికి పోవటం వెలుపలికి రావటం మాత్రం చేయవలసిన పనులు.

మొదట కొద్ది దూరం తర్వాత మరికొంచెం అలా ఫర్లాంగు దూరం గంగలో తేలిపోవటం పరమానందం కలిగించింది.

జ్వాలో విద్యార్థినులు.

ప్రతి ఆదివారం హరిద్వార్ వచ్చి తనివితీరా చూచి శక్తి ప్రవృత్తులు ప్రదర్శించుకొంటారు.

ఒడ్డుకు వచ్చిన కూతురు లంగా చూచి కంగారుపడి భర్తను పిలిచి భార్య చెప్పింది.

పిల్ల పెద్దపిల్ల అయింది.

'ఎప్పుడు?'

'ఇప్పుడే! గంగలో'

గంగానది నీళ్ళు రంగు రంగులుగా, రింగు రింగులుగా స్నానఘట్టం లోంచి సాగిపోతున్నాయి.

పవిత్రత, మురికి, శుభ్రం, అశుభ్రం అంతా గంగ ఆస్తి! హక్కు! వారసత్వం!

ఈ పాయమళ్ళీ గంగలో కలిసి ప్రవహించి పోతూవుంది.

అక్కడ వుండబుద్ధి కాలేదు. గడియారం స్తంభం దగ్గరకు వచ్చి ఇద్దరు బిచ్చగాళ్ళను చూచి ఆగిపోయాను.

అన్నదానం చేసిన చోట పెట్టిన అన్నం భార్య ఎంగిలి చేసిందని కదల్లేని బిచ్చగాడు విసిరి ఆమె ముఖాన కొట్టాడు.

పూసలమ్ముతున్న పిల్లవాణ్ణి హోటల్ని గురించి అడిగితే చాల వివరంగా చెప్పాడు.

హరిద్వార్‌లో మాంసంకాని, మద్యం కాని లభించవని వినికిడి.

'బార్ ఉందా?' అంటే 'లేదు' అన్నాడు.

అటూ ఇటూ చూచి 'కావాలా?' అన్నాడు.

నేనింక నిలబడలేకపోయాను.

నీలిధార, గంగ కలవకముందు ఏర్పడ్డ లంకలోకి చెట్లుచేమలయినా చూద్దామని వెళితే అక్కడా బాధే ప్రత్యక్షమయింది. బదులు పలికింది.

ఇద్దరు ఆడవాళ్ళు కుష్ఠువాళ్ళు పుళ్ళు కడుక్కొంటూ స్నానం చేస్తున్నారు.

దిగువ స్నానంచేసే వందల ప్రాణాల శరీరాల మీద జాలి కలిగింది.

ఇంకా పైకిపోతే అదంతా తోటగానయినాలేదు. ఉద్యానవనం కాకపోతే పోయింది. పెద్ద ఎ పుంది. వీళ్ళందరి ప్రక్షాళనానికి గంగే గతి.

కడుపులో పేగులు చుమ్మలు చుట్టుకొనిపోతున్నాయి. ఇంకా ముందుకు పోలేకపోయాను.

వెనుతిరిగి వస్తుంటే వళ్ళంతా వణకటం ఆరంభమైంది.

నేను స్నానంచేసిందీనీళ్ళలోనే !

నేను భక్తిగా కడుపునిండా తాగిందీనీళ్ళేనా?

ఆ నీళ్ల ఈ నీళ్ళు కావు కానీ, ఆ నీళ్ళు ఈ నీళ్ళ వంటివే.

జ్వరం వస్తున్నట్లనిపించింది. గబగబా తిరిగి వచ్చాను.

సీసాలు, రాగి పాత్రలు సైజుల వారివీ రేటుల కొద్దివీ గంగా జలం సీలు చేసి అమ్మకానికి సిద్ధంగా వున్నాయి.

జనం కొంటున్నారు. పెట్టెలో, సంచుల్లో, బుట్టల్లో, మూటల్లో భద్రంగా పెట్టుకొంటున్నారు. ఇవి భారతదేశం అంతా ప్రయాణం చేస్తాయి. పుణ్యకార్యాల్లో భాగమవుతాయి.

వళ్ళు కంపర మెత్తి పోతూవుంది. చూడబుద్ధి కాలేదు.

అన్నం తినటానికి కూర్చున్నాను. గ్లాసులో నీళ్ళు పెట్టాడు. అన్నం వడ్డించాడు.

ముద్ద కలుపుకొని నోట్లో పెట్టుకోబోతుంటే లోపల్నుంచి పేగుకేకపెట్టింది.

'వంటకే నీళ్ళు ?' అడిగాను.

'గంగ నీళ్ళు' ఎగాదిగా చూశాడు.

ఆకలి ఎక్కువయి కళ్ళు తిరిగాయి. లేచి నిలబడ్డాను.

'పంపు నీళ్ళే వంటకు, గంగ నీళ్ళంటే మీకు ఇష్టమేమోనని అలా చెప్పాను.'

ఇది మరీ భరించలేకపోయాను. ఏది నమ్మాలో ఏది నమ్మరాదో తెలియ లేదు. చేయి కడుక్కొని బైటకి వచ్చాను.

గంగ దూకుతూ వుంది వికారంగా, దీనంగా,

బ్రిడ్జి దాటి అంతకు ముందు స్నానం చేసిన చోటకు వచ్చాను.

గంగ బాధగా, వ్యధగా, దుఃఖంగా, చికాకుగా కన్పించింది.

వళ్ళంతా మండిపోతూవుంది.

ఆర్పాలి !

బోరింగు పంపు ప్రేమగా చూచింది.

బట్టలవతల పారేసి వళ్ళంతా ఒంట్రుమట్టితో రుద్ది స్నానం చేశాను.

'పిచ్చివాడు' జనం నవ్వుతున్నారు.

ఎవడి పిచ్చి వాడి కానందం !

నేను పిచ్చివాణ్ణా? ప్రశ్న సతాయించటం మొదలుపెట్టింది. పీక్కు తింటూవుంది.

వంటికి మురికి అయిందని స్నానం చేశాను. పోయిందో, పోలేదో పనయి పోయింది.

గంగ కడుపునిండావుంది.

బైటి మురికిపోవచ్చు.

లోపలి మురికి ? లోపలి మురికి ?

లోపలి మురికి ? ? ! !

ఏం చేయటం ?

తల తుడుచుకోలేదు. వళ్ళు తుడుచుకో లేదు. పక్కనే పడివున్న బట్ట వేసుకొన్నాను. బస్సు బయలు దేరుతూ వుంది. నీళ్ళు కారుతున్న వంటితో బస్సు ఎక్కాను. కండెక్టరు కసురు కొన్నాడు.

బస్సులో కూర్చున్న ఒక వృద్ధురాలు నేనెక్కడ స్నానం చేశానో తెలి యని ఆమె సానుభూతితో అంది భర్తతో -

'అతడి వయస్సులో, ఏం భక్తో, గంగా స్నానం చేసిన బట్టలు ఆర్పుకో నయినా ఆర్పుకో లేదు!'

నేను పిచ్చివాణ్ణి !

బస్సు కిటికీలోంచి దూరమవుతున్న హరిద్వార్ మానవుడి చిన్నతనానికి పెద్ద నిదర్శనంగా కనిపించింది

# ఆనంద బాష్పాలు

ఆగష్టు 15.

జాతీయ పతాకం ఆకాశంలో రెపరెపలాడుతూవుంది.

పోలీసు గ్రౌండ్‌లో పెరేడ్ జరిగింది.

పిల్లలందరికి చాక్‌లెట్లు పంచారు.

ఒకటీ రెండూ!

ముప్పైఏళ్ళక్రితం కడుపునిండా ఆకలి. రెండు చాక్‌లెట్లు!

రెండు చాకులెట్లు తింటే ఆరిపోతున్న ఆకలికి మళ్ళీ కట్టెలు పెట్టి మంట రాజేసినట్లే.

రవి తినలేదు. తినలేక వాంతి చేసుకొంటున్న సుధకు ఇచ్చాడు.

స్కూలులో, గవర్నమెంటు బిల్డింగ్సుకి, క్లాక్‌టవర్‌కి, పోలీసు గ్రౌండ్సులో రంగు కాగితాల తోరణాలు కట్టారు.

పట్టణం అలంకరించుకొంది.

రవి చిరిగిన బట్టల మాసికలు కనిపించకుండా శరీరం అడ్డం పెట్టుకొని నడుస్తున్నాడు.

పట్టణం అంతా లౌడుస్పీకర్లు మ్రోగుతున్నాయి.

వందేమాతరం పాడుదాం అని రవి గొంతెత్తితే శబ్దం రాలేదు. సుజలాం సుఫలాం అందామని చూస్తే గొంతు కదల్లేదు. జనగణమన అందరూ పాడుతుంటే ఆపురమని ఏడుద్దామనిపించింది.

పట్టణం లౌడ్‌స్పీకరై మ్రోగుతూవుంది.

పగలంతా కార్లు, జీపులు, వేనులు, లారీలు, కొబ్బరి మట్టలు కట్టుకొని జాతీయ పతాకాలు పుచ్చుకొని, రంగు కాగితాలు భుజాన వేసుకొని ఊరంతా తిరుగుతూనే వున్నాయి.

రవి ఒక లారీలో ఊరంతా తిరిగాడు ఆకలి కొంచం తగ్గింది. చెవులు దిబ్బళ్ళు తగ్గాయి.

రాత్రి బాణాసంచా కాల్చారు. పట్టణం అంతా పొద్దు పోయిందాకా తిరిగి తీరుబడిగా ఇంటికి చేరాడు.

అమ్మా నాన్న తమ్ముడు తన కోసం ఎదురు చూస్తుంటే సిగ్గుపడ్డాడు. కొడుకు ఇంటికి వస్తే తిండి పెట్టలేక తల్లి కుంచించుకు పోయింది.

కూలి డబ్బులు చేతికిరాక ఆకలిని గుమ్మం అవతల నిలబెట్టి తండ్రి లోపలికి వచ్చి ఇల్లు అంతా చూచి బాధపడి మూలకు చేరగిలబడి వున్నాడు.

ఇవాళ సంగతి ఇంతే కాబోలునని రవి తమ్ముడు నిద్ర ఎందుకు మాను కోవాలని తీవ్రంగా కుస్తీ పడుతున్నాడు. తల ఎత్తుతున్నాడు. సరిగ్గా జరిగి కూర్చుంటున్నాడు. చివరికి నిద్రలోకి జారిపోయాడు. అమ్మవడిలో, నాన్న నానుకొని.

రవి అమ్మదగ్గరకు చేరాడు తల నిమిరింది. నిద్రపొమ్మనలేదు కాని అర్థం అంతే. అన్నం లేదనలేదు కాని అర్థం అంతే.

మనిషి అస్తిత్వం కంటే ఆకలి అస్తిత్వం సత్యం.

రవి ఉన్నాడన్నా లేడన్నా ఎవరికీ తెలియదు కాని రవికి ఆకలి లేదంటే మాత్రం వీలులేదు. ఉందని వెంటనే రవి తేల్చి చెప్పగలడు.

కడుపు దాని ఉనికిని మర్చి పోనీయకుండా గుర్తు చేస్తుంటే రవి లేచిపోయి నీళ్ళు తాగి త్రేనుస్తూ వచ్చి అమ్మను చుట్టుకొని పడుకొన్నాడు.

రాత్రి గొప్పది. నిద్ర మరీ గొప్పది.

చాలా బాధలకు మందు నిద్ర. రాత్రి పరిష్కారం.

రవి పస్తు ఫారంలో చేరాడు.

రెణ్ణెల్ల క్రితం

వాడికి చదువెందుకు ఏదో పని పాటా చేసుకుంటే చేతికి అందగా ఉంటా డని ఎవరో సలహా ఇవ్వక పోలేదు.

తండ్రి వినలేదు. తల్లి ఒప్పు కోలేదు.

ఆ ఏడే తమ్ముడు కూడా ఒకటో తరగతిలో చేరాడు.

వాడికేం తెలియదు. ఎక్కాల పుస్తకం చించేసాడు. పలక పగలకొట్టాడు. బలపం విరగకొట్టాడు.

అలా చేయకూడదురా అంటే నాలిక మూరపొడుగు వెలుపలికి లాగి చేయి ఊపినట్లు ఊపి వెక్కిరిస్తాడు.

వీడిదెంత పెద్ద నాలుకో !

'వీడికి చదువు బాగా వస్తుంది' అనేది మార్తమ్మ టీచరు.

'వాడికి ఆకలి ఎక్కువరా' అనేది అమ్మ.

'రెండూ నిజమే' అనేవాడు తండ్రి.

తల్లితండ్రి కూలి నాలీ చేసి పిల్లలిద్దర్ని పెంచటమే కాదు, చదివించటం కూడా ఆరంభించారు.

వాళ్ళిక పిల్లల్ని వద్దే అనుకొన్నారో, పుట్టనే లేదో కాని మళ్ళీ సంతానం కలగలేదు.

రెక్కలు ముక్కలు చేసుకొని, ఆ ముక్కలకు ధనం సంతానమై పుడుతుంటే వాళ్ళు వదులుకో లేదు.

కూలీ కూడా బాగానే ఉండేది.

ఖర్చులు పోగా నెలకు పదో పరకో వెనకేసుకో సాగారు.

పిల్లల చదువు బాగానే సాగుతూ వచ్చింది.

పదికి పది తోడు చేసుకొని ఒక ఎకరం పొలం కొనుక్కొన్నారు వాళ్ళు.

పొలం సొంతంది ఉంది, అనే ఆనందం ఇద్దరికీ అంతులేకుండా కలిగింది.

వాళ్ళు మళ్ళీ ఏ ఆగస్టు 15 న కూడా ఆకలి కడుపులకు వళ్ళుదానం చేసి నిద్రకు శరీరాలప్పగించలేదు.

వాళ్ళ కాపురం కలిసివచ్చింది. ఎకరం రెండెకరాలయింది. రవి యస్.ఐ. ఉద్యోగంలో చేరిన రోజుల్లోనే తమ్ముడు స్కూల్ మాష్టరుద్యోగంలో ప్రవేశించాడు.

ఇవాళ ఉదయం తమ్ముడు సూర్యోదయం కాకముందే స్వీట్స్‌టిన్ తీసుకొని స్కూల్‌కుపోయాడు.

రవి సెరిమోనియల్ డ్రస్ వేసుకొని పోలీసు గ్రౌండ్స్‌లో పెరేడ్ కమాండ్ చేయటానికి చీకటిని హేట్‌మీద పెట్టుకొని వెళ్ళాడు.

రవి పిల్లలిద్దరూ, తమ్ముడి పిల్లలిద్దరూ టిఫిన్‌చేసి బూట్సువేసుకొని టక్ చేసుకొని, టైకట్టుకొని బయలుదేరుతుంటే రవి పెద్ద కూతురు లంగా జాకెట్ రిబ్బన్లు మూడూ .మూడు రంగులని జాతీయ పతాకం రంగుల్లా రెపరెపలాడు కొంటూ ఎగురుతూ దూకుతూ సిద్ధమయింది.

పెరడ్ కమాండ్ చేయటం ఎలా వుంటుందో చూద్దామని ఆడవాళ్ళిద్దరూ సిద్ధమయి బయలుదేరారు.

ఎక్కడికి పోయే పని లేకుండా తీరుబడిగా చుట్టకాలుస్తున్న భర్తను చూస్తూ రవి తల్లి కూర్చుంది.

స్కూలులో స్వీట్‌లు పంచుతుంటే ఎగబడ్డ పిల్లలతో 'నేను పంచనురా మీరే పంచుకోండి' అని చెప్పి అలిగి కూర్చున్నాడు రవి తమ్ముడు.

అల్లరి చేయమని పిల్లలు బ్రతిమాలుతున్నారు.

ప్రొద్దునే చలికి పెగలని గొంతును సవరించుకొంటూ కమేండింగ్ ప్రాక్టీసు చేస్తున్నాడు రవి.

పోలీసు కంటింజెంట్ సిద్ధమవుతూ ఉంది.

స్కూలులో తమ్ముళ్ళకి స్వీట్ ఇప్పించి అందరకి సమంగా పంచి తాను పెద్దది కాబట్టి ఒకటి ఎక్కువ తీసుకొంది రవి పెద్ద కూతురు.

'పిల్లి కోతి కథ' అని ఏడ్పిస్తున్నాడు చివరివాడు.

రవి భార్య, మరదలు పట్టుచీరెలు రెపరెపలాడించుకొంటూ పోలీసు గ్రౌండ్స వద్ద రిక్షాదిగారు.

ఎనిమిది గంటలు కావస్తూవుంది.

జనం నెమ్మదిది నెమ్మదిగా వస్తున్నారు. ఆడవాళ్ళు వాళ్ళకు అంతా కన్పించే చోట తీరుబడిగా కూర్చున్నారు.

తమక్లాసు పిల్లల్ని క్యూలో నడిపించి తీసుకువచ్చే అయ్యవార్లలో రవి తమ్ముడు హంగామా చేస్తూవున్నాడు.

తమతమ క్లాసు పిల్లల్లోక్యూలో నిలబడివున్నారు అన్నదమ్ముల పిల్లలు.

అంతా పోలీస్ గ్రౌండ్స్‌లో ఇండిపెండెన్స్‌డే పెరేడ్‌కి సిద్ధంగా వుంది.

కలెక్టర్ వచ్చాడు.

పిల్లలు చప్పట్లు కొట్టారు.

పెద్దవాళ్ళు మర్యాదచూపారు.

తొమ్మిది గంటలు. అంతా నిశ్శబ్దం.

పోలీసు గ్రౌండ్స్‌లో పెరేడ్ కమాండర్ రవి 'సావధాన్' అని అరిచాడు.

చుట్టూ మైలు దూరం ప్రతిధ్వని.

ఇది రవి గొంతుల్లోంచి, పేగుల్లోంచి, అంత స్నాయువుల్లోంచి వచ్చిన ధ్వని.

పూర్వం నుంచి గొంతు పెగిలిరాని ధ్వనికిదే పరిష్కారం.

కలెక్టరు జాతీయ పతాకం ఆవిష్కరించాడు.

పెరేడ్ అయిపోయింది స్కూలు పిల్లలు ఇళ్ళకు బయలు దేరారు.

వాళ్ళ సంరక్షకులు, టీచర్లు అందరినీ సాగనంపి వాళ్ళు వెళ్ళారు.

పెరేడ్ చూడ్డానికి వచ్చిన వాళ్ళు వెళ్ళిపోతున్నారు.

పెరేడ్ చాలాబాగా కమేండ్ చేశానని అందరూ అభినందిస్తుంటే కృతజ్ఞత తెలుపుకుంటూ రవి వెలుపలికి వచ్చాడు.

ఇంటికి వచ్చేసరికి అందరూ భోజనానికి సిద్ధంగా వున్నారు.

పలావ్‌హాట్ హాట్‌గా వుంది. రవికి బాగా ఆకలి అవుతూవుంది.

పిల్లలతో, తమ్ముడితో, తనూ భోజనానికి కూర్చున్నాడు.

కడుపులో విపరీతంగా ఆకలి.

ఇటువంటిదే ఆకలి! ముప్పైఏళ్ళ క్రితం! భారతదేశం రిపబ్లిక్ అయిన తర్వాత! మొదటి స్వాతంత్ర దినోత్సవంనాడు.

ఇవాళ ఆకలిని అణచివేయగలిగినంత అన్నం.

ఆకలి మంట చల్లారడానికి ముప్పై ఏళ్ళు పట్టింది.

అన్నం నోట్లో పెట్టుకొంటుంటే రవి కళ్ళ వెంట నీళ్ళు.

'కారమా' భార్య అడిగింది.

'రుచి లేదా' మరదలు అడిగింది.

'అదేంకాదు!' రవి చెప్పాడు.

'మరేం?' తండ్రి అడిగాడు.

రవి చెప్పాడు 'ఆనంద బాష్పాలు.'

రవి భోజనం చేస్తున్న పిల్లల్ని చూశాడు.

పోలీస్ గ్రౌండ్స్‌లో పెరెడ్ మార్చింగ్ లాగావుంది.

# వేప చెట్టు

రవి ఉగ్గు పాలు తాగాడో లేదో కానీ, పుట్టీ పుట్టక ముందు నుంచీ కాఫీ తాగి ఉంటాడని నమ్మకంగా చెప్పవచ్చు. అమ్మ పాలు కన్నా ఆవు పాలు శ్రేష్ఠ మని కాఫీ అలవాటు చేసుకోవటం అతి బాల్యంలోనే జరిగి పోయింది.

ఇక ఇప్పుడు కాఫీ లేందే బ్రతకలేడు అంటే ఎవరికయినా ఆశ్చర్యం కలగవచ్చు నిజమేమిటంటే తిండి లేకపోయినా ఫరవాలేదు. తీర్థం లేకపోయినా చింత లేదు. కాఫీ లేకపోతే మాత్రం రవి నిలువ లేడు, కూర్చో లేడు, పడుకో లేడు, బుర్ర పనిచేయదు. కాళ్ళూ చేతులూ ఆడవు. కదలవు. గుండె కొట్టుకోదు.

వింతేమీ లేదు. అది అంతే. రవికి తిండీ తీర్థం కూడా కాఫీనే! రవి అన్నం తినటం ఎవరూ చూచి ఉండరు. అన్నం తినటం అంత ఇష్టం కూడా కాదు. కాఫీ తాగటం ఎంత మందో చూచి ఉంటారు.

చెయిన్ స్మోకర్స్ అని కొందరిని పిలవటం విన్న వాళ్ళు అర్థం గ్రహించి రవిని గొలుసు తాగుబోతు అంటే రవి ఆనందించాడే గానీ బాధపడలేదు. గ్లాసు లోని కాఫీ నోటి దగ్గర పెట్టుకుంటే, అది పూర్తయిందాకా గ్లాసు ప్రక్కకు తీయడు. తాగుతూనే ఉంటాడు. అరగారగా ఒక్కొక్క గుక్క తాగుతూ ఉంటాడు. గ్లాసు కాఫీ పూర్తి కావటానికి అరగంటయినా పడుతుంది. చెక్కెర కాఫీ నా కాదా అన్న విచికిత్స లేదు. పాలు చాలాయా, చాల్లేదా అన్న సమస్యా లేదు. ఇంత డికాక్షన్ ఉంటే కూడా రవికి అది కాఫీనే.

రవి కాఫీ తాగుతుంటే చూచి తీరాల్సిందే కానీ వర్ణించడానికి వీలు లేదు. గ్లాసు పట్టుకొనే విలాసం, నోటి కందించే వినోదం, గుక్క పీల్చే వ్యవహారం, కళ్ళార్పుతూ ముఖమంతా కదుపుతూ గుటక మింగే సుతారం చూడ ముచ్చటగా ఉంటుంది. రవి వ్యక్తిత్వం పూర్తిగా గోచరం కావాలంటే అతనికి కాఫీ గ్లాసు చేతికిచ్చి చూడాలి.

లేక లేక పుట్టిన ఒక్కగానొక్క కొడుకు రవి తన తల్లి దండ్రులకు. తండ్రి అటెండరుగా రిటైరు అవుతున్నప్పుడు రవి నడవడం నేర్చుకొన్నాడు. తల్లి దండ్రుల్ని చూచినవాళ్ళు రవి అమ్మా నాన్న 'అనుకోరు,' అవ్వా తాతా అనుకొం టారు. ఆమాటే కొందరన్నారు కూడా. రవి పుట్టింతర్వాత ఇంట్లో జీతం నాతం లేనట్లే. వాళ్ళు ఉన్నవాళ్ళు కూడా కారు. తండ్రి కింత పెన్షన్ వచ్చేది, అదే కుటుంబానికి అండ.

రవి చదువుకొనే రోజుల్లో టిఫిన్ కారియర్ స్కూలుకు తీసుకు పోవటం ఎవరూ చూడలేదు. పొద్దునేమైనా తింటే తినేవాడు. సాయంకాలం ఇంట్లోఉంటే తినేవాడు. కానీ మధ్యాహ్నం స్కూల్‌లో ఏమీ తినేవాడు కాదు.

రవి ఏమీ తినలేదంటే, నిజమే, తినలేదు. కానీ తాగ లేదని ఎవరన్నారు? కాఫీ తాగేవాడు కాఫీ ఫ్లాస్కు స్కూలుకు తీసుకు పోయేవాడు. రవి శరీరం మీద బట్టలున్నాయో లేవో కాని ఫ్లాస్కు ఉండేదన్న సత్యం మాత్రం అంత కొట్టొచ్చి నట్లుగా అందరికీ గుర్తుండేది.

రవి హైస్కూలు చదువు గట్టెక్కటం బ్రహ్మ ప్రళయం అయింది. తాను చదివింది ఏమైన సన్న హైస్కూలా ? బ్రహ్మాండమైన పెద్ద హైస్కూలు. అదే మల్టీపర్పస్ స్కూలు. నిజానికి తమ హైస్కూలులోకి కాలేజీ వచ్చేసిందని రవి నమ్మకం. కాలేజీలో ఉండే పియూసీతో సమానంగా సెవెంత్ ఫారమ్ వచ్చిందని కాలేజీ కంటే తమ హైస్కూల్ గొప్పదనీ, పీయూసీ కంటే తమ సెవెంత్ ఫారమే గ్రేట్ అనీ, ప్రపంచం చదువంతా తమ హైస్కూలులోనే ఉందనీ, ఆ హైస్కూలులో తాను విద్యార్థిననీ, ఆ ప్రపంచ విద్యారంగం తమ హైస్కూలనీ రవి పొంగిపోయేవాడు.

రవి భావించే గొప్పతనమంతా క్లాసుకూ ఉండవచ్చు, స్కూలుకూ ఉండ వచ్చు, కాని రవికి ఏముందని ప్రశ్నించే బడుద్దాయిలకు ఎప్పుడూ సమాధానం చెప్పలేదు. రవి మార్చని, సెప్టెంబరని; సెప్టెంబర్‌ని, మార్చి అనీ మార్చి మార్చి పరీక్షలు వ్రాస్తుంటే పరీక్షలకు విసుగుపుట్టి, కోర్సు ఎత్తేస్తూ, తప్పుతున్న వాళ్ళందరినీ పరీక్షలు వ్రాయనిచ్చి, ఎక్స్‌పీరియన్సున్న వాళ్ళందరినీ పాసు చేసి సెవెంత్ ఫారం తీసేయటంతో రవి చదువు ముగిసి బయట పడ్డాడు కానీ, లేక

పోతే తమ గొప్ప, గ్రేట్ ప్రపంచ నెంబర్ వన్ హైస్కూలులో శాశ్వత విద్యార్థిగా ఉండిపోవటం ఖాయమయ్యేది. కానీ తప్పిపోయింది.

ఈ మాట ఎవరయినా రవితో అంటే గొప్పకోపం తెచ్చుకొంటాడు. తన కెంత గట్టి పునాది ఉందో వీళ్ళకెవరికీ తెలియదంటాడు. నువ్వు చదవటం మానేస్తే చదువు దెబ్బతింటుందని అధికారులు భావించటంవల్ల తాను చదువుతూ రావలసి వచ్చిందని నమ్మిస్తాడు. తాను పాసుకావటంతో చదువు ఆగిపోయిందని వివరిస్తాడు. తాను చదువుతూ ఉంటే చదువు కొనసాగుతూ ఉండేదని తెలియ జేస్తాడు. ఒక కోర్సుకు తాను పాసవటం వల్ల ఎంత నష్టం వాటిల్లిందో స్పష్టం చేస్తాడు.

మరి డిగ్రీలో ఎందుకు చేరలేదంటే సీటురాలేదని మాత్రం చచ్చినా ఒప్పు కోడు. తన గ్రూపు లేదంటాడు. నాకు చదువు అక్కరలేదు, సీటు నావల్ల వేష్ట్ కావటమెందుకు, మీరు చదువుకోండని వదిలేశానంటాడు. వృద్ధులైన తల్లిదండ్రుల సేవ చేసుకోవటం కోసం చదవలేదంటాడు పొరుగూరుపోయి చదివే అవకాశం లేదంటాడు. రవి చెప్పే జవాబులు వినే ఓపిక ఉంటే ఎన్నిసార్లయినా అడగ వచ్చు. కానీ చెప్పిన జవాబు చెప్పకుండా కొత్త జవాబులు ఎన్నయినా ఎన్నిసార్లు అయినా చెప్పగల రవి శక్తి-సామర్థ్యం ముందు ఎవరి ఆలోచన అయినా దిగ దుడుపేనని ఒప్పుకోక తప్పదు.

సెపెంత్ ఫారం సర్టిఫికెట్టుతో ఎంప్లాయిమెంటు ఎక్చేంజిలో రవి తన పేరు నమోదు చేయించుకొన్నప్పుడు కోరిన ఉద్యోగాలు అటెండరు, పోలీసు కాని స్టేబులు, సాధ్యమయితే చిన్నగుమస్తా. ఏం ఇంత చిన్న ఉద్యోగాలు కోరుతున్నా వంటే ఇవే పెద్ద ఉద్యోగాలనేవాడు. ఏ శాఖ అయినా ఆరంభం ఇటువంటి ఉద్యో గాలతోనే అనేవాడు. పేచీలేని ఉద్యోగాలు అని నమ్మేవాడు. బరువుండదు. బాధ్యత ఉండదు. జీతం వస్తుంది. అంతకన్న ఏం కావాలి అనుకొనేవాడు. అనేవాడు. కలెక్టరు అయినా బంట్రోతు చెప్పినట్లు వినాల్సిందే అనేవాడు. పోలీసు సూపరిం డెండెంటు అయినా పోలీసు చెప్పినట్లు చేయాల్సిందేనంటాడు. వీళ్ళుంటేనే వాళ్ళ ఆటలు చెల్లేది, అంటాడు. అందుకని ఆ ఉద్యోగాలన్నీ ఎవరో పనికిరాని వాళ్ళకు వదిలేశానంటాడు. పనికి వచ్చే వాళ్ళంతా తనలాగా గుమస్తాలుగా, కాని స్టేబు

ష్నగా, బంట్రోతులుగా చేరాలని డిపార్టుమెంటుల్ని బాగుచేయాలని జిల్లాని ఉద్ధరించాలని, రాష్ట్రాన్ని ముందుకు తీసుకురావాలని కోరుతున్నట్లు తెలియజేస్తాడు.

రవిని చూచి అమాయకుడని, అసమర్థుడని, మాటల పోగని ఎవరయినా చులకనగా చూస్తే వాళ్ళని చాలా తేలికగా చూచి ఊరుకొంటాడు.

సెవెంత్ ఫారం పాసయి ఎంప్లాయిమెంటు ఆఫీసు చుట్టూ తిరుగుతున్న రోజుల్లో వాళ్ళ అమ్మా, నాన్న ఆరోగ్యం అంతంత మాత్రం కావటం రవికి అర్థమయింది. ఎంప్లాయిమెంట్ ఆఫీసులో ఉద్యోగం దొరుకుతుందన్న విశ్వాసం ఎందుకు కలిగిందో కాని చాలా గట్టిగా కలిగింది.

ఆఫీసు తీయక ముందు అక్కడకు చేరుకొనేవాడు. ఆఫీసు మూసిందాకా అక్కడే ఉండేవాడు. అందరూ వెళిపోయిం తర్వాత ఇంటికి వచ్చేవాడు. ఆ రోజుల్లో అమ్మ మంచం పట్టటంవల్ల రవికి పొయి ముట్టించటం తెలిసింది. అమ్మకింత గంజి కాసిపోసేవాడు. తనింత కాఫీ కాసుకొని ఫ్లాస్కులో పోసుకునేవాడు. డ్యూటీ తప్పకుండా ఆఫీసుకువచ్చి, అందరినీ పలకరించి, ఉద్యోగంవచ్చి పలకరించకపోతుందా అని ఎదుటి వేప చెట్టు కింద నాపబండ మీద తిష్ఠవేసేవాడు. రవిని చూచిన వాళ్ళకెవళ్ళకయినా ఫ్లాస్కు ముందుగా కనబడుతుందన్నది పరమ సత్యం.

ఈ చెట్టుకింద కూర్చోవటంతోనే సగం జీవితం తెల్లవారి పోయిందని ఎవరయినా వాపోతే 'ఔగదా పాపం' అనుకొంటాడు వృద్ధాప్యంలో పుట్టిన వాడు వృద్ధుడు కావటం చూడలేక వృద్ధులిద్దరూ 'హరీ' అని ఒకరూ, 'శివా' అని ఒకరూ పోవటంతో హరిహరా ద్వైతం అర్థమయి, ద్వైతంతో పనిలేక అద్వైతం బాగుందని పెళ్ళిగిళ్ళి మాటెత్తకుండా తల్లిదండ్రులు వదలిపోయిన కొట్టంలో మిగిలిపోయిన జీవితాన్ని లాక్కుపోదామని రవి నిశ్చయించుకొని ఇంటికీ, ఎంప్లాయిమెంటు ఆఫీసుకూ దగ్గర తోవవేసుకొని కాలక్షేపం చేస్తున్నాడు.

తల్లి దండ్రులు పోవటంతో కష్టాలు వచ్చాయి. సంపాదనలేదు. ఆస్తి గులవలేదు. రోజులు గడవటం ఎలాగో అర్థం కాలేదు. సంపాదించటం ఎట్లాగో

అర్థం కావటంలేదు. ఆరోజుల్లో కూడా చెట్టుతప్పలేదు. కాఫీ తప్పలేదు. నాపబండ తప్పలేదు.

రవి కష్టపడి పనిచేద్దామని ఆలోచింపక పోలేదు. ఏం పనిచేయటం? ఏ పనీ తనకు చేతకాదు. సైకిల్ తొక్కటం కూడారాదు. ఫ్లాస్కుమోయటం తప్ప తనకేం తెలియదు.

వేపచెట్టు కింద కూర్చొని కాఫీ తాగుతున్నప్పుడు ఎవరో వచ్చి ఎదురుగా నిలబడ్డారు. సందేహం ఏముందీ? ఉద్యోగం కోసం వచ్చి ఉంటాడు. అన్నం తిన్నట్టు లేదు. ఏమీ తాగినట్టు లేదు. కాఫీ ఇస్తే తాగాడు. వద్దన్నా పావలా ఇచ్చి పోయాడు. రవి బిత్తర పోయి చూశాడు.

రెండో రోజు ఫ్లాస్కు నిండా కాఫీ పోసుకొని వచ్చాడు. ఎవరికయినా ఇద్దామని చూశాడు. పావలా ఉందో లేదో గమనించాడు. ఆ రోజు ఒకే మిత్రుడు దొరికాడు. డాక్టరు కోర్సు ముగించాడు. హరిజనుడు. కార్డు రెన్యూ చేయటం కోసం వచ్చాడు. వాళ్ళకు మాటలు కలిశాయి. ఏమీ ఉద్యోగాలు లేవని ఇద్దరూ అర్థం చేసుకొన్నారు.

'డాక్టరువు కదా! ఇంజక్షన్లు చేసినా డబ్బు వస్తుందే, ప్రాక్టీసు పెట్టుకో కూడదూ' అని రవి అడిగాడు.

'రూము, టేబులు, కుర్చీలు, సిరంజులు, స్టెతస్కోపు, సామాను ఎక్కణ్ణుంచి వస్తాయి?' అని డాక్టరు అడిగాడు.

'ఎవర్ని అడిగినా ఇస్తారే!'

'బిచ్చ మెత్తాలా?'

'చూడూ! డాక్టరువు. ప్రాక్టీసు పెట్టుకో. ఎంగిలి ఉద్యోగాలకు తిరక్కు. సామాన్లు లేకపోతే బిచ్చమెత్తుకో. దొంగతనం చేయి. చేతిలో విద్య పెట్టుకొని ఉద్యోగాలు అడుక్కుంటున్నావా?' రవి చీదరించుకొన్నాడు. డాక్టరుకు కాఫీ కూడా ఇవ్వలేదు.

రవి ఆ రోజంతా ఆలోచించాడు. డాక్టరు కనిపిస్తే ఇంట్లో అక్కరలేకుండా, అడ్డంగా ఉన్న టేబిల్ ఇచ్చేద్దామని చూశాడు.

ఒక రోజు వేప చెట్టు కింద కూర్చున్న రవికి అందమయిన అమ్మాయి ఆఫీసుకు రావటం కనిపించింది ఎంత మంది వస్తున్నారో, ఎంత మంది పోతున్నారో రవికి లెక్కలు తెలుసు. ఎవరెవరికి ఏయే ఉద్యోగాలు ఈ పదేళ్ళలో వచ్చాయో కూడా వివరంగా చెప్పగలడు.

ఆఫీసుకు రాకుండా మానేసిన వాళ్ళ వివరాలూ తెలుసు కొత్తగా వస్తున్న వాళ్ళ జాతకాలూ తెలుస్తాయి ఈ అమ్మాయి సంగతి కొత్త. తెలియలేదు ఆఫీసు న్నుంచి అమ్మాయి బైటికి వస్తున్నప్పుడు పిలిచాడు. బెదురుతూ వచ్చింది. 'ఏం పేర'న్నాడు. ఏదో చెప్పింది.

అక్కడకు వచ్చే వాళ్ళందరి చరిత్రా ఒకటే! కొంచెం చదివాడు. గొప్పగా చదివాడు. ఉద్యోగం కావాలి. బీదవాడు. ఆధారంలేదు. ఆస్తిపాస్తులు లేవు. చూచేవాళ్ళులేరు. ముసల్లి తల్లిదండ్రులు. విధవ అక్క. ఎన్నో నోళ్ళు! కొన్నే చేతులు. ఇట్లాగే ఉంటుంది ఏ ఉద్యోగార్థి జీవితం తిరగేసినా—

అమ్మాయి అనాథాశ్రమంలో పెరిగింది. అక్కడే ఉంటూ ఉంది. ఏదో కొంచెం చదివింది. టైపు వచ్చు.

'ఆగు !' అన్నాడు రవి.

'ఏం' అంది.

'టైపు వచ్చు కదా !'

'ఊఁ !'

'మరిక నేం ?'

'ఏమిటి ?'

'కొట్టు, టైపు కొట్టు. జంక్షన్‌లో టైపుమిషన్ పెట్టుకో! వచ్చిన కాగితం టైపు కొట్టి వదులు !'

అమ్మాయి ఎగాదిగా చూచింది.

'ఉద్యోగం రాకపోతే పీడా పోయింది. టైపు కొట్టు' అన్నాడు రవి.

'మరి టైపు మిషన్ !' అమ్మాయి సందేహించింది

'చూద్దాం చూద్దాం' అంటూ ఆలోచనలో పడ్డాడు రవి. రాత్రంతా ఆలోచించాడు. పరిష్కారం దొరికినట్లే దొరికి తప్పిపోతూ ఉంది. అనేక మార్గాలు చూశాడు. అన్నీ అమ్మాయితో చెప్పాలను కొన్నాడు. ఆమె కోసం వెతకటంతో సరిపోయింది. ఆమె కనిపించలేదు. మిషన్ దొరికిందో, పెనిమిటి దొరికాడో ! అనాథాశ్రమం పోయిందో! ఇల్లాలయిందో! కార్డు రెన్యూ చేయించటానికి వస్తుందో రాదో!

వేపచెట్టు చల్లగా ఉంది. ఎండాకాలంలో ఎండతగలదు. వానాకాలంలో వానపడదు. చలికాలం ఎక్కువచలి అనిపించదు. వేపచెట్టు దైవస్వరూపంలాగా నిరుద్యోగుల్ని కాపాడుతూఉంది. దానికింద కాఫీ ఫ్లాస్కుతో రవి ప్రత్యక్షం. ఉద్యోగం వెతుక్కుంటూ వచ్చేవాళ్ళకు వేపచెట్టు, ఫ్లాస్కు ప్రత్యక్షం కావటం రివాజు. అటు చూడకుండా అక్కడ కూర్చోకుండా కాఫీ తాగకుండా జనంపోరు.

రవి ఇచ్చిన కాఫీతాగి నిట్టూరుస్తూ, చెమట తుడుచుకొంటూ ఉన్న నిరుద్యోగి ముఖంలోకి చూస్తూ అడిగాడు రవి 'ఏం చదువుకున్నా'వని.

'బియోడి' అనటంతో భళ్ళున నవ్వాడు. 'ఎందుకు నవ్వుతావ'న్నాడు. సమాధానం 'ఏం నవ్వకూడదా' అని. 'నవ్వొచ్చుగానీ నవ్వుకూడా వస్తుందా అని ప్రశ్నించాడు. 'నవ్వటానికి కారణం ఉండాలికదా' అన్నాడు.

'కారణం కదాకావాలి. అయితే విను. బియోడి చదివినవాడు నిరుద్యోగిగా ఉండకూడదని. ఎందుకుండకూడదు. 'నేను లేనా' అని అడగాలని నీకనిపించటం ధర్మమే. నేను నవ్వటం ధర్మం. ఈ దేశంలో జనం రోజూ పెరుగుతున్నారు. ఆపండ్రా అనేవాడు లేడు, వినేవాడు లేడు. ఎవడన్నా అన్నాడా వాడిదుంపదెగుతుంది. వాటికి దుంపలేకపోతే, వాళ్ళమ్మ గుణశీలాలు ప్రమాదంలో పడతాయి. వాడికి అధికారం ఉంటే ఊడుతుంది. ప్రభుత్వాలు కూలతాయి. ఏమిటి నీనస అని నీ కనిపించవచ్చు. నాకూ అనిపిస్తుంది. ఎవడికయినా అనిపించవచ్చు. పుట్టిన వాళ్ళంతా పెరగాలికదా! గాడిదల్లా పెరక్కూడదు కదా! చదువుకోవాలి, అయిదో సంవత్సరం ఏంఖర్మ. ఆరోనెలలోనే చదువు చెప్పేవాడుంటే పిల్లల్ని అప్పగిస్తారు తల్లిదండ్రులు. అందుకు సందేహమా? లేదుకదా! మేష్టరుకు కావలసింది టేబుల్,

సిరంజి కూడా కాదు. సైపు మిషన్ కూడా కాదు. బెత్తం ఉంటే చాలు-మాష్టారు అయి కూర్చుంటాడు ఇసుక ఉండనే ఉంది. అ ఆలు నేర్పవచ్చు. తమ పిల్లలు ఇసుకలో వేలుపెట్టరాదని తల్లిదండ్రులు అనుకుంటే కాగితాలు వస్తాయి చాపలు వస్తాయి. బల్లలువస్తాయి కుర్చీలు టేబిళ్ళు చిన్నపిల్లల కన్నీళ్ళలోంచి పుట్టుక వస్తాయి. ఇంతేనా? బెల్డింగులే పుడతాయి- లే! పో! పదిమంది పిల్లల్ని పోగేసుకో! పాఠశాల అయిపోతుంది. పోతావా - ఇంకా ఇక్కడే ఉంటావా! పోవయ్యా పో!, కసురుకొన్నాడు రవి.

నిరుద్యోగి అక్కడ ఆగితే ఒట్టు. వెనుతిరిగి చూస్తే ఒట్టు. కంటికి కనిపిస్తే ఒట్టు.

ఎంప్లాయిమెంటు ఆఫీసులో గలాటాగా ఉంటే రవి అటుపోయి చూచి వచ్చాడు. వస్తూ వస్తాదులాంటివాణ్ణి పట్టుకొచ్చాడు వస్తాదు తన పేరు పంపమని లంచం ఇచ్చాడట. అయినా పేరు పంపలేదట. క్లర్కు లేదు పొమ్మనాడు. టేబుళ్ళూ కుర్చీలు తల క్రిందులయ్యాయి.

వస్తాదుకు చదువు వంటబట్టలేదు. చిన్నప్పుడు తిన్నాడు కాబట్టి ఊరాడు. తిన్నది అరగటానికి కుస్తీలు పట్టాడు కాబట్టి వస్తాదు అయ్యాడు. తింటానికి లేదిప్పుడు. కట్టుకోవటానికి లేదిప్పుడు. ఉన్నవమ్మి తెచ్చిన డబ్బు క్లర్కుకు ఇచ్చానంటాడు. ఇచ్చాడో చచ్చాడో ఉద్యోగం రాలేదు అటెండరు ఉద్యోగం. వస్తాదు ఏడుస్తున్నాడు. తనకేం పని చేతకాదు. అద్దెసైకిలు తొక్కుకొచ్చాడు. 'రిషా తొక్కుకో!' - 'నేనా!' - 'నువ్వే' - 'నేనా' - నువ్వే' - 'నావల్లకాదు' - 'తిండిలేక ఛస్తావా?' 'చావను. రిషా తొక్కి చావాలా?' 'బ్రతికి ఉండు' - 'నువ్వే తొక్కుకో, రిషా. ఎవడిక్కావాలి నీ బోడిసలహా!' వస్తాదు కోపంగా వెళ్ళిపోయాడు.'

'నా బ్రతుకేదో నేను బ్రతుకుతున్నాను. నా భుక్తి నాకు గడుస్తూ ఉంది. నాకు చేతయిన పని నేను చేసుకొంటున్నానే' రవి గొణుగుతూనే ఉన్నాడు.

చిన్న ఫ్లాస్కు పెద్ద ఫ్లాస్కు అయింది. పెద్ద ఫ్లాస్కు కూడా చాలకపోయేసరికి తడికెలు వచ్చాయి. స్టవ్ వచ్చింది. వేప చెట్టు కింద కాఫీ సృష్టి అవుతూ ఉంది.

ప్రక్క తడికెలు పై కెక్కిన తదికలయ్యాయి. వాసాలు మొలిశాయి. టార్పాలిన్ వెలిసింది. కుర్చీలు, బల్లలు తయారయ్యాయి.

రవి కాఫీ మాత్రమే చేసేవాడు. కాఫీ చాలా రుచిగా ఉంటుంది. తాను తాగటానికి చేసుకొంటాడు. అక్కడ బోర్డేమీలేదు. కానీ దాన్ని రవి కాఫీ హోటల్ అంటారు. చాలా కాలం కాఫీ మాత్రమే దొరికేది. ఇప్పుడు తిండీ తీర్థం కూడా దొరుకు తున్నాయి.

అక్కడ ఉచితం అని ఒక బోర్డు ఉంది. సలహాలు, మొదటిసారి కాఫీ చివరిసారి కాఫీ ఉచితంగా ఇవ్వటం రవి డ్యూటీ. మిగతా సమయాల్లో డబ్బు వసూలు చేస్తాడు.

ఎంప్లాయిమెంటు ఆఫీసుకు మొదటి సారి వచ్చిన వాళ్ళు రవి ఆతిథ్యం స్వీకరించి తీరాలి. ఉద్యోగం వచ్చి వెళ్ళి పోయేటప్పుడు చివరిసారి వీడ్కోలు విందు పుచ్చుకొని వెళ్ళాలి. నిజానికి ఈ రెండు సమయాల్లో వాళ్ళ జేబుల్లో డబ్బు లుంటాయి. అయినా ఇవ్వనక్కరలేదు. చాలా సార్లు ఉండవు. అయినా ఇవ్వా ల్సిందే! లేదా హోటల్లో పనిచేయాలి.

ఇప్పుడు రవి హోటల్లో యజమాని. స్థిర ఉద్యోగులు పదిమంది. చర ఉద్యోగులు మరో పదిమంది. రవి ఇప్పుడు కాఫీ కలపడు. తాగుతూ ఉంటాడు. అన్నం తినడు, నీళ్ళు తాగడు. కాఫీ తాగుతుంటాడు. సుతారంగా, సున్నితంగా, విలాసంగా, రవి కాఫీ తాగుతుంటే చూచి తీరాలి.

# సూర్యుడు తలెత్తాడు

నేటి తెలుగు దేశంలో అదొక మారుమూల పల్లె. కుగ్రామం. రావడంటే మనిషి కాదు, మర.

సూర్యుళ్లా పొలంలో పొడిచి, ఇంట్లో కుంకుతుంటాడు. చేనుకి చెమటతో స్నానం చేయించి, నెత్తురుతో బొట్టు పెడుతుంటాడు. పంట చేను పసి పాపల ముత్తయిదువు అయితే పైరును అస్త్రారుబస్తంగా చూచుకొంటుంటాడు.

రావడి ముఖం ఊరు చూళ్ళేదు. పల్లె చూళ్ళేదు పిల్లలు చూళ్ళేదు. పెళ్లాం చూళ్లేదు. సూర్యుడు చూళ్ళేదు. పొలం చూసింది.

వంగి పని చేయటం, తలవంచుకు నడవటం, ముఖం దాచుకొని నిద్ర పోవటం అతడి రివాజు.

రావడి మాట పొలం కూడా విన్లేదు. నిశ్శబ్దం అతడి దినచర్య. జీవిత చర్య.

గుండె గుహలో రాక్షసుడు దాచి పెట్టిన పసివాడి కేక ఒకటి ఉంది. బైటికి వినిపించదు. నలుగురుంటే రావడి గుండె కూడా చప్పుడు చేయదు.

రావడి కళ్ళలో నీళ్ళు లేవు ఎరుపు లేదు ఏడుపురాదు. కోపం రాదు. రాయి! ఎండకూ, చలికి వేడిగా చల్లగా కాదు. రాయి కూడా కాదు, దూది.

రావడి శరీరాన్ని పంచభూతాలు బతికుండగా పంచుకున్నాయి ఏం పొరపాటు జరిగిందో ఎముకలు మిగిలాయి మరేమయిందో అవి కదులుతున్నాయి.

ఇంటికి వచ్చే సరికి పల్లెంతా గుబగుబ లాడుతూ ఉంది. సీత కల చచ్చి పోయింది. ఉరిపోసుకొని. ఎవడో చేయి పట్టుకున్నాడనీ, చెప్పినా వినలేదని - జనం చెవులు కొరుక్కుంటున్నారు.

రావడు ఆ రాత్రి మామూలుగా నిద్రపోయాడు. ఉదయం పొలంలో సూర్యుడు.

రావడు భూమి బిడ్డ. ఆ ఎకరం పొలం అతడి యావదాస్తి.

కాళ్ళు కడుక్కొని కూటికూర్చుంటే వచ్చి వడ్డించే కూతురి కాళ్ళూ చేతులూ కనబళ్ళేదు. కూడురాలేదు. లేదు అన్న మాటన్నా వినబళ్ళేదు. రావడదేం పట్టించుకోలేదు. నిద్రపోయాడు.

పొయిలో పిల్లి లేవటం లేదు. గింజలున్నట్టే వుంది. పిల్లే ఉన్నట్లు లేదు.

లేచిపోయిందనీ లేపుకుపోయాడని రెండు మాటలు. పిల్ల దొంగసొత్తు కాలేదన్న నమ్మకం రావడికేముంది ?

ఆ మాటకే వస్తే రావడికి ఏం నమ్మకాలున్నాయసలు ?

కొండల్లో ఇళ్ళు కట్టారని, పొలాలు ఇస్తున్నారని చాలా మంది పల్లెవాళ్ళు వెళ్ళిపోయారు. రావడు పోలేదు.

పొలం పోవడానికి బయలుదేరి ఇంటి ముందు నెత్తురు మడుగులో పడివున్న కొడుకును చూశాడు. దెబ్బలు! గుండె ఆడుతూవుంది. చావడు. మొండి ఘటం. గట్టి ప్రాణం.

జనం పోగయ్యారు, ఊళ్ళోవాళ్ళతో పెట్టుకోవద్దురా అంటే వింటాడా? ప్రాణాలకు తెచ్చుకొన్నాడు. ఓపిక ఉన్నవాళ్ళు ఏడుస్తున్నారు. చేతనయినవాళ్ళు ఏమన్నా చేస్తున్నారు.

రావడు మాత్రం అక్కళ్ళేదు. సూర్యుడితోపాటు పొలంలో తిరుగుతున్నాడు.

ఇంట్లో దీపం కొండెక్కించి, కంట్లో దీపం ముసుగులో దాచి, కుక్కిమంచం కబుర్లు వింటున్నప్పుడు గాజులు చప్పుడు, మట్టెల మోత!

ఈ చప్పుడు తనకు తెలుసు. తనదే తన నెత్తురదే! తన గుండెదే!

రావడు నిద్ర లేచాడు. సూర్యుడు అర్ధరాత్రి బయటికి వచ్చాడు.

ఎదురుగా కూతురు! నిండు చూలాలు! కాళ్ళు పట్టుకొంది. తల నిమిరాడు.

ఆ రోజు ఉదయం సూర్యుడు ఇంట్లో ఉదయించాడు రాత్రి పొలంలో అస్తమించాడు.

పల్లెకు పోయేసరికి ఇల్లు రవందాడిగా ఉంది. పసి గొంతు ఏడుపు. ఆడ గోల. మగ పిల్లాడు తల్లిపోయింది.

రావడు మనవణ్ణి చూశాడు. కూతుర్ని చూశాడు మనవణ్ణీ కూతుర్నీ చూశాడు. ఉదయం అస్తమయం చూశాడు.

మనవణ్ణి పెంచటమన్న మహా యజ్ఞంలో పసివాణ్ణి బలిపశువును చేస్తున్నాడు రావడు.

'ఈడు జచ్చిందాకా నుప్ జచ్చేట్టు లేవంటూ పక్కింటి గొడ్రాలు మనవణ్ణి మారెమ్మ ఎత్తుకుపోయినట్లు ఎత్తుకుపోయింది.

ఆపు, కొట్టు, పొడువు, చంపు అనే అరుపులు దూరంనుంచి వినిపించాయి. కర్రలు, కట్టెలు, బొంగులు పుచ్చుకొన్న మనుషులు పొలాలకడ్డంపడి వస్తున్నారు.

పందిని చంపుతున్నారు కాబోలునను కొన్నాడు రావడు. రొప్పుతూ రోస్తూ నురుగులు కక్కుతూ కొడుకు పరుగెత్తుకొస్తున్నాడు. ఏటుకందలేదు. పొలం వచ్చాడు. తండ్రిని చూశాడు. కాళ్ళమీద పడ్డాడు.

పడ్డవాడు లేవలేదు. కర్రలు లేవనివ్వలేదు.

ఏటు మీద ఏటు రావడానికీ నాలుగు తగిలాయి. అది మనిషి ఆకారం కాదని మట్టి ముద్దనీ రుజువు అయిందాకా కర్రలు ఆగలేదు.

ఆపైన మనుషులు ఆగలేదు కాళ్ళు కదిలాయి కొడుకు వళ్ళంతా నెత్తురు. రావడి బట్టల మీద నెత్తురు. సూర్యుడి చేతుల్నిండా నెత్తురు.

రావడి కళ్ళలో ప్రాచీన గంగ, పాతాళ గంగ బుడబుడ లాడినట్లు అయింది. చెమ్మ! తడి! సొన! వాన! కుండపోత! కన్నీరు! నెత్తురు! నెత్తుటి కన్నీరు! కన్నీటి నెత్తురు! చిత్రం! రావడి కళ్ళలో నీళ్ళు.

తీరుబడిగా గోయి తవ్వాడు. తీరికగా కొడుకును పడుకోబెట్టాడు. ముఖం తుడిచాడు మట్టివేశాడు పూడ్చాడు.

ఈ శవం మంచి ఎరువు. పొలం బాగా పండుతుంది. ఊరు తింటుంది పీనిగకూడు.

చాలా రోజులు సూర్యుడు పొలంలోనే పుట్టాడు. అక్కడే చచ్చాడు. పల్లె వల్ల కాదుగా, ఇల్లు శవం పెట్టెగావుంది.

రావడు పొలంలో పాక వేసుకొన్నాడు. మూడు బొంగులు, మోపుగడ్డి.

ముంతా, మూకుడు, చట్టి, పిడత, కుండ, సామాన్లు. నరాల్లో చలి, వణుకు ఎముకల్లో నిప్పు, మంట, రావడి జబ్బులు.

కర్మ సాక్షి నడినెత్తి మీద కబుర్లు చెబుతూంటే చింతయ్యొ వచ్చి చావు కబురు చల్లగా చెప్పాడు. "ఈ పొలం నాది."

"ఎట్టా?" అనాల్సింది రావడు. అన్లేదు.

"ఏందీ?" అంటూ చూడాల్సింది. చూళ్ళేదు.

మౌనం.

ఎప్పుడో తీసుకొన్న అప్పు. వంద రూపాయలు. వేలు దాటింది. వేలు ముద్రలు దాటింది. కోర్టుకు పోయింది. స్టాంపుకు ప్రాణం వచ్చింది. నడిచి పొలంలోకి వచ్చింది.

నిలబళ్ళేకపోయాడు. కూలబడ్డాడు. కూర్చోలేకపోయాడు. వాలిపోయాడు. నేలను వాటేసుకొన్నాడు బిడ్డల్ని, బంధువుల్ని, తల్లిని, తండ్రిని వాటేసుకొన్నట్లు పొలాన్ని కౌగిలించుకొన్నాడు.

నోట్లో దుమ్ము.

చింతయ్యొ రావణ్ణి పొలంలోంచి అవతలికి ఈడ్చాడు.

తన వొంట్లో ఉన్న నెత్తురూ చెమటా పీల్చుకొన్న పొలం కాలు కదపకుండా కూర్చుంది.

కొడుకును పొట్టన పెట్టుకొని నోరెత్తకుండావుంది.

కర్మసాక్షి మాత్రం పీపు చరుస్తున్నాడు.

రావడు పుట్టటమే తలక్రిందులుగా పుట్టాడు పెరగటం తలవంచుకొని పెరిగాడు. వయస్సు పైబడ్డకొద్దీ తలనేలకు దగ్గరయింది. ఇప్పుడు నేల పాలయింది.

నమ్ముకొన్నందుకు వళ్ళంతా నోరంతా బురదరాసి నేల కనికరించింది.

మెల్లగా కూర్చుని, మోకాళ్ళ మీద చేతులు పెట్టుకొని, నడుం పట్టుకొని. వెన్నెముక రాసుకొని రావడు నిలబడ్డాడు.

వంగి చేసే పనిలేక రావడు నిలబడ్డాడు.

నిలబడుతుంటే వెన్నెముక కరకరలాడింది. పెట పెట లాడింది. మూలిగింది. అరిసింది.

వంగిపోయిన తల లేవటానికి మొండికేసింది. బిగిసింది. పట్టింది. మెల్లగా సడలింది. తిరిగింది. తలను నిలబడనిచ్చింది.

కళ్ళు పూర్తిగా విప్పాడు. ఎదురుగా చూశాడు. కళ్ళు బైర్లు కమ్మాయి. చుట్టూ చూశాడు. గబగబా చూశాడు. అన్ని దిక్కులు చూశాడు.

ఎంత సంతోషం. నేల, నింగి, దిగంతాలు భూమి ఎంత అందమయిందీ, ఎంత విశాలమయిందీ-ఈ భూమ్మీద తాను పుట్టాడు. పెరిగాడు. ఎంత అదృష్టం.

పీల్చిన గాలి-గుండె బంధువు-ఎంత హాయిగా వుంది!

నడిచాడు. అడుగు వేస్తే కాలికెంత బలం! ఎంత ఆనందం! ఇంతకాలం తాను కోల్పోయిందేమిటో రావడికి తెలియటం మొదలయింది.

తన పొలం వైపు చూశాడు. వళ్ళు స్వాధీనం తప్పుతూ ఉంది. పల్లెలో పేరుకు ఇల్లుంది.

వారం పాటు సూర్యుడు రాత్రీ, పగలూ ఆ యిల్లు వదల్లేదు. ఈ వారం రావడి కంటి మీద కునుకు లేదు.

ఆ రోజు ఉదయం రావడు ఊరు చెరువు గట్టు మీద పుట్టాడు. పుట్టీ పుట్టక ముందే సూర్యుడు ఊరు చెరువులో పడి తన్నుకులాడు తున్నాడు. ఎవడీ సూర్యుణ్ణి కాపాడేది?

ఉదయం కాంతిలో చెరువు గట్టుమీంచి రావడు ఊరంతా పరికించాడు.

వింత - కొత్తగా కనిపించింది.

చిత్రం - అసహ్యం పుట్టింది.

విచిత్రం - కసి.

చీకటి పడింది. జేబులో అగ్గిపెట్టె చేతికి తగిలింది. గల గల లాడింది. తీసి గీశాడు ఆ వెలుతురులో రావడి ముఖం కనబడింది. ఇది మునుపటిది కాదు.

కుంకిన సూర్యుడు రావడి ముఖంలో అర్ధ రాత్రి పుట్టాడు. ఎర్రగా మంటగా జ్వాలగా ముఖం. సూర్యుడు మండిపోతున్నాడు

అగ్గిపెట్టె గట్టిగా పట్టుకొని రావడు గావుకేక పెట్టాడు. చెరువు ప్రతిధ్వనించింది. మాట వినబళ్ళేదు. చిత్రం. రావడు మాట్లాడు తున్నాడు.

చెరువు గట్టు దిగి ఊళ్ళోకి పోతూ అరిచాడు.

"ఈ బతుకు లిట్టా తగలబడ్డానికి ఊల్లేదు. ఈ బతుకులిట్టా తగలబడ్డానికి ఊల్లేదు. ఈ బతుకులిట్టా తగలబడ్డానికి ఊల్లేదు".

# ఇంకేం కావాలి ?

తమకు పెళ్ళై పదేళ్ళైంది. పిల్లలు లేరు.

మొదట్లో రమకదేం చింతగా లేదు. రాజు అంతగా పట్టించుకోలేదు.

కాలం గడుస్తున్న కొద్దీ ఇరుగు పొరుగు ఇబ్బందెక్కువ కాసాగింది.

అత్తామామలు ఏమీ అనలేదు. కానీ అనకపోవటమే బాధగా వుంది. ఏమన్నా అంటే బాగుంటుందని ఆశించింది రమ. నిరాశే.

ఆ నిరాశ ఎంతో కాలం లేదు. అమ్మానాన్నల్ని పండక్కి పిలిచి మర్యాద లన్నీ చేసి మర్యాదగా ప్రారంభించి అమర్యాదగా తిట్టిపోశారు.

సారాంశం పిల్లల్లేకపోతే వాళ్ళేం భార్యా భర్తలు? ఇదేం సంసారం?

మొదట్లో రమ రాజులు పిల్లలు వద్దనుకొని ఇలా ఉంటున్నారు కాబోలునని చుట్టుప్రక్కల వాళ్ళు చెవులు కొరుక్కోనకపోలేదు

వాళ్ళ చెవుల తిమ్మిరి వదలక ముందే అది సత్యం కాదని ఋజువు అయిపోయింది.

వాళ్ళిద్దరూ డాక్టరు దగ్గరకు పోయి పరీక్ష చేయించుకొని వచ్చారు. ఏం లోపం లేదట! పిల్లలు కలుగుతారట!

మరేం? ఎందుకు కలగలేదు? అనేవాళ్ళు డాక్టరును అడిగారు

అందుకు నేనేం చెబుతాను అనేసి వూరుకొన్నాడు డాక్టరు.

వాళ్ళ నల్గురికీ వీరిద్దరు. అందుకు మేమేం చెబుతాము అని మొరాయించారు.

అంతటితో ఆగలేదు. "దీనికి పిల్లల్ని కనే రాతలేదు" అని రమ తల్లి సతాయించింది.

రమ అత్త పిల్లలు కోసం మొక్కుబళ్ళు ప్రారంభించింది. శాంతులు చేయించింది. పూజలు చేసింది. అదేదో నోము నోచింది.

ఏం లాభం లేదు!

పిల్లలు కలగలేదు.

రమ రాజుల అమ్మ నాన్నలు పిరిద్దర్నీ పుణ్యక్షేత్రాలకు, తీర్థాలకు పట్టు బట్టితోలారు.

దేవుళ్ళ దర్శనాలకంటే నాల్గూళ్ళు తిరగటం ఇద్దరికీ బాగానేవుంది.

చాలా మంది దేవుళ్ళను దర్శించారు.

చాలా తీర్థాలలో మునిగారు.

చాలా రోజులైంది.

ఏం లాభం ? పిల్లల్లేరు !

ఒక రోజు దూరపు బంధువు, పండు ముసలి, పాతిక మంది మనవళ్ళకి, పది మంది మనవరాళ్ళకి వంశకర్త, వచ్చాడు. వచ్చి రావటంతోనే మీరసలు ఆడా మగా మనుషులేనా ? అని ప్రాథమిక ప్రశ్న వేశాడు.

'ఏం సంగతి' అని ఇద్దరూ ఒకళ్ళ మొహం ఒకళ్ళు చూసుకొన్నారు.

"ఎందుకలా గుడ్లు మిటకరిస్తారు. తేల్చి చెప్పండి?" అని మునుం పెట్టి దంచుతున్నాడు.

ఈ ప్రశ్నల పోట్లు తట్టుకోలేక సినిమాకు పోయారు.

'ఎంత మంచి జంట!' వీధిలోని వాళ్ళు వాళ్ళనిచూచి ముక్కు మీద వేలేసుకున్నారు.

ముక్కు మీద వేలెందుకు వేసుకుంటారో పాపం వాళ్ళు?

చిలకాగోరింకల్లా వున్నారని చాలా మంది ఒప్పుకొన్నారు. మొగుడూ పెళ్ళాం అంటే అలా వుండాలని అనుకొన్నారు.

వాళ్ళను చూడటం కళ్ళ పండగ్గా భావించుకొన్నారు.

వాళ్ళదేం అన్యోన్య దాంపత్యం కాకపోలేదు.

కాదంటే సంతానమే కలగలేదు.

ఎందుకు కలగలేదు ?

ఆదే అంతుబట్టటం లేదు

వాళ్ళ అమరాగం పొరుగువాళ్ళు అసూయ పడేంతగా వుంది.

వయసులో వున్నారు. ఆరోగ్యం లోపంలేదు.

వాళ్ళు వద్దనుకోవడం లేదు. పైగా సంతానం కావాలనుకొంటున్నారు.

డాక్టర్లతో మాట్లాడారు.

తీర్థాలలో మునిగారు. పుణ్యక్షేత్రాలు దర్శించారు.

తినటానికి కావలసినంత వుంది.

ఉద్యోగం అక్కర్లేక పోయినా చేస్తున్నాడు

కావలసినంత తీరిక.

అంతా బాగానే ఉంది. సంతానమే కలగలేదు.

మొదట్లో రమ అంతగా బాధ పడలేదు.

క్రమక్రమంగా దిగులు మొదలైంది.

చిలికి చిలికి గాలివాన అయినట్టు పిల్లల్లేరని దిగులు పట్టుకొంది.

అంత్రాలు కట్టించుకొంది.

తాయెత్తులు కట్టించుకొంది.

అంతెందుకు పిల్లల కోసం చేయాల్సిన పనులు ఎన్ని ఉన్నాయో అన్నీ చేసింది.

ఏం లాభం ? పిల్లల్లేరు!

రాజు శరీర తత్త్వం తెలిపే పుస్తకాలు చదివాడు.

శృంగార గ్రంథాలు, రహస్యాలు పరిశీలించాడు.

ఏం లాభం ? పిల్లల్లేరు!

భార్యాభర్తలు అమ్మానాన్నలు, పోనీ అత్తామామలు అంతాకలిసి కూర్చొని తీరుబడిగా ఆలోచించారు.

రాజు ఒక్కగానొక్క కొడుకు! రమ ఒకే ఒక్క కూతురు.

రెండు కుటుంబాలకు లెక్కలేనంత ఆస్తి ?

వారసులు లేకపోతే ఈ ఆస్తి ఏం కాను ? ఏమైపోను. దిగులు పడ్డారు. ఆలోచించారు.

పెద్దవాళ్ళు ఏకగ్రీవంగా ఆలోచించి, తీర్మానించారు.

రాజుకు మళ్ళీ పెళ్ళి !

రమ రాజులు ఒకేసారి వీల్లేదన్నారు.

తీరుబడిగా వీల్లేదన్నారు.

నిశ్చయంగా వీల్లేదని కుండ బద్దలు కొట్టారు.

కుండలోంచి చిందినట్లు నలుగురి కళ్ళల్లో నీళ్ళు.

ఏం చేస్తారు. వాళ్ళు మాత్రం!

వాళ్ళు మాత్రం ఎంతమందిని కన్నారు.

నానా అవస్థలు పడి వీళ్ళొక మగపిల్ల వాణ్ణి, వాళ్ళొక ఆడపిల్లని కన్నారు అంతే కదా!

వాళ్ళు మాత్రం ఏం ఘనకార్యం చేశారని?

వాళ్ళకు మాత్రం మొదట పదేళ్ళలో పిల్లలు కలిగారా ఏమన్నా నా?

ఏమైనా గట్టిగా అనాలంటే వాళ్ళకు మాత్రం ఎక్కడివి గుండెలు?

చివరకు ఏమీ చేయలేక సర్దుకొన్నారు.

ఏమిటో దేవుడిస్తే పుడతారు లేకుంటేలేదు.

ఎప్పటికైనా పుడితే సరే అంది. లేకపోతే వాళ్ళతదనంతరం ఆస్తులు ఏ అనాథాశ్రమానికో ఇస్తే ఏ పిల్లలో సుఖంగా బ్రతుకుతారు.

ఈ నిర్ణయం తీసుకొన్న తర్వాత అందరికీ ఏ డ్వాలనిపించింది.

అందరికళ్ళూ చెమ్మగిల్లాయి.

ఒకరోజు "ఏం మనకెప్పటికైనా పిల్లలు కలుగుతారంటావా?" రాజు నెమ్మదిగా, సానునయంగా అడిగాడు.

"ఏమో నాకేం తెలుసు" అందిరమ.

మనకి పిల్లలు పుట్టకపోతే ఎలాగండి?" అని రమ ఒకనాడు అడిగింది.

'ఏమో అందుకు నన్నేం చేయమంటావు' రాజు ఎగిరిపడ్డాడు.

ఈ మధ్య రమ రాజు ఎడముఖం పెడముఖంగా వుంటున్నారు. ఇకఇకలు లేవు. పక పకలూ లేవు.

మాట్లాడుకోవటమే తగ్గింది.

సినిమాలు చూడటం లేదు.

"నేనేం చేశానండి మీరిట్లా?" అని రమంటే.

"నేనేమో చేసాననే నువ్విట్లా" అని రాజు ఎగిరాడు.

వీళ్ళిట్లా అంటే ఎట్లాని రాజు తల్లి దండ్రులు రంగస్థల ప్రవేశం చేశారు.

నీతులు చెప్పారు.

ఉపదేశాలు చేశారు.

ఉపవాసాలు చేశారు.

రమ రాజులు బాగానే వుంటున్నారు. కాని మునుపున్నంత బాగుండటం లేదు.

పిల్లలు అన్యోన్యంగా ఉండటంలేదని రాజు తల్లిదండ్రులు రమ తల్లి దండ్రులకు వ్రాశారు.

వాళ్ళు వచ్చారు. ఏం మాట్లాడలేదు.

రాజు నీడలాగా రమ అనుక్షణం వెంటవుండే ఏర్పాటు చేశారు.

అయినా వాళ్ళు సంతోషంగా ఉండటంలేదు.

నలుగురు పోగై ఏం సంగతి అన్నారు.

వాళ్ళు మాట్లాడలేదు.

ఎందుకు మీరు సంతోషంగా లేరని ఖచ్చితంగా అడిగారు.

"ఏం మాకు పిల్లలు పుట్టారని సంతోషించాలా" అని ఇద్దరూ ఒకేసారి ఎగిరి పడ్డారు.

ఆ నల్గురికే దక్కు తెలియటం లేదు.

వాళ్ళకు పిల్లలు కలక్కపోవటానికి ఈ నలుగురే కారణమైనట్టుంది వాళ్ళ తీరుచూస్తే.

ఏం చేయాలో తెలియక పోవటమేకాదు. బిత్తర పోయారు. అంతే వెళ్ళి పోయారు. పుణ్యక్షేత్రాలకు పుణ్యం కోసం పోయారు. పోతే పోయారులే అని రాజు రమలేం మాట్లాడలేదు.

రోజులు గడిచాయి. వాళ్ళు రాలేదు.

సంవత్సరాలైంది వాళ్ళు వెళ్ళి! వస్తేనా? రాలేదు.

ఈ మధ్య ఒకసారి రమ ఒంట్లో ఏం బాగాలేదు.

రాజేం హృదయం లేనోడా, బాగానే చూచుకొన్నాడు.

రోగం ఏమీ ఘోరమైంది కాదు. తగ్గిపోయింది.

రమ కులాసాగా వుంది. ఇంట్లో ఎవళ్ళకు వాళ్ళు మునుపటికంటె ఎక్కువగా మాట్లాడుకోవలసి వస్తూ వుండేది.

ఏమైనా చెప్పాలంటే ఆ గదిలోంచి ఈ గదిలోకి రావటం తప్పనిసరి కావటంతో ఇద్దరూ ఒకే గదిలోకి చేరారు.

గది వదిలి వెళ్ళితే మళ్ళి రావలసివస్తుంది కాబట్టి గది వదలటం లేదు.

ఇద్దరూ గదిలో వెలిగించని కొవ్వొత్తుల్లా కూర్చొని కబుర్లు తింటూ, నవ్వులు తాగుతూ వున్నారు.

వాళ్ళకిక ఆకలి దప్పులు లేవు. అన్నం నీళ్ళు లేవు.

ఒకరోజు రమ వాంతి చేసుకొంటూ వుంది.

కబుర్లు ఎక్కువగా తింది. అరక్క వాంతి చేసుకొంటూ ఉందని చెవులు మూశాడు.

చింతపండు నాకుతూ వుంటే 'ఏం పొయ్యేకాల మొచ్చిందని' తిట్టాడు.

నెలతప్పిందని చెబితే వినలేదు.

పిన్న తర్వాత నమ్మలేదు.

దేవుళ్ళ మీద, బంధువుల మీద అన్నింటి మీద ఒట్టుపెట్టి చెబితే నమ్మాడు.

నమ్మిం తర్వాత ఇల్లు పీకి పందిరేశాడు. పందిరి పీకి ఇల్లేశాడు.

కాలుకాలిన పిల్లిలా తిరిగాడు.

పిచ్చివాడిలా అరిచాడు.

తిక్కవాడిలా తిరిగాడు.

పెర్రెక్కిన చాదస్తంలా నవ్వాడు

రమని ఎత్తి కుదేశాడు. ఎగిరి కూర్చున్నాడు.

'ఇదేం గొడవరా బాబోయ్' అని రమ దిగులుపడింది. భయపడింది.

ఏడుపు లంకించుకొంది.

రాజు మామూలైపోయాడు.

రోజు కొకసారి డాక్టరు దగ్గరకు తీసుకుపోయాడు.

డాక్టరు చెప్పింది.

రమకు బాధ కలగరాదని ...,

కష్టం ఉండకూడదని....,

శ్రమపడరాదని....,

రాజు శ్రద్ధగా విన్నాడు

రమని మంచం దిగనియ్యలేదు. బయటకు పోనియ్యలేదు.

అన్నం మంచం మీదే! నీళ్ళు మంచం మీదే! అన్నీ మంచం మీదే! విగనిస్తేనా?

'ఇదేందిరా బాబోయ్' అనుకొంది రమ.

డాక్టరు దగ్గరకు పోయారు. చెప్పింది.

ఇలా చేస్తే కాన్పు కష్టం అవుతుంది.

రమని మంచం దిగనియ్యాలి.

పని చెయ్యనియ్యాలి.

మరీ బండరాయిలా మూలనపడెయ్యరాదు అని చెప్పింది.

అంతే రాజు ఊరుకోలేదు.

రోజుకో సినిమాకు నడిపించుకుపోయి నడిపించుకు వస్తున్నాడు.

పార్కుకు పోక తీరదు.

బజారులో నడవక తప్పదు.

ఎవరైనా రమ కడుపు వైపు చూస్తూంటే రాజు ఎవరికీ కనబడకుండా కాలరు ఎగరేసుకొనేవాడు.

కాఫీ తెమ్మనేవాడు. మెట్లెక్కి దిగమనే వాడు.

ఎక్సర్‌సైజ్ కావాలనే వాడు.

"ఇదేం పీడరా తండ్రోయ్" అని రమ బెదిరింది.

దేశంలో అన్ని పుణ్య స్థలాలు, తీర్థాలు మళ్ళీ చూచే పనిలేకుండా చూచి నిశ్చితంగా రమ అత్త మామలు, అమ్మా నాన్నలు వచ్చారు.

రావటం రావటం తోనే విన్న వార్త, చూసిన దృశ్యం వాళ్ళను ఆశ్చర్యంలో ముంచాయి.

"ఎంత పని జరిగింది?" అని బాధ పడ్డారు. ఆనందం పొందారు.

వాళ్ళకు తోడు తాము లేకపోయినందుకు కృంగి పోయారు.

ఇప్పుడైనా వచ్చినందుకు సంతోషించారు.

ఇదంతా తాము లేకపోవటం వల్లే జరిగింది.

మగవాళ్ళు మీసాలు తిప్పారు. ఆడవాళ్ళు పైటలు సర్దు కొన్నారు

రమ ఏడ్చింది.

అది ఆనందం, దుఃఖం, సంతోషం, బాధ.

రాజుకు చేతకాని పరిరక్షకుడి ఉద్యోగం ఊడి పోయింది.

ఈ నలుగురూ ఆ ఉద్యోగం చేపట్టారు.

రమ నవ్వింది బాధగా, ఆనందంగా!

రాజును వీళ్ళు దగ్గరకు రానివ్వటం లేదు.

అసలు రాజే పోవటం లేదు.

నిజానికి రమే చేరనివ్వటం లేదు.

రమ దేవతైపోయింది. పువ్వుల్లో పెట్టి పూజించుకొంటున్నారు.

డాక్టర్లకేం పనీపాటా లేనట్లుంది. వీళ్ళ ఇంటి దగ్గరే ఎక్కువగా కనిపించే వాళ్ళు!

ఉన్నట్టుండి ఒక రోజు రమని నర్సింగ్ హోమ్‌లో చేర్చారు.

రమేమో నవ్వుతూనే ఉంది. మిగతా వాళ్ళు కళ్ళ నీళ్ళతో వున్నారు.

అందరూ ధైర్యం చెపుతూ ఉన్నప్పుడు రమ ఏడుస్తూ ఉంది.

కానుపు అంత తొందర్లో కాదు.

కానీ ఎన్ని పరీక్షలు.

మొత్తం మీద ఏదో గొడవగానే ఉంది.

ఎక్స్‌రే తీశారు.

రక్తం పరీక్షించారు.

మందులు వాడారు.

ఇంజక్షన్లు ఇచ్చారు. నర్సింగ్ హోమ్ హడావిడిగా ఉంది.

రమకు నొప్పులు ప్రారంభమయ్యాయి.

అంత సుకుమారంగా ఉండే రమ, నడిచినా ధ్వని కాని, మాట్లాడినా శబ్దం కాని ఉండని రమ గొడ్డులా అరుస్తూ ఉంది.

రాజు కళ్ళల్లో నీళ్ళు కళ్ళల్లోనే ఉంటే గుడ్లురిమి చూస్తాడేమోనని వారి పోయాయి.

వాళ్ళునలుగురూ కళ్ళొత్తు కుంటున్నారు.

నొప్పులు ఎక్కువ కావటంతో రమను థియేటర్‌లోనికి తీసుకు పోయారు.

కాన్పుల గదిలో రమను చూస్తుంటే రాజు గుండె చెరువు అవుతూంది.

అతణ్ణిక్కడుండ కుండా నర్సులేకాదు అత్తమామలు కూడా తరిమేశారు.

రాజు అశక్తుడై బయట బల్లమీద కూర్చొని ఉన్నాడు.

డాక్టరు వచ్చిచెప్పింది.

'కాన్పు కష్టం'

రాజు కుంగి పోయాడు.

'ఆమెనెలా అయినా బ్రతికించండి' అర్థించాడు.

"ఈ కాన్పుసరే కానీ మరోకాన్పు అయితే ప్రాణానికే ప్రమాదం."

డాక్టరు చెప్పింది.

ఐదుగురూ కూడ బలుక్కొని చెప్పారు.

"తల్లినీ, బిడ్డనూ రక్షించండి, మరొక కాన్పు లేకపోయినా చింతలేదు. లేకుండా చేసినా సంతోషమే"

కష్టపు కాన్పు.

అంత బాధలోనూ రమ ఆలోచిస్తూవుంది.

వాళ్ళంతా పిల్లల్లేరని చంపుకుతిన్నారు.

పిల్లలు పుట్టబోతుంటే పుట్టక పోయినా ఫర్వాలేదని సర్దుకొంటున్నారు.

ప్రేమ పంచి ఇచ్చిన వాళ్ళే ప్రేమకోసం ప్రేమను బంధించారు.

ప్రేమలభిస్తుంటే తమ హృదయం దూరం చేసుకోక దుఃఖిస్తున్నారు.

సృష్టి ఎంత విచిత్రం.

ఇది అర్థమౌతుందా ?

సృష్టికి అర్థం ఉందా ?

రమ పెద్దగా అరిచింది.

అప్పుడే పుట్టిన పసిగుడ్డు నోరు విప్పి పెద్దగా అరిచింది.

రాజు కూర్చోలేకుండా ఉన్నాడు. ఆనందం పట్టలేకుండా అయిపోయాడు.

ఇద్దరు నాన్నలు, ఇద్దరు అమ్మలు వరండాను పాలిస్తున్నారు.

థియేటర్‌లోంచి ఎవరూ బైటికి రాలేదు.

రమ మూలుగుతూ వుంది.

బిడ్డ అరుస్తూనే వుంది.

రమ మళ్ళీ అరుస్తూంది.

బైట అందరికీ బాధ.

థియేటర్‌లోంచి ఎవరూ బైటికి రాలేదు.

ఏమైందీ తెలియటం లేదు.

రమ ఉన్నట్టుండి పెద్దగా భయంకరంగా అరిచింది.

మళ్ళీ ఏమిటీ గొంతు ?

ఈ ఐదుగురికి ఏమీ అంతుపట్టలేదు.

థియేటర్ లోంచి నర్స్ బైటికొచ్చింది.

'రమకు సుఖ ప్రసవం, కవల పిల్లలు. మగ పిల్లలు?' అన్జెప్పి రక్కున లోపలికి పోయింది.

ఆమె చెప్పిందేమిటో ఎవరికీ అర్థం కాలేదు.

అర్థమైం తర్వాత రాజు ఎటు పోయాడో కనిపించలేదు.

మగవాళ్ళిద్దరూ ఆ వరండా అంతా తమ సామ్రాజ్యమే అయినట్లు చేయీ చేయీ పట్టుకొని నడుస్తున్నారు.

ఆపరేషన్ థియేటర్‌లోంచి రమను స్ట్రెచర్ మీద వెలుపలికి తీసుకొస్తున్నప్పుడు రాజు ప్రక్కనే ఉన్నాడు.

"రమకింక పిల్లలు పుట్టరు" ఎవరికీ చింతలేదు.

ఇద్దరు తల్లులు ఇద్దరు మనువళ్ళను ఎత్తుకొని ఓపికగా ఆడిస్తున్నారు.

రమా రాజులు వాళ్ళవైపు సంతోషంగా చూస్తున్నారు.

వాళ్ళకింకేం కావాలి?

# చిన్ని

చిన్ని చిన్నది. పద్దానుగేళ్ళుండవచ్చు. కొందరు పాతికేళ్ళు వచ్చినా అంత వయస్సు ఉన్నట్లు అనిపించరు. కొంతమంది పదిహేనేళ్ళకే పాతికేళ్ళ వాళ్ళలాగా కనిపిస్తారు కారణం పెద్దగా ఏమీ ఉండనక్కరలేదు. వాళ్ళ శరీర తత్త్వాలు వాళ్ళవి

చిన్ని చిన్నదే అయినా పెద్దదాని లాగా కనిపిస్తుంది. వయసుకు మించిన శరీరం. ఆకస్మాత్తుగా చూస్తే, బట్టలవల్ల, పసిదే అనిపిస్తుంది కానీ పరకాయించి చూస్తే, పెద్దదే అనిపిస్తుంది.

చిన్ని వేసుకొన్న లంగా జాకెట్టు ఈనాటివి కావు. ఇక్ష్వాకుల కాలం నాటివి. పడిపోయిన కోట గోడల్ని చూచినట్లే ఉంటుంది. కనీసం చిన్ని మరీ చిన్నదిగా ఉన్నప్పుడయినా కుట్టించి ఉండాలి. లేదంటే చిన్నికంటే మరీ చిన్న పిల్లలవి దానం చేసి అయినా ఉండాలి.

చిన్నికి అమ్మానాన్నా ఇచ్చారో, ఆ దేవుడే ఇచ్చాడో కాని మంచి కను ముక్కు తీరు. చూడ ముచ్చటయిన ముఖం. కళ్ళలో గమ్మత్తయిన కాంతి ఉంది. జుత్తురేగి ఉన్నా బాగానే ఉంటుంది. చెమట పట్టి ఉన్నా చక్కగా ఉంటుంది. ఎప్పుడు చూచినా మళ్ళీ చూడ బుద్ధి పుడుతుంది. అంత చక్కని ముఖం.

పేచీ అంతా బట్టలతోనే వచ్చింది. చిన్నికి మొత్తం రెండు లంగాలు, రెండు జాకెట్లు ఉన్నాయి. వాటిని మార్చిమార్చి వేసుకొంటుంది. అయినా అన్నీ ఒకేవిధంగా ఉంటున్నాయి. ఏవీ సరిగ్గా సరిపోవటంలేదు. బిర్రు అయిపోయాయి.

చిన్ని శరీరం ఒక సంవత్సరం నుంచి వ్యాకోచించటం మొదలయింది. అంతకుముందు ఈ బట్టలే బాగా వంటికి సరిపోయాయి. అతికినట్లుండేవి. ఈ మధ్యే, ఇవీ మరీ చాలకుండా అయిపోయాయి. చేతి పిక్కల దగ్గర జాకెట్టు తుపాకీ దెబ్బకు చీలిపోయిన కాగితంలాగా చిరిగిపోయింది. దానికి అతుకులూ పనిచేయటం

లేదు. కుట్టు ఉపయోగంలేదు. మళ్ళీ చిరిగిపోతుంది. నిజానికి ఆ లంగా జాకెట్లలో మొదటి బట్టకంటే తరవాత చేరిన మాసికలే ఎక్కువ. మాసికలు బాగున్నాయి. అసలు బట్టే అంతంత మాత్రంగా ఉంది.

తోమిన పాత్రలన్ని దొడ్డిలోంచి ఇంటి గడపలోకి చేర్చి నిలబడితే జాకెట్టు పటపట మంటుంది. చిర్రుబుర్రు మంటుంది. చిరుగుతుంది, చిట్లుతుంది. లంగా అయినా అంతే ! జాకెట్టు అయినా అంతే ! కూర్చుంటే నేరం. నిలబడితే తప్పు. వంగుంటే ప్రమాదం. నడిస్తే దేశ ద్రోహం. చిరిగి ఊరుకొంటున్నాయి.

చిన్నికి ఓ చిన్న సత్యం తెలియక పోలేదు. నెమ్మదిగా కదిలినా, ఒద్దికగా ఒదిగినా, బట్టలు చిరగవు. పరపరలాడవు. పెరపెరలాడవు. అందుకని జాడించి నడువదు. కాళ్ళూ చేతులూ ఇష్టం వచ్చినట్లు ఆడించదు చీమలు చచ్చిపోతాయేమో అన్నంత భద్రంగా కదులుతుంది, కూర్చుంటుంది, లేస్తుంది.

అయినా దేవుడు లంగా జాకెట్టుల ఆయుష్షు హరించాడో ఏమో, మాట్లాడితే పోతామంటున్నాయి. పిలిస్తే ఏడుస్తున్నాయి. తలిస్తే కయ్యిమంటున్నాయి.

నడిచేటప్పుడు నిటారుగా నిలబడి నడిస్తే చికాకుగా ఉండటంతో వంగి, మునగర దీసుకొని, తల గుండెల్లో దాచుకొని, చేతులు కాళ్ళు అవసరాన్ని మించి కదపకుండా, నడిచినట్లు కాకుండా దొర్లినట్లుగా వస్తూ పోతూ ఉంది చిన్ని.

చిన్ని సమస్య రోజు రోజుకూ పెరిగిపోతూ ఉంది. బట్టలు చిరిగిపోవాలని నిర్ణయించుకొని కఠోర నియమం పాటిస్తూ నిరాహారదీక్ష కొనసాగిస్తున్నాయి. ఈ బట్టలెలా చిరగవో చూస్తామని శరీరం అన్ని వైపులా నుంచి దండయాత్ర చేస్తూ ఉంది. ఈ సంఘర్షణ నుంచి తప్పుకోవాలని చిన్ని చిన్ని మనస్సు గట్టిగా పెద్దగా కోరుకొంటూ ఉంది. కానీ ఏం ప్రయోజనం? చిన్ని కోరిక చిన్నదే అయినా తీరటంలేదు. తీరక అది కొండంత సమస్య అయి కూర్చుంది.

చిన్ని నాన్న రిక్షా తొక్కుతాడు. తల్లి పాచి పని చేస్తుంది. పది మంది పిల్లలు. చిన్ని చిన్నప్పుడు చిన్నదే కాని ఇప్పుడు పెద్దది. పదె మందిలో పెద్దది

చిన్నికి శరీరం మీద బట్టలయినా ఉన్నాయి. చిన్నవాళ్ళకు అవి కూడా లేవు. గోచీ గొంగడీ లేకుండా పరమేశ్వరుల్లా వాళ్ళు తిరుగుతూ వుంటే చిన్నికి సిగ్గుగా ఉంటుంది కాని, వాళ్ళకేం లెక్కా పత్రం లేకుండా ఉంటుంది.

తనకు ఈ మాత్రం బట్టలయినా ఉన్నాయని ఆనందించాలో, వాళ్ళకు లేవని దుఃఖించాలో చిన్నికి తెలియదు.

తను పనిచేసే ఇళ్ళల్లో ఒక యింట్లో పాప అచ్చంగా తనంతే ఉంటుంది. ఎంత ఎగురుతూ దూకుతూ పడుతూ లేస్తూ ఉంటుందని. తనకూ అలాగే ఉండా లని ఉంటుంది. కానీ బట్టలు ఒప్పుకోవు. మాట్లాడితే నవ్వుతాయి. లేదంటే ఏడు స్తాయి. కానీ శబ్దం చేయకుండా మాత్రం ఉండవు.

నెమ్మదిగా పనిచేస్తున్నట్లు కనిపించి, ఇంటి యజమాను రాళ్ళు కోపగించు కోవటం లేకపోలేదు. 'ఏమిటా వయ్యారం, తొందరగా అడుగేయ్' అనటం వింది. 'ఏం పోకిళ్ళు పోతున్నావే గబగబా నడువ్' అనటం వింది. 'ఏం వళ్ళు కొవ్వెక్కిందా? ఏమిటా నడక' అనటమూ వింది. 'ఏమిటా మహారాణి చమత్కా రాలు చూచిరా' అనటాన్నీ వింది. 'ఏం వళ్ళు చిమచిమ లాడుతా వుందా? తొంద రగా తగలడు' అన్నవాళ్ళూ ఉన్నారు. వాళ్ళంతా ఆడవాళ్ళే! తన లాంటి బిడ్డలు వాళ్ళకూ ఉన్నారు. తన ఇబ్బంది ఏమిటో వాళ్ళకు తెలియటం లేదో, తెలిసినా పట్టించుకోవటం లేదో, పట్టించుకొనే అవసరం అవకాశం లేవో ఏమోకాని తన సమస్య ఎవరికీ అర్థం కాలేదు. తన గోల ఎవరికీ అంతు పట్టటం లేదు. తిడుతూ కూడా చిన్ని పనిచేసే ఇళ్ళ ఆడవాళ్ళు ఆ అమ్మాయిలో పరిణామం గుర్తించపోలేదు. చిన్ని శరీరంలోకి వయ్యారాలు రావటం, పోకిళ్ళు చేరటం, కొవ్వెక్కటం, మహారాణి చమత్కారాలు చోటుచేసుకోవటం, చిమచిమలాడటం - అనుభవం ఉన్నవాళ్ళందరూ అర్థం చేసుకోగలిగారు. ఈ విషయాలు చిన్ని ఎక్కడ గుర్తించకుండా పోతుందోనని వాళ్ళు తిడుతూకూడా గుర్తు చేస్తున్నారు. రోజు ఇదే తంతు! చిన్నికి అవి తిట్లుగా అనిపించటం లేదు. రామ్మా, పోమ్మా అన్నంత మామూలు మాటలు అయిపోయాయి. తిట్టినకొద్దీ, చీమ నడకలు నత్త నడకలు నడుస్తుంటే వాళ్ళకు మరింత తిక్కరేగేది. వాళ్ళు తిడుతున్నారని చిన్నికి తెలుసు ఉప్పూ కారం తింటున్న వళ్ళే కదా రోషం కూడా ఉంది. కానీ ఏం

లాభం? కదిలితే పర్రు మెదిలితే బిర్రు! అందుకే ఈ కదలిక. కాలం గడిచిన కొద్దీ శరీరం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో వికసిస్తుంటే, వ్యాకోచిస్తుంటే బట్టలు ముడుచుకొంటూ, సంకోచిస్తూ ఉన్నాయి. అందుకే చైతన్య పదార్థమయిన చిన్ని శరీరం చిన్నిని స్థాణువులా మారుస్తూ ఉంది. నెమ్మదిగా ఉండటమే కాదు, కదల కుండా ఉండటం నేర్పుతూ ఉంది. తనను తాను కట్టి పడేసుకొన్నట్లు చేసుకొంటూ ఉంది. ఎవరూ అర్థం చేసుకోవటానికి ప్రయత్నించటం లేదని చిన్ని దిగులు. చెప్పుకోలేదు. చెప్పనలవిగాని సిగ్గు. ఎవరూ గుర్తించరు. ఎవరి తొందరలు వాళ్ళవి. చెప్పుకోలేక, దాచుకోలేక అవస్థపడుతున్న చిన్ని, సామాన్యులకు అర్థం కాని బంధ. పని చేసే ఇళ్ళలోని మగవాళ్ళు చిన్నిని చూచి, ఒకసారి చూచి, మరో సారి చూచి వెళ్ళటం చిన్ని గమనించింది. చిన్నిని ఇంటి మగవాళ్ళు ఇష్టం వచ్చి నట్లు చూస్తున్నారని ఆడవాళ్ళుగుర్తింటమూ చిన్ని తెలుసుకొంటూ ఉంది ఈ సందర్భాలలో చిన్ని మరీ కుంచించుకు పోవటం చిన్నికి మాత్రమే తెలుసు. తొందరగా తగలబడమని తిట్టటం మాత్రమే ఆడవాళ్ళకు తెలుసు.

యజమాని కూతురు తన ఈడుపాప వేసుకొనే లంగా జాకెట్టు ఓణీ చిన్నికి కావాలని పించింది. బాగుంటాయనిపించింది. ఇస్తే అనుకొంది. వాటిని అదేపనిగా చూడటం ఇష్టంగా కూడా ఉండేది. అట్లాచూడటం ఆ పాపకూడా గమనించింది. 'నాబట్టలు బాగున్నాయా?'అని అడిగింది. అవునని చిన్ని జవాబు చెప్పింది కూడా ఒకరోజు నీ పాతబట్టలుంటే నా కిమ్మని చిన్ని నోరుతెరిచి మొదటి సారిగా, జీవితంలో మొట్టమొదటి సారిగా అడిగింది. ఇస్తే సంతోషించేది. ఇవ్వకపోతే మామూలుగా ఉండేది. ఇచ్చి తిట్టినా సంతోషించేది. ఇవ్వకుండా తిట్టింది. 'నా బట్టలమీద పడ్డాయా నీ చూపులు దొంగ ముండా' అంది. అందుకు ఏడ్చింది చిన్ని. తాను దొంగా కాదు. ముండా కాదు అనుకొంది. అసలు పెళ్ళేకానిదే ముండ ఎలా అవుతుంది అనుకొంది. తాను దొంగముండా అంటే ఆ అమ్మాయి ఊరుకుంటుందా? ఓర్చుకొంటుందా? చిన్ని ఆలోచింప సాగించి. అసలు తాను వాళ్ళఇంట్లో ఎందుకు పాచిపని, పాత్రలుతోమి, కడిగి, తుడిచి పెట్టేపని చేస్తుంది, ఆ అమ్మాయి తమ ఇంట్లో పనిచేస్తే ఎలాఉంటుందో, తనెంత ఔదార్యంతో లంగాలు, జాకెట్టులు, ఓణీలు ఇస్తుందో. చిన్ని ఆలోచించుకోసాగింది.

ఆరోజు రాత్రంతా చిన్నికి కంటిమీద కునుకులేదు. కప్పుమీద, వాసాల మీద చూపు నిలిపింది. చీకట్లో ఏమీ కనిపించలేదు. కానీ చిన్ని చాలా చూడటం మొదలయ్యింది.

ఉదయం నిద్రలేస్తూనే నాన్న చాపమీద పక్కగా అతడి తలగుడ్డ చూచింది. రిక్షా తొక్కేటప్పుడు ఎండ తగలకుండా ఆ గుడ్డ తలకు చుట్టు కొంటాడు. అది తీసుకొంది. విప్పింది. పొడుగు చూచింది.

తన తండ్రి రిక్షా తోలితే వచ్చే డబ్బు తక్కువేంకాదు. వచ్చేది ఎక్కువే కాని, ఇంటికి తెచ్చేది, ఇంట్లో ఇచ్చేదీ తక్కువ. తండ్రి తాగటం తప్పనికూడా చిన్ని అనుకోదు. కష్టపడేవాడు తాగి తీరాలని చిన్నికో చిన్న విశ్వాసం.

ఇన్ని నోళ్ళు తినాలి. తండ్రి సంపాదన అంతంత మాత్రం. అమ్మతో కలిసి ముగ్గురు పాచి పనులు చేస్తున్నారు. ఆ యిళ్ళలో చద్ది ఉంటే పెడతారు. పిల్లలు పొద్దున్నే తినటానికింత రోజూ దొరుకుతూనే ఉంటుంది కానీ, ఎవరు మాత్రం వండి, వార్చి, పారేసుకోవటానికి సిద్ధంగా ఉన్నారు బియ్యం ధర మండిపోతూ ఉంది. వాళ్ళూ నెల జీతగాళ్ళు. వచ్చిన దాన్ని అన్నిటికీ సర్దు కోవాలి. అందుకోసం రైతులిళ్ళలో లాగా ఉద్యోగుల ఇళ్ళలో చద్ది దొరకదు. అడుగూ బొడుగూ ఉంటే ఇంత పుల్లినీళ్ళు తాగుతున్నారు కానీ కడుపు నిండడం లేదు.

తండ్రి తిండే పెట్టలేకుండా ఉన్నాడు. ఒక్క రోజు బాగా తింటే నెల రోజులు పస్తుగా ఉంది పని. నలుగురూ కష్టపడుతుంటేనే నోటికీ, చేతికీ అందటం లేదు. చేతి కెక్కి వచ్చిన మగ పిల్లలు రాలుగాయల్లా తిరుగుతున్నారు పనీపాటా లేదు. ఇంటిపట్టున ఉండరు. ఏమన్నా పని చేయండ్రా అంటే ఇంటికే రారు. వెదికి తెచ్చుకోవటం ఒక పని అయి కూర్చుంటుంది.

తండ్రి తలగుడ్డ ఓణీగా వేసుకొంది చిన్ని. చుట్టూ చూచుకొంది. బొడ్లో దోపిన కొంగు ఊడుతుంటే మళ్ళీ నెట్టింది. బట్టంతా లోనికి పోతుంటే కొంచెం పీకింది. పైపై భుజం మీద చాలక, నిలవక పోతుంటే, కొంచెం లాగి, కొంచెం వదులుచేసి వేసుకొంది. తనను తాను చూచి నవ్వుకొంది. గాలిలో తేలినట్లుంది.

ఓణీ వేసుకొంటే నడక వేగం పెరిగింది. పొద్దున్నే - చాలా ముందుగా - పాచి పని ప్రారంభించింది.

ఈ ఆనందం ఎంతోసేపు నిలవలేదు. యజమానురాలు వచ్చి 'మీ నాన్న పిలుస్తున్నాడు' అంటే వెళ్ళింది. 'నాకు తలగుడ్డ లేదే' అన్నాడు. 'నువ్వు తెచ్చావా' అన్నాడు. చూస్తూనే ఉన్నాడు. 'ఊ' అంది. తల వంచుకొంది. తండ్రి వెళ్ళలేదు 'నా కింకొకటి లేదు' అన్నాడు. 'ఇది కావాలా?' అంది. 'నీకో?' అన్నాడు. 'నీకు ఓణీ బాగుంది' అన్నాడు. 'కావాలా?' అంది. 'మరినీకో' అన్నాడు. 'నా కొద్దులే' అంది 'ఉంచుకో' అన్నాడు. అన్నాడు కానీ వెళ్ళలేదు. 'తీసుకో' అంది కానీ ఇవ్వలేదు. ఎవరూ కదల్లేదు. పొద్దున్నే ఎండ మొదలయింది. వొళ్ళు చిటపటలాడుతూ ఉంది. చిన్ని ఓణీ తీసి తండ్రికిచ్చింది. ఏమీ మాట్లాడలేదు. తండ్రి తల గుడ్డ తీసుకొన్నాడు. ఏమీ మాట్లాడలేదు. చిన్ని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఏడుస్తూ తుడిచి వెళ్ళిపోతున్నాడు. తండ్రి కళ్ళు తుడిచింది. వెళుతున్న తండ్రిని చూచింది. తల గుడ్డతో కళ్ళుతుడుచు కొంటున్నాడు. లంగాతో కళ్ళు అద్దుకొంది చిన్ని.

ఇది యజమానురాలు చూచింది. చిరిగిపోయిన చీరె ముక్క తెచ్చి ఇచ్చింది. 'వేసుకో' అంది. ముక్క కొన బొడ్లో చెక్కింది. భుజం మీద సవరించింది. చిన్ని యజమానురాలి ముఖంలోకి చూచింది. అమ్మ కనబడుతూ ఉంది. అమ్మ చూపు ఉంది. 'అమ్మా' అంది చిన్ని. కాళ్ళ మీద పడింది. లేవనెత్తుతున్న చేతుల్లో అమ్మ చేతులున్నాయి. అంత బలం, అమ్మ చేతులకులేదు. కానీ, అంత ప్రాణం ఉంది.

ఆ రోజు ఇంటికి వెళుతున్నప్పుడు ఇంటివాళ్ళ అబ్బాయి కాలేజీలో చదువు కొంటున్నవాడు. 'చిన్నీ' అని పిలిచాడు. 'ఏం?' అంది 'ఇటురా' అన్నాడు. 'ఎందుకూ' అంది. 'చెబుతాగా' అన్నాడు. 'చెప్పు' అంది. 'నీకు ఓణీ కావాలా?' అన్నాడు చిన్ని అవుననలేదు. 'లంగా కావాలా' అన్నాడు. చిన్ని మాట్లాడలేదు. 'జాకెట్టు కావాలా' అన్నాడు. ఊ అనలేదు. 'కొత్తవి' అన్నాడు. తలెత్తిచూచింది. 'సిల్కువి'. చూస్తూ ఉంది. 'కుట్టినవి'. ముఖంలోనే ఉన్నాయి చూపులు. 'రేపు తెస్తా'. నేల చూపులు చూస్తూ ఉంది. వాళ్ళ అమ్మ అటు రావటం చూచి వెళ్ళి పోయాడు. చిన్ని ఇంటికి పోయింది.

తోవలో ఆ రోజు చాలామందిని చూచింది చిన్ని. చీరెముక్క ఓణీ ఉంది కదా! తలెత్తి నడుస్తూ ఉంది. అందువల్ల చుట్టూ చూసింది. సినీమాకు వెళుతున్న జంటలు చాలామంది కనిపించారు. భర్తవెంట ఉన్న భార్యకు అందం అధికమవు తుంది అనుకొంది చిన్ని. అందువల్ల భర్త ఉన్న భార్యలు చాలా ఇష్టమయ్యారు. వాళ్ళబట్టలు బాగున్నాయి. పెళ్ళయితే చీరెలు వస్తాయి. కావాలనుకొంటే ఓణీలు వేసుకోవచ్చు కూడా. చీరె, జాకెట్టు, చెప్పులు, గాజులు, బొట్టుదాకా అన్నీ ఒకే రంగువి చిన్నికి ఆశ్చర్యం కలిగించాయి. అసలు బట్టలుంటేనే గొప్ప. కొత్త వయితే మరీ గొప్ప. విలువయినవయితే ఇంకా గొప్ప-ఒకే రంగువైతే-ఓ యబ్బో చెప్పటానికి సాధ్యం కాదు.

తోవలో స్త్రీలు నడుస్తుంటే పూలు నడుస్తున్నట్లుంది. సీతాకోకచిలుకలు కదిలినట్లుంది. పట్టణం ఉద్యానవనం లాగా పరిమళంతో. రంగులతో విచిత్రంగా ఉంది. చిన్ని తనకొక భర్త అనుకోవటానికి ధైర్యం చాలటంలేదు. సొంత లంగా లేని తాను సొంత భర్త అనుకోవటం సాధ్యం కానట్లు అనిపించింది. కానీ పెళ్ళి, భర్త, బట్టలు, తలుచుకొటుంటే పాచిపని చేసే ఇంటిలోని అబ్బాయి గుర్తుకు రాసాగాడు.

నాన్న ఎప్పుడన్నా ఒకరోజు చీరె తెచ్చి అమ్మకు ఇవ్వటం చిన్ని చూడక పోలేదు. ఆ రోజు పూలు కూడా తెచ్చేవాడు. తలలో కూడా పెట్టేవాడు. సుతా రంగా నవ్వేవాడు. ఆ నవ్వు చిన్నికెంతో ఇష్టం 'ఎవరయినా తన తలలో పూలు పెట్టటం' సుతారంగా నవ్వటం ఇష్టమే! ఎవరు? అనుకొంటుంటే ఆ అబ్బాయి గుర్తుకు రాసాగాడు.

ఆ రోజు రాత్రి చిన్నికు నిద్రపట్టలేదు. దిక్కులు చూస్తూ ఉంది. చెల్లెళ్ళు దిక్కుకొకరు చెదిరి నిద్రపోతున్నారు. అమ్మానాన్నా అవతల పక్కకు పడు కొన్నారు. అందరూ ఒకచోటే. అమ్మ చీరెకూడా చిరిగింది. మాసికలు ఎక్కు వయ్యాయి. తండ్రి అటూ ఇటూ దొర్లుతూ నిద్ర పోతున్నాడు. ఎప్పుడయినా అమ్మమీద చేయి వేస్తున్నాడు. నిద్దట్లోనే అమ్మ ఆ చేయి తీసి పక్కకు పెడుతూ ఉంది. చిన్నికి నిద్ర రావటం లేదు. బుద్ధి వెలుతురు మసకగా ఉంది. కాని సూర్యుడు గుడిసెలో ఉన్నట్లే అంతా కనబడుతూ ఉంది.

భర్తే భార్యకు బట్టలిస్తాడు. బట్టలిస్తే భర్తే! తీసుకొంటే భార్యే! చిన్ని ఆలోచింపసాగింది. అబ్బాయి గుర్తుకు వస్తున్నాడు.

చిన్ని ఉదయమే పాచిపనికి పోయింది. అబ్బాయి ఎదురుగా వచ్చాడు. ఇంట్లో ఎవరూ లేవలేదు. 'చిన్నీ' అన్నాడు. 'ఊఁ' అంది. 'బట్టలు తెచ్చా.' 'ఊఁ' అంది. 'ఆదె సరిపోతుంది'. 'ఊఁ' అంది. ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

'బట్టలిస్తే భర్తే!' అంది. 'ఆఁ' అన్నాడు. 'పుచ్చుకొంటే భార్యే' అంది. అబ్బాయి నవ్వాడు. 'అదేం లేదు' అన్నాడు. 'ఊరికే - ఉత్తినే - ఉత్తుత్తినే' అన్నాడు. చిన్ని దిక్కులు చూసింది. దిక్కు తెలియలేదు. 'ఇంటికి పోయే టప్పుడు తీసుకుపో. ఎవరూ చూడకుండా.' చిన్ని మాట్లాడలేదు.

ఆ రోజంతా ఏమీ పనిచేయ బుద్ధి పుట్టలేదు. ఏడుపు వచ్చినట్లుంది. భయంగా ఉంది. బద్ధకంగా ఉంది. పరధ్యానంగా ఉంది. అబ్బాయిమీద కోపం. బట్టలమీద ఆశ.

చిన్ని ఇంటికి వెళుతున్నప్పుడు అబ్బాయి చెట్టుచాటుకు పిలిచాడు. అక్కడ ఎవరూ లేరు. చుట్టూ చూసింది. అబ్బాయి చేతిలో కాగితం సంచి ఉంది. అందులో బట్టలు ఉండి ఉంటాయి.

చిన్నికి భయంగా ఉంది. బెదురుగా ఉంది. కాళ్ళు ఆడటం లేదు. పోదాం అనుకొంటుంది. వద్దు అనుకొంటుంది. దిక్కులు చూస్తూ ఉంది. అబ్బాయి పిలుస్తున్నాడు సంచిచూపించాడు. సంకోచంగా వెళ్ళింది చిన్ని.

ఎక్కడా ఎవరూలేరు. సంచి చేతికిచ్చాడు. ఏమున్నాయో చూద్దామని చిన్ని తాపత్రయం. భుజంమీద చెయ్యివేశాడు. చేయిచూసింది. ముఖంచూసింది. సంచిచూడబోయింది. రెండో భుజంమీద రెండోచేయి వేశాడు చేయిచూసింది. చేతులు చూసింది. ముఖం చూసింది సంచిచూడ బోయింది. వంట్లో నెత్తురు చల్లబడు తున్నట్లు అనిపించింది. కంఠం మీద మంచు గడ్డ పడ్డట్టు ఉంది. సంచి చూడ లేదు. మెడ చూసుకొంది. వెనక్కు జరిగింది. మెడ విదిలించింది. చేతులు జారిపోయాయి. సంచి చూసింది. జాకెట్టు పిట్లుతున్నట్లనిపించింది. సంచిలోపల చూడలేదు. 'ఇదిగో' అంది. సంచి ఇస్తూ ఉంది. అబ్బాయి తీసుకోలేదు. 'ఒక్కసారి' అన్నాడు. 'ఇదిగో' అంది. సంచిని చిన్ని

వదిలేసింది. అబ్బాయి పుచ్చుకోలేదు. కిందపడింది. ఎవరూ తీయలేదు. చిన్ని వెనక్కు నడిచింది. 'మాట' అన్నాడు. చిన్ని వినలేదు. వినిపించుకోలేదు. వెనుతిరిగింది. వరండా దాటి వెళ్ళిపోయింది.

కిందపడ్డ బట్టల సంచిని పైకి తీస్తున్నప్పుడు వెనుక నుంచి తల్లి వచ్చి సంచి అందుకొంది.

ఆ రాత్రి ఇంట్లో పడుకొన్న చిన్నికి నిద్రరాలేదు. కళ్ళు మూతలు పడలేదు.

పైకి చూస్తూ ఉంది. కప్పుదాటి పోయింది చూపు. శూన్యంలో నిలిచింది-దృష్టి.

ఈ బట్టలెందుకు? చిన్ని చిన్నతలలో సూర్యుడే ఉదయించాడు.

ఈ శరీరమెందుకు? చిన్ని ఆలోచిస్తూ ఉంది.

ఉదయమే పాచి పనులకు బయలుదేరింది. చాలా తొందరగా పనులన్నీ ముగించుకొంది.

ఇష్టం వచ్చినట్లు కూర్చుంది. ఇష్టం వచ్చినట్లు లేచింది. నడచింది. పరుగెత్తింది. పడింది, లేచింది, చేతులు కాళ్ళు కదిపింది. కుదిపింది. ఇష్టా్యరాజ్యంగా ఆడించింది. బట్టలు చిరుగుతున్నాయి. లెక్కలేదు.

చిరుగుల్లో శరీరం కనబడుతూ ఉంది. లెక్కలేదు, సంకోచంలేదు, బిడియంలేదు.

నలుగురూ చూస్తున్నారు. లెక్కలేదు, ఏమాత్రం భయంలేదు. చిన్ని తలెత్తుకొంది తలెత్తుకొని నడుస్తూఉంది.

చిరిగిన బట్టలోంచి శరీరం కనిపిస్తున్నా, ఏమాత్రం లెక్కాపత్రం లేకుండా రలాయించి, కాళ్ళు చాచి, రెక్కలు విదిలించి నడుస్తూఉంది.

చూడలేక, చూస్తూ ఉండలేక, చుట్టూ ఉన్నలోకం తలదించు కొంది.

# ఎర్రెని కళ్ళు

డొంకలో నాలుగు తోవలు కలిసేచోట నిలబడి ఎదురుగా ఉన్న బాటమీద చూపు నిలిపి దీక్షగా చూస్తూ ఉన్నాడు చింతడు. చిల్ల కంపముళ్ళు గుచ్చుకొని గాలి అరుస్తూఉంది. గాలి వాలుకు ఫీలుగా దుమ్ముlేచి వెళిపోదామని డొంకను ఊడుస్తూఉంది. గొంగళ్ళో వెంట్రుకలు ఏరినట్లు ఎంత దుమ్ము లేచిపోయినా, కావలసినంత దుమ్ము డొంకలో ఆవులిస్తూ ఉంది. దుమ్ము ఉంగరాలు చుట్టు కొంటూ, గింగిరాలు తిరుగుతూ చింతణ్ణి ఎత్తుకు పోదామని ఎగరేస్తున్నా వాడు కదిలితే ఒట్టు.

సూర్యుడు నడినెత్తిమీద ఉన్న సంగతి చింతడికి తెలియదు. వాడు ఎంతకీ కదలకపోతుంటే సూర్యుడు మండిపడ్డాడు. చెవిటివాడి ముందో, గుడ్డివాడి ముందో అరిసినా దూకినా ప్రయోజనం లేనట్లే చింతడి దగ్గర సూర్యుడి ప్రతాపం పనిచేయ లేదు. చింతడికి కళ్ళున్నాయి. చూపు ఉంది. అమ్మతప్ప అన్యం కనిపించదు. చెవులున్నాయి. వినిపిస్తుంది. కానీ అమ్మ 'కన్నోడా!' అంటేనే వినిపిస్తుంది.

చింతడు చాలా సేపు నిలబడి, ఎందుకో కూర్చున్నాడు. కాని చూపు మాత్రం బళ్ళబాట మీదనేవుంది. దృష్టిమరల లేదు. గంపెడు చీకటి నెత్తిన వేసుకొని ఉదయం అమ్మ ఆబళ్ళబాట మీదే నడిచి పోయింది. ఆమె పొలం పోయిందనీ, పని ముగించుకొని వస్తుందనీ, వస్తూ కూలీ తెస్తుందని, వచ్చి వండిపెడుతుందనీ, చింతడికి తెలియదు.

అమ్మ వెళుతున్నప్పుడు చింతడు ఆవులించాడు. అమ్మ తలనిమిరి వెళ్ళి పోయింది. అన్నదమ్ముల్లేరు. తండ్రిపొరుగూరు పొలం పనులకు పోయాడు. నిద్రపోయినంతసేపు నిద్రపోయి, మెలకువ వచ్చిందగ్గర్నుంచి అమ్మవెళ్ళిన బాట చూస్తూ మెల్లగా నడచివచ్చి కూడలిలో చేరాడు. ఇంట్లోఉన్నా ఒక్కడే! వీధిలో ఉన్నా ఒక్కడే!

చింతడి వయస్సు, నాలుగేళ్ళు. అయిదారేళ్ళవాడు లాగా బొద్దుగా ఉన్నాడు. నల్లటి ఒళ్ళు. గోచీలు గొంగడిలేదు. అఖండమైన నలుపు. అఖండంగా దిగంబరుడు. వాడు కదలకపోతే నల్లరాయి అనుకోవచ్చు. కూర్చున్నాడు కాబట్టి ప్రాణి.

పొద్దున్నే నిద్రలేచి కుండా, చట్టీ, మూకుడూ, ముంతా వెతికాడు అన్నీ నున్నగా కడిగితే శుభ్రమై గోడకానుకొని కూర్చున్నాయి. కుండలో నీళ్ళుంటే తాగాడు. రాత్రి ఏం తిన్నాడో గుర్తులేదు. పొయిలో పిల్లి లేవలేదు. పొంతలో నీళ్ళు వేడి కాలేదు.

చుట్టూ చూశాడు. ఎక్కడా తినటానికి ఏమీలేదు. ఉల్లిపాయా లేదు. చింత పండూ లేదు. అమ్మ వస్తే అన్నం వస్తుంది. ఆకలి తీరుతుంది అమ్మ ఎప్పు డొస్తుందో చూడటానికి, ఇల్లు వదిలి, వీధి వదిలి, డొంకలోకి పొద్దున చేరాడు. మధ్యాహ్నమయినా అక్కణ్ణుంచి కదలలేదు. అమ్మ తప్ప చింతడికి అన్యం కనిపించదు.

ఎందుకు కూర్చున్నాడో కాని, కూర్చున్నచోటు వాడికి తెలియదు, ఎందుకు చూపు మరల్చుకొన్నాడో కాని, నేల చూడటం ప్రారంభించాడు. ఎందుకు చూశాడో కానీ నేల మీద నిమ్మకాయను చూశాడు. అమ్మను చూడాలనుకొంటున్న కళ్ళు నిమ్మకాయను చూచేసరికి చుట్టూ చూశాయి.

చుట్టూ నిమ్మకాయలున్నాయి. ప్రతి నిమ్మకాయ దగ్గరా, ఉప్పూ ఎండు మిరపకాయ కాయలూ, చింతపండూ, వెంట్రుకలూ ఉన్నాయి. వెంట్రుకల పొత్తి ఎర్ర దుమ్ముకు అతుక్కుపోయింది. ఎర్రటి దుమ్ము మీద ఎర్రటి మిరపకాయల మీద పచ్చటి నిమ్మకాయ, నల్లటి వెంట్రుకల పొత్తి మీద చింతపండుముద్ద. పోసిన ఎర్నీళ్ళు మరక తడారిపోయి ఉంది. ఈ మరకలు ఒకటీ అరాకాదు. అయిదారు చుట్టూ వున్నాయి.

పీటిని పెద్దవాళ్ళు చూస్తే తప్పుకు పోతారు. ఏ పరిస్థితుల్లోనూ తొక్కరు. పిల్లల్ని తొక్కనివ్వరు. తాకనివ్వటమే కాదు, చూడనివ్వరు. అని ప్రమాదానికి సూచనగా, ఆపదకు ఆనవాలుగా భావిస్తారు.

దిష్టితీస్తే అట్లా వుంటుంది. చేతబడిచేస్తే అలా ఉండవచ్చు. మంత్ర తంత్రాలు జరిపినా ఈ విధంగా ఉంటుంది. అది ఎవరికో ఉద్దేశిస్తారు. ఎవరో బలవుతారు. దిష్టి తొలగటానికి, ఆరోగ్యం బాగుపడటానికి చేసినా, ఒకరి కీడు మరొకరికి చుట్టుకొంటుందనీ నమ్మకం. చేతబడి, మంత్ర తంత్రాలు మందు జల్లటం, కీడు పూడ్చటం వంటవయినా ప్రమాదమే! నలుగురు తిరిగే చోట పోస్తే, ఎవరో ఒకరు తొక్కితే, తాకితే, ఉద్దేశించిన పని జరుగుతుంది.

పల్లెల్లో కలరా, మశూచి, వచ్చినా, ధూందగిలినా, ఆటలమ్మ, పెద్దమ్మ పోసినా, విషజ్వరాలు వచ్చినా, ఇటువంటి ఎర్నీళ్ళు చూడవచ్చు. ఊరి మొగదల ఉన్న ఈ గుర్తులు ఆపదలకు ఆనవాళ్ళే అయినా ప్రమాదం అని గుర్తుచేసే హెచ్చరికలు కూడా. అయితే ఈ హెచ్చరికలు ఎవరికి తెలుస్తాయి? తెలిసిన వాళ్ళకు! చింతడికి ఏంతెలుసు?

ఎర్నీళ్ళ దిగ్బంధనంలో చిక్కుకుపోయాడు చింతడు. ఆమరకల్ని తొక్కాడో, తొక్కలేదోకాని, తొక్కకుండా వెలుపలికి రాలేడు. ఎవరయినావచ్చి, ఎత్తి, ఇవతలకు లేపుకొని తీసుకువస్తే ఫరవాలేదుకాని, లేకపోతే తొక్కకుండా చింతడు ఇవతలకురాలేడు.

వెలుపలికి వద్దామన్న యోచనకూడా వాడికి ఉన్నట్లూలేదు, వాటిమధ్య ఉండకూడదని తెలిసినట్లూలేదు, అది అపాయమని అర్థమయినట్లూ అనిపించదు.

ఎండే వళ్ళు మండించనివాడిని, గాలి దుమారంకూడా కదల్చలేనివాడిని, ఏమీ తెలియని ఈ నమ్మకాలు ఏం బాగుచేయగలవు? ఎవరైనా వచ్చి, చింతణ్ణి ఎలాగైనా వెలుపలికి తెస్తే బాగుండుననిపించటం ధర్మమేకాని, నడినెత్తి చుర్రుమని, అరికాళ్ళు భగ్గుమనే చింతనిప్పులు చెరుగుతూ, పడమటి శాంబరం తోలుతున్న మధ్యాహ్నం - ఎండాకాలం - ఎవరు బయటికి వస్తారు? ఎవరూరారు. రాలేదు. పనివాళ్ళు రావచ్చు. కూలీవాళ్ళు రావచ్చు. ఎండను మోసుకువచ్చేవాళ్ళు ఈ బండను తీసుకుపోవచ్చు. వాళ్ళు రావాలి. వచ్చేవేళ అయింది. అమ్మకూడా రావచ్చు. వస్తే, చూస్తే, కొడుకు రేపటి బతుకుగూర్చి ఆవురుమని ఏడుస్తుంది.

చింతడికి ఆకలి అవుతూ ఉంది. కడుపులో మంట తెలిసినంత స్పష్టంగా నెత్తి మీద మంట అర్థం కావటంలేదు. జ్వరం వచ్చినవాడి శరీరం మీద చీమపాకి నట్లుంది ఎండ. అమ్మరాలేదు. ఆకలి మండిపోతూ ఉంది. అమ్మరావాలి. ఆకలి తీరాలి.

గాలి తోలుతూ ఉంది. వడగాలి. ఎక్కడో సుడిగాలి రేగింది. ఉంగరాలు తిరుగుతూ, బొంగరాలు ఆడుతూ, ఆకులలములు ఆకాశంలోకి ఎత్తుకుపోతూవస్తూ ఉంది. వీడు లేస్తాడో, కూర్చునే ఉంటాడో అంతు తేల్చుకోటానికి చింతడి మీదికి వచ్చి, ప్రతాపం చూపి, వాడి దెబ్బకు తట్టుకోలేక, వాణ్ణేమీ అనలేక, వచ్చిన తోవనే ఉడాయించింది సుడిగాలి. పోతూ పోతూ రెండు పులిస్తిరాకు ముక్కలు, నాలుగు గడ్డిపరకలు, ఒక కాగితం, ఇంత దుమ్ము, చింతడి ముఖాన కొట్టిపోయింది.

చింతడు దుమ్ము దులుపుకొన్నాడు. గడ్డిగాదం తొలిగించుకొన్నాడు. విస్తరితుంపులు విసిరేశాడు. కాగితం పట్టుకొని కూర్చునే ఉన్నాడు. కళ్ళు తూలి నట్లు అనిపించింది. నిద్రవచ్చినట్లు మగత. ముక్కుపుటాలు చిట్లించి చుట్టూ చూశాడు.

దూరంగా ఎండ కదలిక. నీటిజాడ. ఎండమావి. అమ్మవస్తున్న ఆలోచన. వస్తూ అన్నం తెచ్చినట్లు, కూర తెచ్చినట్లు, వడ్డించినట్లు, అనుభూతి. ఆకలి తీరే జాడ.

చుట్టూ ఏర్చిన్నెళ్ళ మరకలు చెదిరాయి. పెంట్రుకలు లేచి గాలిలో దూర తీరాలకు ప్రయాణమై, పెట్టే బేడా పట్టుకుపోయాయి. నిమ్మకాయలు కదిలాయి, స్థానం తప్పాయి. కాని గాలిలో కలిసిపోలేదు. కొన్ని మిరపకాయలు గల్లంతు అయ్యాయి. ఉప్పు చింతపండు మాత్రం ఎర్ర దుమ్ముకొట్టుకొని అందంగా కొత్త పెళ్ళికూతుళ్ళలాగా విలాసంగా డొంక దుమ్ములో శయనించి చిద్విలాసం వలక బోస్తున్నాయి.

చింతడు చుట్టూ చూశాడు. సుడిగాలి పోయింతరవాత డొంక కడిగిన గచ్చిలాగా, తోమి తుడిచిన పాత్రలాగా, అందంగా మనోహరంగా ఉంది. చిల్ల కంపకు చుట్టుకొన్న చిదర సుడిగాలి దెబ్బకు దిక్కూ దివాణం లేకుండా పారి పోయింది. పరారయింది. ముళ్ళకంప పరమార్థం ప్రసవిస్తూ ఉంది.

చింతడు లేచి నిలబడ్డాడు వాడి చేతిలో కాగితం ఉంది. డబ్బు కాగితం కాదు. ఉత్తి కాగితం. సుడి గాలి లోడపెట్టిన బాపతు మురికి కాగితం, దాన్ని రెండు చేతులతో పట్టుకొని పెద్ద పండితుడులాగా, పురాణం సూరి శాస్త్రుల్లు మాదిరిగా, పంచాంగ బ్రాహ్మణుళ్ళా, సరి చేశాడు. సవరించాడు. సరిచాడు.

నిలచిన చింతడు వంగాడు. సరిగా ఉన్న కాగితం డొంకలో దుమ్ములో పెట్టాడు గాలికి కదులుతుంటే దానిమీద రాయి పెట్టాడు. అది కదలటం లేదని, లేచి పోదని, నిశ్చయంగా నిర్ణయించుకొన్న తరువాత అటూ ఇటూ చూశాడు. నిటారుగా నిలబడి చూశాడు.

నిలచిన చింతడు కదిలాడు అటు పోయాడు నిమ్మకాయ పుచ్చుకొన్నాడు. ఇటు పోయాడు నిమ్మకాయ అందుకొన్నాడు రెండు చేతులతో రెండేసి తెచ్చి కాగితం మీద పెట్టాడు.

చింతడు కదులుతున్నాడు. నడుస్తున్నాడు వెనక్కూ ముందుకూ తిరుగు తున్నాడు. కాగితంలో నిమ్మకాయలు చేరాయి. చింతపండు చేరింది. మిరప కాయలు చేరాయి. ఉప్పు చేరింది. కాగితం నిండింది.

డొంకలోని చింతడు లాగా కాగితం మీద నల్లరాయి కూర్చుని ఉంది. సుడిగాలికి చుట్టూ అటూ ఇటూ అవీ ఇవీ చేరిన చింతడి లాగా నల్లరాయి వాటినీ వీటినీ దులుపుకొంటూ వుంది.

ఆకాశంలో మండిన ఎండ నేలను కాలుస్తూ ఉంది. పొలిమేరలో పుట్టేగాలి ఊరూవాడా ఏకం చేస్తూ ఉంది. చిల్లకంపకు ఎండా, వడగాలీ, ఉడుకు పుట్టిస్తు న్నాయి.

దూరంగా అమ్మ వస్తుందన్న ఆచూకీ తెస్తున్న ఎండవఖావి గాలి గుర్రం మీది చేతగాని రౌతులాగ దౌడుతీస్తూఉంది. చింతడు ఆకాశంలోకి చూచి సూర్యు డున్నాడని గుర్తించాడు. బళ్ళబాటమీద రాబోయే అమ్మకోసం సుదూరం చూచే చూపుకు ప్రాణప్రతిష్ఠ కావించాడు చింతడు.

కాగితం మీది రాయి తీసి ప్రక్కన పెట్టి, కాగితం నలుమూలలు కలిపి పట్టుకొని, పైకెత్తి, ఒక చేతిలోకి మార్చుకొని, కింద పెట్టిన రాయి మరొక చేతిలోకి తీసుకొని, అమ్మ వచ్చే డొంక వైపు తేరిపార జూచి, వెనుదిరిగి, ఇంటి తోవ పట్టాడు చింతడు.

మళ్ళీ వెనుదిరిగి చూడలేదు. అమ్మ రాలేదు. ఎండవచ్చింది. గాలి వచ్చింది. అమ్మ రాలేదు కానీ, వెంట, గాలి వచ్చింది. ఎండవచ్చింది.

ఇంటి ముగింట రాతి రోలు దగ్గర చింతడు ముందు రాయి పెట్టాడు, తర్వాత కాగితం పొట్లం ఉంచాడు.

పాకలో ఈత చాప మీద నల్లరాయి లాగా పడి నిద్రపోతున్న చింతణ్ణి సూర్యుడు కనుమరగవుతున్నప్పుడు అమ్మ లేపింది. ఎండ లేదు. వడగాలి లేదు. సుడిగాలి రాదు. చల్ల గాలి తోలుతూ ఉంది. అమ్మకంట చూపు వెన్నెల వచ్చింది.

చింతడు ఆవులిస్తూ లేచి. అమ్మను చూచి, మెడ వాటేసుకొని, నడుం మీదికి ఎక్కి, అమ్మ ముఖంలోకి చూస్తూ, సర్రున జారి, మూలకు పోయి, ముంత తెచ్చి, అమ్మ మూతి కందించాడు.

'ఇదేందిరా?' అంది అమ్మ.

'నీమలసం!' అన్నాడు చింతడు దీర్ఘాలు తీస్తూ.

'మరి నీకో?'

'తాగా!'

'ఎక్కడిదిరా?'

'తాగు'

అమ్మ ముంతెడు నిమ్మరసమూ ఆపకుండా తాగి చింతణ్ణి ఎత్తుకొని చిల్లర కొల్లరుగా చిక్కురొక్కురుగా పెట్టనచోట పెట్టకుండా గంపెడు ముద్దులు పెట్టింది.

# ఇదీ కథ

మీరు రచయితని మన్నించి వరకట్నాన్ని శాసన కర్తగా నిషేధించమంటే నాకు నా కథే గుర్తుకు వస్తూ వుంది.

నేను మా అత్తా మామల్ని పెళ్ళప్పుడు లంచం అడగలేదు.

అయితే మాకేం అని మీరు అడగవచ్చు. కానీ —

నాకు పది మంది కొడుకులు. పది మంది కూతుళ్ళు.

వాళ్ళందరికి రెండేళ్ళలో పెళ్ళిళ్ళు ముగించాలి.

నేను కట్నం తీసుకోలేదు. కాబట్టి కొడుకులకు తీసికోవటం, కూతుళ్ళకు ఇవ్వటం నా కిష్టం లేదు.

ఇష్టంలేక పోవటానికి మరొక అండ కూడా వుంది.

అది డబ్బు లేకపోవటం.

కొడుకులకు తీసుకుంటే కూతుళ్ళకు ఇవ్వవచ్చునని ఒక మిత్రుడు సలహా యివ్వకపోలేదు.

మొండివాడి కంటే బలవంతుడు లేడు. నేను బలవంతుణ్ణి.

నన్నొక పట్టాన మిత్రు లెవరూ ఒప్పించలేరు, నొప్పించలేరు.

కొడుకులతో మీరు నాలాగ పెళ్ళిళ్ళు చేసుకోండి అని చెబుతాను. వాళ్ళు నా మాట వింటారు. బంగారు కొండలు. కూతుళ్ళతో చెప్పాలంటేనే చిక్కు.

మీ అమ్మకు పెళ్ళి జరిగినట్లే మీ పెళ్ళిళ్ళు జరగాలని కోరుతున్నాను. అంటాను. వాళ్ళు వింటారు.

వీళ్ళు వినటం కంటే ఏమి చెయ్యలేరు. బంగారు కొండలు.

పుత్రులు నా మాట ధిక్కరించి కట్నం పుచ్చుకుంటే నేను చెయ్యగలిగింది ఏమీలేదు.

పుత్రికలు నా మాట ధిక్కరించి కట్నం ఇవ్వాలని తీర్మానించుకుంటే, నా దగ్గర చిల్లి గవ్వ లేదు

కొడుకులైనా, కూతుళ్ళయినా వాళ్ళ అభిప్రాయాలను నేను మన్నిస్తాను.

వాళ్ళ అభిప్రాయాలను మన్నిస్తే నా పర్సు బరువు చూసుకోవలసి వస్తుంది.

అందువల్ల స్వతంత్రంగా ఆలోచించే వాళ్ళ అభిప్రాయాలు నేను తిరస్కరించవలసి వస్తుంది. స్వతంత్రతకు తిరస్కారం.

వాళ్ళకు వాళ్ళ అభిప్రాయాలయినా ఉన్నాయి. అభిప్రాయాలే లేని పసివాళ్ళు లోకంలోని సుగంధాన్ని పీల్చకుండా, ప్రతి ప్రాణి సహజవాంఛ అయినా సంతాన ప్రాప్తి పొందకుండా ముసలివాళ్ళు అయిపోవటం భరించరానిదిగా అనిపించింది.

తల్లి చాటు బిడ్డలు, తండ్రి చాటు బిడ్డలు, తల్లిదండ్రుల చాటు వృద్ధులుగా అంతరించిపోవటం కష్టంగా అన్పించింది.

వరుల్ని కొనుక్కొరాగలిగే వాళ్ళు సంతకు పోయి కొనుక్కొ వస్తారు. కొనలేని వాళ్ళు ఎలాగో కొట్టుకు పోతారు.

కానీ మూతి మీద మీసం ఉన్నందుకు నిదర్శనంగా పిల్లల్ని కని, పిల్లలకు పెళ్ళి చేయటానికి పొలం పుట్రా, నగా నట్రా, ఇల్లూ-వాకిలీ, వళ్లూ గిళ్ళూవల్లకాడు చేసుకొని, వల్లకాటికి కాళ్ళు చాపి, శవాల కంటే హీనంగా, దీనంగా, మ్లానంగా తిండి లేక, బట్టల్లేక, ఇల్లులేక, దిక్కులేని చావు చస్తున్న తల్లిదండ్రుల్ని తలుచుకొంటుంటే కడుపులో పేగులు తరుక్కుపోతున్నాయి.

మరి కొంత మంది తల్లిదండ్రులు కొడుకులతో, బ్రతుకులతో వ్యాపారం చేస్తున్నారు.

కొవ్విన పొట్టేలు రేటుగా బాగా పలికినట్లు, కొడుకుల్ని డిగ్రీలతో, ఉద్యోగాలతో కొవ్వు ఎక్కనిచ్చి రేట్లు వేలం పాటపాడుతున్నారు.

మంచి బేరం చూచి అమ్ముతున్నారు.

ఈ తల్లిదండ్రుల్ని చూశారూ! మరీ చిత్రమయినవాళ్ళు వీళ్ళు. కూతుళ్ళను ప్రోత్సహిస్తారు. ఏమనీ? ప్రేమించమని! ఎవరిని? యోగ్యుణ్ణి! ఎలాంటివాడు? ఆస్తిపాస్తులున్న తండ్రికి ఒక్కగా నొక్క కొడుకు. ఇదీ వరుస.

అటువంటి పెళ్ళిళ్ళు కొన్ని జరిగినా ఎవరూ నిజంగా తృప్తిపడుతున్నట్లు కనిపించటం లేదు.

రచయితగా వరకట్నం నిషేధిస్తూ ఇటువంటి కథ చెప్పాలనుకుంటున్నాను.

కొత్త కాలనీ, పక్క పక్కనే ఇళ్ళు.

ఆ ఇంట్లో ఒక యువతి. ఈ ఇంట్లో ఒక యువకుడు. చూపులు కిటికీల్లోంచి, చెట్ల మధ్య నుంచి దాటిపోయి, నిటారుగా ఎదురెదురుగా నిలబడి చూచుకోవటం దాకా వచ్చాయి.

మాటలు కూడా మొదలయ్యాయి. మాటలు నవ్వులవుతున్నాయి.

మొదట్లో నెమ్మదిగా తర్వాత పకపకా వినబడుతున్నాయి. నవ్వులు.

తల్లులూ, తండ్రులూ చూశారు.

అసలు మెలిక ఇక్కడే ఉంది ఎవ్వరు ఎవర్ని తిట్టలేదు. కొట్టలేదు. ఇల్లొదిలి పొమ్మనలేదు. నా ఆస్తి నీకు లేదనలేదు. నా గడప ఈ గడప తొక్కొద్దనలేదు.

వాళ్ళలో ఒక్కళ్ళిద్దరు నవ్వారు. ఒకరు బాగానే ఉంది వరుస అన్నారు.

యువతీయువకులిద్దరు కలసి మెలసి తిరుగుతున్నారు. ఇక పార్కులు, సినిమాలు.

పిల్ల తండ్రి అనుకున్నాడు.

ఒక్కడే కొడుకు. బంగారం లాంటి ఇల్లు- తండ్రి ముసలివాడు. ఎప్పుడో ఒక సారి హరీ అనో, శివా అనో అంటాడు. ఆ తరువాత ఆస్తి అంతా అల్లుడిదే! అంటే కూతురుదే! రెండిళ్ళ మధ్యా ఉన్న కాంపౌండు గోడ పడగొడితే ఆస్తంతా అఖండం! ఒక్కటే.

పిల్లవాడి తండ్రి దాదాపు ఇలాగే అనుకున్నాడు. వాడి మామది మంచి ఔదార్యం. బాగా సంపాదిస్తున్నాడు ఆస్తి అంతా కొడుకుదే. రెండాస్తులకు యజమాని.

తండ్రులిద్దరు పెళ్ళిమాట మాట్లాడు కోవటం రెండు నిముషాలపని!

ఒప్పందాలు కుదిరినాయి. కట్నంప్రసక్తిలేదు.

ఇట్లాంటి కథ చెబుదామా వరకట్నం లేదు అనటానికి అనుకున్నాను. నా మీద నాకే కోపం వస్తూఉంది.

ఇది నిజంగా కట్నంలేని పెళ్ళా? డబ్బుమీద వ్యామోహం లేని పెళ్ళా?

ఒకందుకు మెరుగు. అటుగానీ ఇటుగానీ ఎవరూ ఏడ్చే పనిలేదు.

కానీ ఇటువంటి కథకు ముగింపు ఏమిటి? స్వేచ్ఛగా తిరుగుతున్న అమ్మాయి, అబ్బాయి. తల్లిదండ్రులకు చెప్పకుండా ఎక్కడో పెళ్ళిచేసుకొని ఎక్కడో స్థిరపడి ఇల్లు కట్టించుకొని, ఆ ఇంట్లోచేరి ముసలి జంటలకు రెండు వాటాలు చూపిస్తే ఆ రెండిళ్ళ అడ్డుగోడ పడగొట్టి అఖండం చేయాలనుకున్న తల్లి దండ్రుల ఆలోచనలు ఎలా ఉంటాయి?

అ ప్రశ్న మంచి ముగింపు కావచ్చు. అయితే ఇలాజరిగే పెళ్ళిళ్లు ఎన్ని? ఇందులోని ప్రయోజనం ఏమిటి? ఇది ఏ వర్గం ఇష్టం తీర్చినట్లు అవుతుంది. నేను ఎవరికోసం ఎవరి జీవితం చిత్రిస్తున్నాను. ఈ ప్రశ్నలు ఆలోచనలై ఈ కథ చెప్పనీయటం లేదు.

రోజూ పత్రికల్లో ఎన్ని వార్తలు. కట్నం తేలేదని కోడల్ని వెళ్ళగొట్టడం-తిట్టడం-కొట్టడం-చంపటం.

క్రూరంగా చంపటం, హింసించి చంపటం. వ్యభిచరించి చంపటం.

ఉరితీయటం, కిరసనాయులు పోసి అంటించడం. చంపి తగల బెట్టడం.

తలచుకొంటే వళ్ళు మండుతుంది ఆర్పడానికి కన్నీళ్ళే ఫైర్ ఇంజన్లు.

వీళ్ళ చేతుల్లో ఎన్ని ప్రాణాలు బలిఅవుతాయి. ఎంత యౌవ్వనం గంగ పాలవు తుంది. ఎంత సౌందర్యం మండి మసి అవుతుంది.

చాలా సందర్భాలలో భార్యకు జరుగుతున్న కష్టం భర్తకు తెలియదు. నూరేళ్ళ భాగస్వామిని సంవత్సరంలో పోగొట్టుకొని ఎంతగా కుమిలి పోతాడో యువకుడు.

యువకుల్ని చూస్తుంటే కుమిలి కుమిలి ఏడవబోతున్న భవిష్యత్ భర్తలు కనిపించి దుఃఖం ముంచుకు వచ్చింది.

యువతులు కనిపిస్తే భవిష్యత్తులో బూడిద కాబోతున్న ప్రాణులు అనిపించింది.

లోకంలో కనిపించే యువతీ యువకులు సొంత వాళ్ళుగా అన్పించసాగారు.

వీళ్ళంతా తమ్ముళ్ళు, చెల్లెళ్ళుగా, కూతుళ్లుగా, కొడుకులుగా, మనుమళ్ళు, మనుమరాళ్ళుగా కనిపించి, అనిపించి గుండె పొంగి, కుంగి, రేగి, ఉరవళ్ళెత్తి, పరవళ్ళెత్తి నాకు ఆరోగ్యం లేకుండా చేస్తూనే వుంచి.

ఈ దేశం నాకెంత సొంతదీ, నాకెంత కావలసిందీ!

ఈ చావుల్ని నేనేమయినా అరికట్టగలనా? నాకేమయినా శక్తివుంధా? రచయిత మేల్కొంటున్నాడు.

నేనిప్పుడే కథ మీకు చెప్పితీరాలి. లేకపోతే నాకు విశ్రాంతి లేదు.

అమ్మాయి అందగత్తె. మెరుపుతీగె. పేరు సుధ. ఆమె అమృతం దాల్చిన ఆకారం,

అబ్బాయి బాగున్నాడు. రవి.

ప్రేమించు కున్నారు.

పెళ్ళాడుదామని నిర్ణయించు కున్నారు.

సమస్య డబ్బు కదా!

అబ్బాయి డబ్బున్నవాడు, అమ్మాయి పేదది.

పెళ్ళికి డబ్బు అడ్డంకాదా! అవును.

అందుకే పెళ్ళి సజావుగా జరగలేదు.

రిజిష్టర్ ఆఫీసులో తతంగం ముగిసింది.

రవి, సుధను ఇంటికి తీసుకపోయిన రోజున.

'అమ్మాయి అందంగావుంది' అంది తల్లి.

మామ ఎగాదిగా చూశాడు. బావ కట్నం ఎంత అన్నట్లు చూస్తే,

'ఇప్పుడేమీ ఇవ్వలేదు. తర్వాత ఇస్తారు' అన్నాడు రవి.

'ఎప్పుడిస్తాడు మీ నాయన కట్నం' అని అందరూ అడగటం, ఎత్తి పొడవటం, ఎగతాళి చేయటం శ్రుతి మించింది.

ఒకసారి పెళ్ళిలో నలుగిరి ఎదుట అవమానం ఎదురయ్యింది.

అత్త ఛీదరించుకోసాగింది.

మామ సణుగుతున్నాడు.

బావ వంకరగా చూస్తున్నాడు.

రవి ఇంట్లో వుంటే సుధకు భయం లేదు. కానీ అతను లేకపోతే వణికిపోస్తుంది.

బావ రేప్ చేసి, గొంతు పిసికి చంపుతాడని దిగులు.

మామ పలుపూ, పగ్గం తెస్తే దూలానికి ఉరి తీయటానికే అనుకొంది.

ఇంటి ముందు బండి కట్టెలు రాసి పోస్తే తనను తగులపెట్టడానికే అనుకొంది.

కిరసనాయిలు టిన్ను తిస్తే ఆ రాత్రి నిద్రపోలేదు.

తాను తగులబడుతూ, అరుస్తూ, వీధిలో పరుగెడుతున్న దృశ్యం కనిపించింది.

తన భయాన్ని భర్తతో చెప్పింది.

'ఏం ఫర్వాలేదు. అమ్మ, నాన్న అందరూ మంచి వాళ్ళు. నీ అందం వాళ్ళను జయించింది. నీ అణుకువ వాళ్ళకు నచ్చింది. నీకేం చింతలేదు. ఏదో ఒక రోజున వాళ్ళకేం ఆస్తి లేదు. ఏమీ ఈయలేరు అని నేనే తేల్చి చెబుతాను!' అని నచ్చ చెప్పాడు.

అయినా సుధకు నిద్ర పట్టటం లేదు.

అందువల్ల మంచం పట్టింది.

ఇప్పుడు సుధ అందగత్తె అని ఎవరూ అనరు. అన్నా వినరు. విన్నా ఒప్పుకోరు.

భయం మనిషి రూపం మార్చేసింది.

అందం హత్య చేయబడింది.

తల్లిదండ్రీ ఏడ్చారు.

అయినా ఆ యింటిలో వాతావరణం గమనించారు.

సుధ ఆరోగ్యం కోసం ఆ యిల్లు అల్లాడిపోవటం చూశారు. భయం లేదని చెప్పారు.

అయినా సుధ భయం సుధకుంది.

ఇట్లా అయితే ఈ కథ ముగిసేట్లు లేదు.

ఏదో విధంగా ముగింపు చెప్పాలి.

పట్టణంలో రవికి ఉద్యోగం వచ్చి, పల్లె వదిలి వెంట సుధను తీసుకుపోవాలని అంటున్నప్పుడు అంత జ్వరంలోనూ, సుధ ఎగిరి గంతేసి, రవి మెడ వాటేసుకొని సినిమా హీరోయిన్‌లా నవ్విందని కథ ముగించవచ్చని అనుకొంటుంటే నాకు వళ్ళు చురచురలాడడం మొదలుపెట్టింది.

నా కథలో నేను నా యిష్టం వచ్చినట్లు సుధకు కట్నం లేకుండా పెళ్ళి చేశాను.

బాగానే వుంది.

అయితే అందం ఎర చూపించాను.

మరి అందం లేని చెల్లెళ్ళ కథ ఏమిటని? పెళ్ళి పెటాకులూ లేకుండా పోవాలా ?

సుధకు పెళ్ళయితే మాత్రం ఏం సుఖపడింది?

భయంతో సగం చావు చావనే చచ్చింది.

ఆమె సౌందర్యం నశించింది.

ఈ పితలాటకాలులేని పెళ్ళి జరగాలంటే యువకులు ధైర్యవంతులు కావాలి.

రవి ధైర్యవంతుడే, కానీ 'కట్నం తీసుకోను' అన లేని పిరికివాడు. అధైర్యవంతుడు.

ఈ మాత్రం ధైర్యం లేనివాళ్ళు ఎంత మంది యువకుల్లేరు.

తల్లి దండ్రులు, వంశం, కులం, మతం, అంతస్తు, ఐశ్వర్యం గీసిన గీతల్లో బందీలు ఎందరులేరు ?

ధైర్యం లేని యువకుణ్ణి కట్టుకొన్న యువతి నరకం అనుభవిస్తుంది.

యువకుడి మీద ప్రేమ, వాడి పిరికితనం మీద దిగులు, ఉంటే యువతి బ్రతుకు ఏమౌతుంది ?

జానకి కథ అవుతుంది. నాలోని రచయిత వెలుపలికి వస్తున్నాడు.

ఈ కథంతా నాలుగు ముక్కలే కదా !

మాంసం ముక్కలు తక్కువయినప్పుడు మా యింట్లో మసాల ఎక్కువ నూరుతారు. మాంసం కూర రుచిగానూ ఉంటుంది.

కథ తక్కువైతే మసాలా నూరటం, కూరటం నాకూ తెలుసు.

మీకు కథల మీద ఆసక్తి ఎక్కువ కదా ?

నాకు మసాళా సాహిత్యం కూడా వడ్డించటం తెలుసు.

నేను అభినవ సాహితీ భీముణ్ణి, నలుణ్ణి !

పాకం బాగుంటుంది.

ఎంత బాగున్నా గుండె కలకగా ఉంది. జానకి కథ తలచుకొంటుంటే.

జానకిని రాముడూ ప్రేమించాడు. కృష్ణుడూ ప్రేమించాడు.

రాముడు బీదవాడు.

కృష్ణుడు ధనవంతుడు. పొగాకు కంపెనీ ఓనరు.

బీదతనం బీదతనాన్ని వరించింది. సీతారాముల ప్రేమ తల్లితండ్రులు విన్నారు.

కట్నం లేందే వీలు లేదన్నారు.

రాముడు తండ్రి మాట జవదాటడు

కృష్ణుడి ప్రేమ కామం, మోసం, దాహం.

జానకి పక్కలోకి కావాలి భార్యగా వద్దు

రాముడికీ, జానకీ కావాలి, కట్నమూ కావాలి.

జానకి ఇంట్లో ఆ రోజుకు తిండిలేదు.

ఈ ముక్కోణపు ప్రేమలు, పెళ్ళిళ్ళు, విరహాలు, తాపాలు, పాపాలు, త్యాగాలు, కన్నీళ్ళూ మీకు బాగా తెలుసు. నేను కొత్తగా మీకు చెప్పవలసింది ఏమీ లేదు.

చేతయినా ఇందులో నేనేమీ మసాళా నూరదలచలేదు. కూరదలచలేదు.

ఉన్న మాట ముక్కుసూటిగా చెప్పి కథ ముగిస్తున్నాను.

జానకి, కృష్ణుడి కోర్కె తీర్చింది. డబ్బు తీసుకుంది.

రాముడి కోర్కె తీర్చింది. కట్నం ఇచ్చింది.

పెళ్ళయింది ఆమె సంసారం సుఖంగావుంది. అని అనాలంటే తలకాయలో సూదులతో పొడిచినట్లుంది.

ఆమె సంసారం సుఖంగా ఉంటుందా ? ఉంటుందని అన్నప్పటికీ, ఆమె ఏమీ ఎరగనట్లు ఉండగలుగుతుందా ?

నాకు ఇంకొక సందేహం—

ఈ యువకుల చేతకానితనం మీద నాకు కసి ఉందా ? ఈ వ్యవస్థ మీద ద్వేషం ఉందా ? ఈ విధానం మీద పగ ఉందా ?

రచయితకు కసి, ద్వేషం, పగ ఉండవచ్చునా ?

నాలో ఉడికి పోతున్న రచయిత కఠినంగా నిషేధ శాసనం చేస్తున్నాడు.

నా గుండెలో వణుకు ప్రారంభమయింది.

వరకట్నం నాకు ధనాశ అనిపించింది. మానసిక వ్యాధి అనిపించింది. దోపిడీ అనిపించింది. ఆశపోతుతనం కూడా అనుకొన్నాను. జబ్బు, పీడ, పిచ్చి తనం, వెధవాయిత్వం అనుకొన్నాను. కానీ తీరుబడిగా ఆలోచిస్తే పేదరికం పెల్లు బికిన, పేట్రేగిన, తగలబడుతున్న దేశంలో ఇది ఆర్థిక విధానం మీద ప్రశ్నగా సమస్యగా అన్పించింది.

భార్యగా వచ్చే మనిషి జీవితం పొడుగునా తినటానికి తెచ్చుకొనే గెంజలు కట్నం డబ్బులు.

మరి ఒకనాటి కన్యాశుల్కం జీవితాంతం ఇంటి పనీ, వంట పనీ చేయటానికి పని మనిషిని కొనుక్కోవటం.

దాంపత్య ధర్మం మహోత్కృష్టం; వేదవేదాంగాలు ఈ సత్యం ఘోషిస్తున్నాయి. ఏ ధర్మం అయినా నాశనం కావచ్చు, 'దాంపత్య ధర్మం ఈ గడ్డ మీద మట్టి గొట్టుకు పోదు' అని పొంగిపోయే, పొగరుకు పోయే, మనం కొనటం, అమ్మటం దాటలేమా ?

ఆర్థికంగా బాగుపడితే దాటవచ్చు.

ఎప్పుడూ బాగు పడటం?

అందాకా స్త్రీ ఆర్థికంగా స్థిరపడితే కట్నం గోల తప్పవచ్చు.

ఆస్తి పాస్తులులేని ఆడపిల్లలు ఏదైనా పనిచేయగలిగేవాళ్ళు కావాలి. స్వశక్తిమీద బ్రతుక గలిగే వాళ్ళు కావాలి.

చదివినా, చదవకున్నా ఏదో ధర్మమైన సంపాదన చేయగల వాళ్ళుగా ఆడపిల్లలు పెరగాలి. మనం పెంచాలి.

దేశం నిండా కనిపించే చెల్లెళ్ళనూ, కూతుళ్ళనూ, మనుమ రాళ్ళనూ, ధనవంతులు కమ్మని ఆశీర్వదిస్తున్నాను.

నాగుండె నింతగా దండించిన మీకు నేనేం చెప్పేది, శుభం తప్ప, నా గుండె నింతగా దండించిన పండిచిన మీకు శుభం.

